'హాసం'
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# ఇదీ సంగతులు

30

# హాస్యం - సంగీతం

















'సెంటర్ స్ప్రెడ్'లో - 'మన్మథుడు' 'ఒకే ఒక్కడు' సినిమా పాటల పుస్తకాలు కలర్‌లో

ముఖచిత్రం: 'మన్మథుడు' సినిమాలో సోనాలి బింద్రే, నాగార్జున

'హాసం' మొట్టమొదట సారిగా 1-15 నవంబరు సంచిక కొన్నాము. చాలా బాగుంది. మా ఇంట్లో అందరికీ తెలుగు సినిమాల్లో పాటలంటే చాలా ఇష్టము. కాని నాకు మాత్రం పాతవంటేనే ఇష్టం. కొత్తవి నచ్చటంలేదు. కాని హిందీ సినిమా పాత పాటలంటే చెవికోసుకుంటాను. ముఖ్యంగా సైగల్, ముఖేష్‌వి. నేను ఇప్పటికీ రేడియో సిలోన్ వింటుంటాను. హిందీ సినిమా పాటల గురించి ఇంకా ఎక్కువ పేజీలు కేటాయిస్తే బాగుంటుంది. 'హాసం' పక్షపత్రిక సంగీత, ముఖ్యంగా పాతకాలపు సినిమా సంగీత ప్రియులకు ఒక వరం లాంటిది. ఈ పత్రిక ఎన్నో కాలాలపాటు వర్థిల్లాలని మా అందరి ప్రగాఢమైన ఆకాంక్ష.

**-కర్రి శేషగిరిరావు, మెహదీపట్నం**

నేను'హాసం' రెగ్యులర్ రీడర్‌ను. 16-31 నవంబరు 2002 సంచికలో మీరు ప్రచురించిన వెన్నెలకంటి సినీ గీతాలు మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకున్నాయి. అలాగే చిత్తరంజన్ గారి లలితసంగీతం, ఇంకా ఇతర శీర్షికలు, కథలు, కార్టూన్లు మమ్మల్ని కడుపుబ్బ నవ్విస్తున్నాయి. ఈ సంచికలో మీరు తెలియపరిచిన 'వాయిస్ ఎనాలిసిస్' గురించి ఇంకా విపులంగా తెలుపగలరు.

**-తిరునగరి శ్రీనివాస్, నిజామాబాద్.**

గత నాలుగు సంచికల నుండి 'హాసం' చదువుతున్నాను. 'ఆత్మీయ బంధువు' దొరికినట్లనిపించింది. అన్ని శీర్షికలు బాగుంటున్నాయి. నవంబరు రెండో సంచికలో ప్రచురించిన పద్మనాభం ఆత్మకథ, రావికొండలరావు రచన(బి.ఎన్.రెడ్డి గారి గురించి రాసినది), 'ఇద్దరు మిత్రులు' సినిమా నవల బాగున్నాయి. పద్మనాభం గారి ఆత్మకథలో ఓ చిన్న తప్పు దొర్లింది. "షావుకారు" చిత్రానికి ఆత్రేయ రచన అని రాసారు. కానీ ఆ చిత్రానికి కథ, సంభాషణలు చక్రపాణి రాయగా, పాటలను (సీనియర్) సముద్రాల రాశారు.

**-పి.దక్షిణామూర్తి, తెనాలి.**

('షావుకారు' చిత్రానికి మొదట ఆత్రేయనే తీసుకున్నారు. ఆ సినిమాకు రచన చేస్తుండగా ఆయనకు 'రుమాటిక్ పెయిన్స్' వచ్చాయి. అంచేత రచన చేయలేకపోయారు. అప్పుడు ఆయన చేత విజయా వారు రాజీనామా ఇప్పించుకున్నారు. పద్మనాభంగారు ఆ జ్ఞాపకం మీద రాసి వుంటారు.

**- ఎడిటర్)**

'హాసం' 16-30 నవంబరు సంచికలో 'గూంజ్ ఉఠీ షెహనాయి' హిందీ చిత్రంలోని పాట 'తేరే సుర్ ఔర్ మేరే గీత్ ' అనే పాటని 'అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం' శీర్షికలో ప్రచురించినందుకు చాలా ఆనందం. ఈ పాటంటేనే నాకు చాలా ఇష్టం. నేను చిన్నప్పుడు ఈ పాటను చాలా సందర్భాలలో పాడి ప్రశంసలు పొందానుకూడా. అయితే పాటలో చిన్న తప్పు. అది మొదటి చరణంలో-"ధడకన్ మే తూహీ తూ ఛాయా హువా" అని వేశారు. కానీ అసలు ఇలా ఉండాలి.

"ధడకన్ మే తూహీ సమాయాహువా
ఖయాలోఁ మే తూహీ తూ ఛాయాహువా"




**-డాక్టర్. రాచర్ల రాధాకృష్ణ,**
**గోదావరి ఇంక్లైన్ కాలనీ.**

1-15 డిసెంబరు సంచికలో అమరగాయకులు ఘంటసాల వారి గురించి మాలతీ చందూర్ గారి మాటల్లో శ్రీ ఘంటసాల గారి గురించి కొత్త విషయాలు తెలుసుకొన్నాము. శ్రీమతి సావిత్రి గారికున్న సాహిత్యాభిలాష శ్రీ ఘంటసాల వారి గురించి వారు హాసంలో రాసిన వ్యాస పరంపరలో ప్రస్ఫుటమయింది. ఆ శైలి, భావ వ్యక్తీకరణా చక్కటి పుస్తకాలు చదివిన వాళ్ళకే సాధ్యం.

శ్రీ తనికెళ్ళ భరణి గారి కాలమ్ హాసంకు ఒక ఎస్సెట్. కేవలం హాస్య నటుడుగానే మాకు తెలిసిన శ్రీ భరణిగారిలోని విద్వత్తును అస్మదీయులకు తెలియజేస్తున్నందుకు హాసం సంపాదక వర్గానికి హృదయపూర్వక కృతజ్ఞతలు.

**- ఉషా మధుసూదన్, హైదరాబాద్**

ఈ శీర్షిక ఆనందంలో ముంచెత్తింది. ఈ శీర్షిక హృదయాన్ని కదిలించింది. లేక పోతే ఇంకో పేజీ మా మధురానుభావాల పుస్తకంలో పాత పేజీలు గుర్తుకు తెచ్చింది. అలా అలా ఎన్నిటి గురించి చెప్ప మంటారు? మొత్తం అన్ని పేజీలు కళ్ళు తిప్పనీకుండా మనసు చెదరనీకుండా వేరే ఆలోచనలకు తావునీకుండా ఎంతసేపు చదివినా తనివి తీరదు. ఎంత చదివినా 'హా' ఇంకా 'సం' ఎదో మిగిలి ఉంది అనిపిస్తూ ఉంది. నిజంగా మీకు ఎన్నీ సార్లు ధన్యవాదాలు చెప్పినా తక్కువే మీరు ఇలా కలకాలం ఆయురారోగ్యాలతో అష్టైశ్వరాలతో తుల తూగాలని ఆశిస్తూ ఆకాంక్షిస్తూ....

**నళిని కుమారి**
**పాటిగడ్డ కాలనీ, సికింద్రాబాద్.**

1-15 డిసెంబర్, 'హాసం'లో 'హిందీ సినీ సంగీతంలో మలుపులూ - మజిలీలు' హెడ్‌లైన్‌తో మాఫేవరేట్ గాయకులు అయిన ముకేష్, తలత్ మహమూద్ మరియు మాఫేవరేట్ గీత రచయితలు అయిన మజ్రూహ్‌సుల్తాన్‌పురి, ఇందీవర్ మరియు మామ్యూజిక్ డైరెక్టర్ చిత్రగుప్త, మాఫేవరెట్ గాయకురాలు గీతాదత్‌ల ఫోటోలతో పాటు వారి సినీరంగ విశేషాలు చూచి, చదివి ఆనందించాం. అదేవిధంగా పద్మనాభం ఆత్మకథ, కిషోర్ జీవనఝరి సీరియల్స్ ఆసక్తికరంగా కొనసాగుతున్నాయి. ఈ సందర్భంగా 'హాసం' బృందానికి కృతజ్ఞతలు.

**ఎం.డి. ముస్తభీమ్,**
**కొల్లాపూర్.**

నేను మీ 'హాసం' పత్రిక అభిమాన పాఠకుణ్ణి. ఈనెల అనగా 1-15 డిసెంబర్,2002 సంచిక బాగుంది.

ముఖ్యంగా ఘంటసాల గురించి మాలతీచందూర్ వ్యాసం, "స్వరంజీవి, స్మరంజీవి, చిరంజీవి ఘంటసాల" అనే తనికెళ్ళభరణి గారి వచన కవిత చాలా బాగుంది.

ఇలాంటి ఉత్తముడిగురించి ప్రచురించి నందుకు 'హాసం' యాజమాన్యానికి కృతజ్ఞులు.

'హాసం' పత్రిక గురించి నా అభిప్రాయం "భరణి కురిస్తే ధరణి పండుతుంది 'హాసం' చదివితే మనసు నిండుతుంది"

**విజయరాఘవన్.కె,**
**వరంగల్**

నాకు అసలు పుస్తకాలు చదివే అలవాటు లేదు. మేగజైన్స్ అసలు చదవను. జూన్ 2002 నెలలో అనుకుంటాను. ఇక్కడ మువ్వలవానిపాలెం ఎవరింటికో వెళ్లి వాళ్ల టీపాయ్ మీద 'హాసం' చూసాను. చాల ఇంప్రెస్ అయ్యాను. నా మనసును బాగా ఆకట్టుకుంది. ఇంటికి వచ్చి శ్రీమతితో చెప్పాను మర్నాడే కాపీ తెప్పించింది. అప్పట్నించి తప్పకుండా చదువుతున్నాము. మీరు ప్రవేశ పెట్టిన శీర్షికలు ముఖ్యంగా పాత సినిమాలు, వాటి సంగీత దర్శకులు, పాటలు, సాహిత్యం, వాటి విశ్లేషణ చాలాబాగుంది. శ్రీ చిత్తరంజన్ గారి సంగీత ఝరి బాగుంది. హిందీ సినిమాలు, వాటి నటీనటులు, సంగీత దర్శకుల గురించి వ్రాస్తూవుంటే యింకా బాగుంటుంది. కొత్త సినిమాల గురించి ప్రస్తుతం అందరికీ తెల్సినవే. పాత సినిమాలు, వాటి సంగీత సాహిత్య మాధుర్యం మాకు వండి వడ్డిస్తున్నట్లుగా శీర్షికలను వేస్తున్నారు. ఇది ఇలాగే కంటిన్యూ చేయండి. మీ హాసం పూర్తిగా చదువుతున్నాను.

**కె.ఎస్.కె. భగవాన్,**
**విశాఖపట్నం.**

ఆ పాత మధురంలో 'మాయాబజార్' పాటల వివరాలు చాలా చక్కగా ఉన్నాయి. ఈ కథను సురేఖాహరణ్, శశిరేఖా పరిణయం, వత్సలా కళ్యాణం, వీర ఘటోత్కచ్ అనే అనేక పేర్లతో చాలా మంది తీశారు. బాబూరావ్ పెయింటరు మూకీ చిత్రం(1925), నానూభాయ్ వకీల్ టాకీ చిత్రం(1932), ఆర్.పద్మనాభం తమిళ చిత్రం (1935), పి.వి. దాసు తెలుగు చిత్రం, జి.పి పవార్ మరాఠీ చిత్రం(1939), దత్తా ధర్మాధికారి హిందీ, మరాఠీ చిత్రాలు(1949), బాబూభాయ్ మిస్త్రీ హిందీ చిత్రం(1958), శాంతీలాల్ సోనీ హిందీ చిత్రం(1970), బాబూభాయ్ మిస్త్రీ హిందీ, గుజరాతీ చిత్రం(1984)- ఇలా ఎన్నో సినిమాలున్నా విజయా వారి 'మాయాబజార్' కు అవేమీ సాటిరావు. ఇతర కళాఖండాలు కూడా 'ఆ పాత మధురం' లో చోటుచేసుకుంటాయని ఆశిస్తాను. అలాగే 'అర్థం చేసుకుందాం' శీర్షికలో క్లిష్టమైన 'హెన్నా' 'రజియాసుల్తానా' పాటల గురించి రాస్తారని ఎదురుచూస్తున్నాను.

**వై. శేషగిరిరావు, జయపురం,**
**(ఒరిస్సా)**

సంపుటి : 2 సంచిక: 6

16-31 డిసెంబరు 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

30

గత పక్షం పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో సంగీతం గురించి ముఖ్యమైన పరిణామాలు చోటుచేసుకున్నాయి. తెలుగు విశ్వవిద్యాలయం విశిష్ట పురస్కారాన్ని డా॥బాలమురళీకృష్ణకు ప్రదానం చేసే సభలో ముఖ్యమంత్రి తనకు కూడా సినిమాలు చూడాలని, సంగీతం వినాలని ఉంటుందని, కానీ సమయాభావం వల్ల కుదరటం లేదని వెల్లడించారు. బాలమురళీకృష్ణను స్వరాష్ట్రానికి వచ్చి స్థిరపడమని ఆహ్వానించారు. మానవ స్వభావంపై సంగీతం కలిగించే ప్రభావం గురించి పరిశోధనలు జరుగుతున్నాయన్నారు.

అంతకుముందు రోజు తెలుగు విశ్వ విద్యాలయంలో కర్ణాటక,హిందూస్తానీ సంగీతంలో ఉన్నత స్థాయి సంగీత పరిశోధనా కేంద్రాన్ని ఏర్పాటుచేయాలన్న ప్రతిపాదనను పలువురు ప్రముఖులు సమావేశమై బలపరిచారు. సంగీతం కచేరికి పరిమితం కాకుండా ఒక శాస్త్రంగా, ఒక కళగా గుర్తించి దానిని పరిశోధించి అభివృద్ధి పరిచేందుకు, భావి తరాల కోసం భద్రపరిచేందుకు ఈ కేంద్రం ఉపయోగపడుతుందని, ఏ ప్రాంతానికి చెందిన వారైనా సరే విద్వాంసులను ఆహ్వానించి వారి అధ్యయనాన్ని ప్రోత్సహించేందుకు ఈ ప్రామాణిక సంస్థ ఉపయోగపడుతుందని యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ డా॥ జి.వి.సుబ్రహ్మణ్యం గారన్నారు.

మర్నాడు తన ప్రసంగంలో శ్రీ చంద్రబాబు నాయుడు దీనికి సైన్సును జోడించారు. బయో టెక్నాలజీ రంగంలోని తాజా పరిశోధనల్లో ఆరోగ్యంపై సంగీత ప్రభావం కూడా ఉందని గుర్తించారన్నారు. "మనిషిలో సుమారు 40వేల జన్యువులు ఉంటే వీటిలో మనం గుర్తించినది, అధ్యయనం చేస్తున్నది కేవలం 2500 మాత్రమే! మనిషిలోని ఏ జన్యువు ఏ అంశంపై ప్రభావం చూపుతోంది అనేది గుర్తించే ప్రయత్నంలో శాస్త్రవేత్తలున్నారు. ఈ నేపథ్యంలో పర్యావరణం, సంగీతం కూడా జన్యువులపై ప్రభావం చూపుతాయి" అన్నారు.

అంతేకాదు ఆయన మాటల్లోనే చెప్పాలంటే "సంగీతం మనిషికి ఆనందాన్ని, విశ్రాంతిని ఇస్తుంది. మనిషికి మంచి ఆలోచనలు ఇస్తుంది. శరీరాన్ని పూర్తిగా మంచి ఆలోచనలతో రీఛార్జి చేస్తుంది. సృజనాత్మకతను పెంచుతుంది" సంగీత ప్రభావం గురించి చక్కటి అవగాహన కనబరచిన మన ముఖ్యమంత్రి ప్రభుత్వ కార్యాలయాలలో సామర్థ్యం పెంచడానికి సంగీతాన్ని ఉపయోగించే విషయం గట్టిగా ఆలోచిస్తారని ఆశించవచ్చు.

ఈ గవర్నెన్స్ వడివడిగా అడుగులు వేస్తున్న ప్రభుత్వం కంప్యూటర్ వాతావరణానికి అనుకూలమైన పరిస్థితులు కూడా ఏర్పాటు చేస్తే మంచిది. కంప్యూటర్‌పై ఎక్కువ గంటలు పనిచేసిన కొద్దీ-ముఖ్యంగా డేటా ఎంట్రీ విభాగాలలో -'మొనాటనీ' పెరిగి సామర్థ్యం తగ్గుతుంది. వారికి మృదువైన వాద్య సంగీతం వినిపించడం ద్వారా ఆ మానసిక అలసట పోతుంది. విసుగు తగ్గుతుంది.

ఈ విషయం గుర్తించిన ప్రైవేటు కంపెనీలు ఈ 'పైప్డ్ మ్యూజిక్' సౌకర్యాన్ని ఎప్పుడో ప్రవేశపెట్టాయి. ప్రైవేటు రంగంతో ప్రభుత్వ రంగం పోటీ పడవలసిన ఈ తరుణంలో తమ ఉద్యోగస్తులలో ఉత్తేజాన్ని, సృజనాత్మకతను పెంపొందించడానికి ప్రభుత్వం కూడా ఇలాంటివి చేపట్టాలి.

ప్రయోగాత్మకంగా ఈ-సేవా కేంద్రాలలో 'పైప్డ్ మ్యూజిక్' సౌకర్యాన్ని ప్రవేశపెట్టి సంగీతాన్ని సమాజ శ్రేయస్సుకు ఉపయోగించుకునే ప్రక్రియలో ఒక అడుగు ముందుకు వేయమని ముఖ్యమంత్రి గారికి "హాసం" పాఠకుల తరపున, సంగీతాభిమానుల తరపున విజ్ఞప్తి చేస్తున్నాం.



HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
K.I.Varaprasad Reddy
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

Printed at: Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

Published at: 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

Editor: RAJA

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

# ఇకనుం'చైనా'......

- కె.కె. రఘునందన

"ప్రపంచంలో అత్యధిక జనాభాగల దేశం ఏది?"

అంతుదయాన్నే జనరల్ నాలెడ్జి ప్రశ్నలతో ప్రారంభించిన మొగుడుగారిని ఎనలేని ఆశ్చర్యంతో సూటిగా చూసింది శ్యామలాంబ.

"ఈరోజు ఆదివారం కదా! కాస్త ప్రశాంతంగా వుండకుండా బడిలో పిల్లల నడిగినట్లుగా ఆ ప్రశ్నలేంటి?" అన్నది.

ఇంక...రెండో ప్రశ్న... ప్రపంచంలో అతి పెద్దగోడ ఏదేశంలో ఉన్నది... దీనిక్కూడా..." అని పేపర్లోకి చూడసాగాడు నిరుపమరావు.

"ఎపుడో దుంపల బడిలో చదివానని ఎద్దేవా చేయటానికా...? లేక నా నాలెడ్జి మీద మీకు అపనమ్మకమా... ఎందుకా ప్రశ్నలు!" చివ్వున చూసింది శ్యామలాంబ...

"అబ్బే... అదేం లేదులే... నీ జ్ఞాన సముపార్జన పై నాకు అపార నమ్మకమేగాని... ముందు నేనడిగిన వాటికి జవాబు చెబితే... నీకో మంచి శుభవార్త చెబుతా..." అని వెనుక మాటుగా వెళ్ళి... గోముగా అడిగాడు నిరుపమరావు...

"ఓస్! ఈ ప్రశ్నలు ఏ ఎల్.కె.జి. పసిగుడ్డునడిగినా చెప్పిపారేస్తాడు..'' తేలిగ్గా అనేసింది శ్యామలాంబ.

"నేనడిగింది నిన్నూ...!!" ఒత్తిడి చేసాడు.

"నన్ను అంత తక్కువ అంచనావేయొద్దు... వినండి!! మీ మొదటి ప్రశ్నకి ఆన్సర్ చైనా... రెండోది కూడా అదే చైనాలో ఉంది. ది గ్రేట్ వాల్ ఆఫ్ చైనా... వారి భాష 'చైనీస్'... వారి కరెన్సీ...

"ఆఁ చాల్చాలు... నీ పాండిత్య ప్రకర్షకి ఫుల్‌స్టాఫ్ పెట్టెయ్!!"

నాటకీయంగా పలికాడు నిరుపమరావు...

"నే నాగుతాగాని... ఆ శుభ వార్త ఏమిటో విన్నవింపుడు..." ఆమె సైతం అదే నాటక పక్కీలో అన్నది.

"మనకెన్నో విధాలుగా చైనా గొప్పతనం తెలుసు. కాని మరింకో విషయంలో కూడా చైనా ముందడుగు వేయబోతోంది. ఆ అడుగు ఆర్థికంగా వెనుక బడ్డ మనలాటి వారి పాలిట గొడుగులా నీడ నివ్వ బోతోంది."

"అబ్బబ్బ!! చైనా ఏమిటి! మనకు గొడుగు కావటమేంటి" చెప్పండి మహాశయా...!!

"అదేవస్తున్నా... నువ్వింతకాలం నన్ను నానారకాలుగా దెప్పి పొడుస్తున్నావా లేదా?"

"దేనికి?"

"దేనికా...?! పండగొస్తేచాలు కంచిపట్టుచీర కొనలేదని సాధించేదానివి... పక్కింటి పరమాత్మగారు స్కూటర్ స్టార్ట్ చేసినప్పుడల్లా బండి కొనలేదని వేధించేదానివి... కూల్‌డ్రింక్ తాగిన ప్రతీసారి ఫ్రిజ్‌లేని విషయం దెప్పేదానివి... ఇంకా చెప్పాలంటే..."

"బోలెడున్నాయంటారు...ఔను. ఇప్పుడవి సర్వసాధారణమైపోయాయి. అందుకని కొన్నాలన్నాను... తప్పా..."

కమాల్ ప్రశ్న - ధమాల్ కార్టూన్



టీచర్లు నడిపే బస్సు?

సిలబస్సు

"నాలాటి ఏబ్రాసి భర్తల వల్ల కోరికలు తీరని నీలాటి భార్యల నిరసన, వాగ్యుద్ధాల మధ్య నలిగి పోతున్న భర్తలకు వరంలా... చైనా నుండి సరుకులు వస్తున్నాయంట. అవి మహాచవకట. మన దేశంలో ఒకచోట ఓ రేటు మరో చోట మరో రేటుతో అడ్డకు పడ్డా అమ్మకాలు సాగిస్తున్న వ్యాపారస్తులకు చెంప పెట్టులాగవుతుందిట. "అనేసి పొంగి పోతూ చెప్పాడు నిరుపమరావు.

"ఎట్టెట్టా... మనకూ మంచిరోజు లొస్తున్నాయన్న మాట..." ఆనందంగా అన్నది శ్యామలాంబ.

"అంతే కాదు శ్యామూ! రేపో మాపో ప్రైస్ లిస్ట్ వస్తుందిట... అది చూసాక మనం ఏమేం కొనాల్సింది నిశ్చయించుకుందాం సరేనా"... అనేసి తను ఆఫీసుకు బయలు దేరాడు నిరుపమరావు.

***

ఆఫీసులో వామనమూర్తి ఈ చైనా సరుకుల సమాచార సేకరణ నిమిత్తమై కాకిలా తిరుగుతున్నాడీ మధ్య... అతగాడు తెచ్చే కొత్త సంగతుల కోసం అర్రులు చాస్తూ చూస్తున్నారు స్టాఫ్.

ఆరోజు వామనమూర్తి ఒక్కసారి సుడిగాలిలా దూసుకువచ్చాడు. అందరి కళ్ళు అతడివైపే ఒక్కసారి తిరిగాయి. చొక్కా నలిగిపోయి వున్నది. జుత్తు చెదరిపోయింది. ఒకటే ఆపసోపాలు పడ్తున్నాడు.

"రండి... మిత్రుల్లారా రండి... శుభవార్త... చైనా సరుకుల ధరల పట్టిక తాజాగా దిగింది...పట్టు కొచ్చానోచ్..." అనగానే... పనులన్నీ ఆపేసి మరీ సీట్లలోంచి ఒక్కగెంతుగెంతారు.

పేపర్ చుట్టూ చేరిపోయారు... తలో వైపులాగితే చిరిగేలా వున్నది...

"ప్లీజ్ సిడౌన్.." ఒక్క వెర్రి కేక వేసిన వైపు చూసి అదికారు. మరెవరో కాదు. ఆఫీసర్ ఆదిరాజు. ఆయనా పేపర్ అందుకుని కళ్ళు వెడల్పుగా చేసేసుకుని పేపర్లోకి బుర్రకూరుకు పోయేలా చదవసాగారు.

"ఓహో? ఆహా! వండ్రఫుల్... భలే...భలే..." అంటూ ఒకటే నవ్వులు పక

వకమంటూ... వెఱ్రి ఆనందంలో మునిగిపోతూ...

"ఏంటి గురూగారు ఆ వెఱ్రి సంబరమేంటి..." అడిగాడు రామేశ్వర్.

"ఇంతకంటే సంతోషం మరెక్కడుందయ్యా! కారు చౌగ్గా కొనేస్తుంటేనూ... చప్పట్లు కొట్టి... విజిల్ వేసాడు ఆదిరాజు.

"ఆఁ! ఏదీ పేపరిలా మా మొహం మీద కొట్టండి..." అని నిర్మొహమాటంగా అడిగి లాక్కుని మరీ చూసిన వాడు పవన్ తనయ్. అతడూ అదే పద్ధతిలో కోతిగెంతులేసాడు.



ఎవరికి వారే పేపర్ చదవటం వెఱ్రి గెంతులు వేయటం...ఇదీ వరస...

"ఛీ! నా డొక్కు హొండా అమ్మేసి చైనా కారుకొనుక్కుంటా" ప్రణవనాథ్ ఆశగా అన్నాడు.

"ఎంతకుబాబూ అమ్ముతావు..." అడిగాడు భీమమూర్తి.

"నీకైతే పది హేడు వేలకే ఇచ్చేస్తా!" అన్నాడు ప్రణవనాథ్.

"మానాయనే... నేనేం అంత చవటను కాదు... నేనూ చైనా వెహికిల్ కొంటా..." తిరిగి అన్నాడు భీమమూర్తి.

చివరిగా పేపరందుకున్నవాడు నిరుపమ రావు. చూసినంతనే పరవశుడైనాడు.

"డియర్ ఫ్రెండ్స్! మనందరి ఆశలు తీరే రోజు ఎంతో దూరంలేదు. అసలు చైనా వస్తువులు ఎప్పుడు, ఎలా వస్తాయో అనూహ్యం... దయచేసి మీరంతా ఈలోగా డబ్బు జాగ్రత్త పెట్టండి. మన కావలసిన వస్తువులు మనం కొనుక్కుందాం" చిన్న సైజు లెక్చర్ యిచ్చాడు వామనమూర్తి.

ఆరోజెవరికీ పనిమీద ధ్యాస లేదు...

ఓ గంటముందే అంతా ఉడాయించారు. ఇవేవీ పట్టించుకునే స్థితిలో లేడు ఆదిరాజు.

నిరుపమరావు కళ్లనిండుగా చైనా వస్తువులు మురిపెంగా నాట్యమాడసాగాయి. ఇంటికెళ్ళినా వామనమూర్తి మాటలే వినిపించసాగాయి.

ఈసంగతే శ్యామలాంబతో చెప్పాలని ఉవ్విళ్ళూరాడు.

కాని...!

"ఏమండీ! ఇకనుండీ మనం దర్జాగా బ్రతకచ్చుండీ! ఫ్యాన్ ధర ఎంతనుకున్నారు నూటపది రూపాయలు మాత్రమే... కలర్ టి.వి. ధర... కేవలం రెండువేల రెండొందలే! ఫ్రిజ్ మరీ చవక... పదిహేను వందలయాభై... అందులో పెట్టుకునే సాఫ్ట్ డ్రింక్... రూపాయిన్నరే. ఇక మన ఫ్యామిలీ టైపే మారిపోతుందండీ! శ్యామలాంబ ఒకటికి పదిసార్లు చేతిలో పేపర్ను ముద్దు పెట్టుకుంది.

"ఈపేపర్ ... నీకు...!" తను చెబుదా మనుకున్న వార్తలన్నీ ఆమె నోటంట వినే సరికి అవాక్కయినాడు.

"పున్నమ్మగారి భర్త రాజయ్యగారు మార్కెట్లో కొనక్కువచ్చారు. మా ఆడాళ్ళమంతా జిరాక్సు కాపీలు తీయించుకుని వుంచుకున్నాం... అని గొప్ప విషయం సాధించినట్లుగా చెప్పింది శ్యామలాంబ. ఉల్లాసపు టూయాలలో ఊగిసలా డారిద్దరూ...... అసలు తమింట్లో వున్న వస్తువులేమిటి, లేని వేమిటి అని ఓ జాబితా వ్రాసి సిద్ధంచేసుకున్నారు. వాటిని కొనేందుకు ఆర్థిక వనరులను ఎలా సమీకరించుకోవాలో ఓ ప్రణాళిక తయారు చేసుకున్నారు.

అప్పటికిగాని వారి కంటి మీద కునుకు రాలేదు.

**********

చైనా వస్తువులు మహాచవగ్గా మార్కెట్లోకి అడుగుపెడుతున్న విషయం గట్టుతెగిన గోదారిలా ఊరు - వాడా వ్యాపించింది.

టీ కొట్లు... కిల్లీ బడ్డీలు... పెట్రోలు బంకులు... ఫాస్ట్‌ఫుడ్ సెంటర్స్, ఇలా ఒకటేమిటి... 'కాదేదీ చైనా చర్చ కనవసరం'!

ఏదైనా కొత్త వస్తువు కొనదలచిన వారు మార్కెట్‌కి వెళ్ళటమే మానుకున్నారు. ప్రియంగా అమ్మే స్వదేశీ వస్తువులు కొనుగోలు అప్రియంగా అనిపించింది జనావళికి. వ్యాపారస్తుల వైపు మహా నిర్లక్ష్యంగా చూడసాగారు. తమ కొట్టువైపు మొహం చూపని ప్రజలను ఎలా తమదారికి తిప్పుకోవాలో అర్థంకాక కొందరు షాపువాళ్లు బుర్ర పీక్కునే పరిస్థితికి వచ్చారు. కొందరు తమ సొంత తెలివి వుపయోగించి బంపర్ బహుమతులు, బంగారు ఆభరణాలు ప్రకటించి ఆకర్షింప చూపారు. కాని ప్రజ 'పూరి జగ్గడు'లే అయ్యారు. తమింట చైనా వస్తువులు కొలువయ్యే విలువైన క్షణాలు కొలది దూరంలోనే వున్నాయని చంకలు గుద్దు కుంటూ

ఎదురుతెన్నులు చూసారు.

అతిత్వరలో చైనా వస్తువులు మన దేశానికి దిగుతున్న వార్తలు విరివిగా వినిపించసాగాయి. అదే సమయంలో చైనా నుండి తమ సమీప రేవు పట్టణాలలో భారీ ఎత్తున నౌకలు వస్తున్న వార్త కార్చిచ్చులా వ్యాపించింది. నౌక లెలా వస్తాయో ఎప్పుడొస్తాయో తెలుసుకోవాలని ఇంటర్నెట్ ద్వారా ప్రయత్నాలు ముమ్మరం చేసారు మరి కొందరు. అయితే తమకేం అధికారిక సమాచారం రాలేదని ఒకటే చెవినిల్లు కట్టుకుని చెబుతున్నారు రేవు అధికారులు. ఒక వేళ వస్తువులంటూ తమకు చిక్కితే జనం ఎగబడ్డం ఖాయం. అలా ఎగబడ్డ వారి సంఖ్య అధికమైతే సరుకుంచేసి బ్లాక్ మార్కెట్ చేయడానికి కూడా పన్నాగాలు ప్రారంభించారు.

ఈ నేపథ్యంలో నిరుపమరావు ఆఫీసులో ఎవరూ కుదురుగా కూర్చో లేకపోతున్నారు.

వామనమూర్తి ఒక్క ఉదుటున దిగబడి ఏ తాజా సమాచారం చేరవేస్తాడోనని ఒకటే ఎదురు చూడ సాగారు. అలా అనుకున్న క్షణాల్లోనే దిగబడ్డాడు వామనమూర్తి. అతని వెంట ఒక ఎర్రతను... మరోనల్లాయన వున్నారు.

వారి రాకకు ఆఫీసులో కలకలం మొదలైంది. ఆదిరాజు కూడా బయట కొచ్చి నిలబడ్డాడు.

"నీతో వచ్చిన వారు వెరైటీగా వున్నారే... ఒకతను చైనావాడిలాగా వున్నాడు కదూ!" వామనమూర్తిని పిలిచి అడిగాడు ఆదిరాజు...

"లాగే ఏంటి... నిజంగా చైనావాడే... వారిని పరిచయం చేయాలనే తీసుకువచ్చాను..." అని అందరికీ ఎదురుగా వెళ్ళాడు. "ఈయన చాంగ్‌లీ... ప్రక్కాయన జహంగీర్"

చాంగ్‌లీ అభివాదం చేస్తున్నట్లుగా వంగి గిరుక్కున తిరిగి "చో... చాంగ్‌లీ... చాంగ్ చున్... చాంగ్ చున్..." వెడల్పాటి మొహం జామ్‌రాసిన బ్రెడ్‌లాగుంది.

ఎవరికీ బోధపడలేదా భాష!

వామనమూర్తి చప్పట్లు కొట్టి సైగ చేయగానే జహంగీర్ అందుకున్నాడు.

"నేను చాంగ్‌లీని. చాంగ్ చున్ నగరంలో నివసిస్తున్నాను"

"వరేకా చైనా కోలీ... చింగ్ నాకన్ బనేకా...తోలీ..."

"నేను చైనా వ్యాపారస్తుడిని. మాదేశంనుంచి అనేక వస్తువులు మీకు అతి చౌకగా అందించ దలిచాను."

**కమూల్ ప్రశ్న - ఢమాల్ కార్టూన్**



**అడ్డుక్కోడానికి తప్ప తొడుక్కోడానికి పనికిరాని డ్రెస్?**

**అడ్రెస్**

"టంగ్ లియానో... జమేక... ఢమేలీ రుంగా...రింగా..."

"టంగ్ లియానో నుంచి మేలిరకం సరుకు రావటమే తరువాయి నా వ్యాపారం ప్రారంభం ఔతుంది. ఇదే నాహామీ..."

"చీనా బూత్ గోకరీ... చింగ్ మేకరీ... పింగ్ పాంగ్... చుమ్ చుమ్..."

"మీరంతా నాకు సహకరించి ముందుగా అడ్వాన్సులు యిస్తే మీకు సరుకు తప్పకుండా తగిన సమయంలో అంద చేస్తాను."

"పాంగ్ నీ... కాంగ్ చమ్... మగా చిగా..."

"నన్ను మూర్తిగా నమ్ముతారనే భావిస్తున్నాను."

చాంగ్‌లీ కీచుగొంతుతో అరుస్తుంటే అంతకంటే తనూ అరవగలనన్నట్లుగా జహంగీర్ పూనకం వచ్చినవాడిలా తెలుగులో అనువాదం చేస్తున్నాడు.

"వామన్ ఏమిటిదంతా...?" టి.వి.లో భక్తి ప్రార్థనల్లా... ఒకరు చెబుతుంటే మరొకరి అనువాదం... ఆదిరాజుకి ఈ తతంగం అర్థంకాలేదు.

"చాంగ్‌లీది చౌనీస్ భాష.. ఆ భాషను తెనిగించడాన్కి జహంగీర్ అనే యితగాడు దొరికాడు." నవ్వుతూ అన్నాడు.

అందరికీ వామనమూర్తి చెప్పేదేమంటే ఈదేశంకి చైనా వస్తువులు వచ్చేముందుగా ఈ 'చాంగ్‌లీ'కి అడ్వాన్స్‌లుగా కొంత పైకం యిచ్చి రిజర్వ్ చేసుకుంటే తప్పకుండా అందుతాయని!.

పిదప చాంగ్‌లీ- "కన్‌హో... కన్‌హో...యొకో షోమా... టుఫిఫ్టీ సి.సి... బైక్" బయటకు దారి తీస్తూ పలికాడు.

బండికి రెండు వైపులా చైనీస్ లిపిలో అక్షరాలు వ్రాసివున్నాయి.

"ఇది యొకొ షోమా -250 సి.సి. బైక్" జహంగీర్ చెప్పాడు.

అదేక్షణంలో చాంగ్‌లీ పాకెట్‌లోని 'సెల్' విచిత్రమైన శబ్దంలో మ్రోగింది.

కీచుగొంతుతో ఏదేదో మాట్లాడాడు 'చాంగ్‌లీ'.

"కోకోవా సెల్ - కేవలం నాలుగువందల యాభై... రెంటల్ చార్జి ఫిఫ్టీరూపీస్ పర్ మంత్..." జహంగీర్ వివరణ...

అందరూ తమతమ అడ్వాన్స్‌లు యిచ్చి కావల్సిన వస్తువుల జాబితా వ్రాసి వామన్ మూర్తికి యివ్వవలసిందిగా కోరాడు చాంగ్‌లీ.

అందరూ ఆ సాయంత్రానికి వామన మూర్తికి అడ్వాన్స్‌లు అందించారు. నిరుపమరావు మాత్రం ఫ్యాన్స్ నిమిత్తం కొంత సొమ్ము యిచ్చాడు.

అది లగాయితు... అందరిదృష్టి చాంగ్‌లీ ద్వారా తమకు అందబోయే నాణ్యమైన వస్తువుల కోసమే...! వామనమూర్తి... అదిగో ఇదిగో అంటూ ఆశపెడుతున్నాడు.

ఇదే విషయమై నిరుపమరావు గడపలో అడుగుపెట్టినది లగాయిత్తు ప్రశ్నలతో సతాయిస్తుంది శ్యామలాంబ. ఏంచెప్పాలో తెలీక నిరుత్తరుడే అయినాడు. ఇదిలా కొనసాగు తుండగానే ఆఫీసులో బాంబులాంటి వార్త పేలింది. అదేంటంటే నిన్నగాక మొన్న ఆఫీసుకు వచ్చిన చాంగ్‌లీ, జహంగీర్ అనేవాళ్ళు పక్కామోసగాళ్ళని, చైనా వస్తువుల వ్యామోహంలో పడి కొట్టుకులాడున్న అమాయక భద్రాజ మానాలను బుట్టలో వేసుకోడానికిదే మంచి అవకాశమని దోచుకుంటున్నారని ప్రతి పత్రిక 'చైనా వస్తువుల వ్యాపారం పేరుతో ప్రజలకు కుచ్చుటోపీ' అన్న శీర్షికతో ఘాటుగా రాసింది.

వామనమూర్తి ఆఫీసులో మొహం ఎత్తుకో లేకపోయాడు.

నిరుపమ రావు ఇంట్లో చివాట్ల దండకం మొదలైంది.

ఇలా ఉండగానే మరో మలువు... అనుకోకుండా మనదేశంలోకి చైనా వస్తువులు చాపక్రింద నీరులా ప్రవేశించాయి. వాటిని అమ్మేందుకు నాలుగు షాపులు సైతం వెలిసాయి. కానీ వ్యాపారం విపరీత పోకడలకు పోయింది.

ఊర్లోకి వచ్చిన మోటరు సైకిళ్ళు నూరయితే వాటికోసం కాచుకున్నవారు వేయిమంది! ప్రవేశించిన కార్లు ముప్పయ్యయితే కావలసినవి... అయిదొందలు.!

అప్పడాల దగ్గర్నుంచి అన్ని అప్లయన్సస్ దాకా కొనేందుకు జనం బారులు తీరారు. ఈ మహా జనాన్ని కంట్రోలు చెయ్య డానికి అనేక రకాలుగా పోలీస్ బందోబస్తు అవసర మైంది.

'ఎంచక్కా ఇలా మార్కెట్ కెళ్ళి అలా కావలసినవి కొను క్కొనిరావచ్చు నని భ్రమపడ్డ శ్యామలాంబ, నిరుపమరావులకు చుక్కెదురైంది. నాలుగు షాపుల దగ్గర నాలుగువేల మంది జనం!! వచ్చిన సరుకు వర్షమప్పుడు చెల్లే వేడిపకోడిలాగ ఉఫ్పున వూదేస్తున్నారు.

ఆ రద్దీలోనికి చొరబడే సాహసానికి ఒడి గట్టలేని నిరుపమరావు ఒక్కసారిగా నీరు గారిపోయాడు.

చైనా మోజువల్ల, స్వదేశీ వస్తువులమ్మేవాళ్ళ నెత్తిన గుడ్డ కప్పు కోవలసివచ్చింది. ఈగలు తోలుకోవటమే పనయ్యింది. ఎన్ని ఆఫర్‌లు ఎర చూపినా వంగివాలలేదు.

ఈ గడ్డు పరిస్థితి నెలకొని వుండటం మూలంగా రాష్ట్ర ఖజానాలకి ఆదాయానికి గుండు సున్నయింది. దాంతో దేశ పరిస్థితి ఛిన్నాభిన్నమైంది.

ప్రతి వస్తువు చవుగ్గా దొరుకు తున్నప్పుడు కరువెక్కడుందని చెప్పి కరువు భత్యం కోత విధించింది. జీతాల్లో సగానికి సగం తగ్గించాలని కఠినమైన నిర్ణయం గైకొంది. దీంతో ఉద్యోగస్తులలో నిరసన పెల్లుబికింది. వస్తువు చౌక డబ్బు ప్రియంగా మారింది. సామాన్య జనంలో కొనుగోలు శక్తి సన్నగిల్లింది.

ఆరువేలకు పైగా జీతం అందుకునే నిరుపమరావు లాంటి వారి కంత కాలం బాగానే వుండేది. ఏ ఆక్షేపణ లేకుండా సర్దుకు వస్తున్నాడు.

కానీ- ఆరోజు నిరుపమరావు ఆఫీసు నుండి ఇల్లు చేరాడు. శ్యామలాంబ ఒకటే మూల్గుతున్నది... డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళక తప్పలేదు.

డాక్టర్ ఆపరీక్ష - ఈపరీక్ష అని చెప్పి మొత్తానికి వెయ్యి రూపాయలు వదిలించాడు.

తిరిగివచ్చినప్పుడు ఆటో మాట్లాడాడు... వందడిగాడు... తటపటా యిస్తుంటే ఆటోవాలా అన్నాడు...- "మీకేంసార్ చౌగ్గా వస్తువులన్నీ దొరుకుతున్నాయి... మాలాంటి వారికిచ్చేదేపాటి!"

రిక్షా వాలానడిగినా ఓ యిరవైతగ్గించి చెప్పాడు. ఎక్కడం తప్పలేదు మరి.

భార్యను ఇంటికి దిగిబెట్టి కూరగాయల మార్కెట్‌కి వెళ్ళాడు... ఏకూరా కిలో ముప్ఫయికి తక్కువలేదు... ఎప్పటి లాగే బేరమాడాడు.

"ఇదేమైనా సైనా సరుకా సవుగ్గా కొనీటానికి... సైనా నుంచి కూరలు కూడా వత్తున్నాయేటో కనుక్కోండి. ఎల్లెల్లలండి..." అని ఈసడించు కుంది కూరలమ్మి.

నోరుమూసుకుని మరీ తొంబై రూపాయలకి మూడు కిలోల కూరలు కొనుక్కు వెళ్ళాడు నిరుపమరావు. ఇంట్లో అడుగుపెట్టేసరికి - పాల వాడితో శ్యామలాంబ గొడవ పడ్తున్నది...

"ఒక్కసారి పాలధర అంత పెంచేస్తే ఎలా నాయుడూ!" అని శ్యామలాంబ "పావలాకి పరక్కీ అమ్మేడానికి సైనా సరుకు కాదమ్మా!.. మావూఁ కట్టపడి పశూల్ని పోసించాల... మీగ్గాని దొరికితే సైనా పాలు తెప్పించుకోండి..." చీదరగా అనేసి చరచర వెళ్ళిపోయాడు.

నిరుపమరావు - శ్యామలాంబ ప్రశ్నార్థకంగా ఒకరి నొకరు చూసుకున్నారు.

మర్నాడుదయం లేస్తునే ఇంటి యజమాని కబురుపెడితే వెళ్ళాడు.

"ఈ నెల నుండి మరో మూడొందలు ఎక్కువ యిస్తేగాని నాసంసారం గడిచేలా లేదు. చైనా సరుకయితే చవకగాని... ఇళ్ళ అద్దెలు చవుక చేయలేంగదా..." ఖచ్చితంగా అనేసాడు.

అప్పటినుంచీ జీతాలొస్తాయంటే బెంగగా ఉంది. నిరుపమరావుకి.

పెరిగిన కాన్వెంట్ ఫీజులు... డాక్టర్ ఫీజులు... కూరగాయల ధరలు... ఆటో రిక్షాల కిరాయిలు... కరెంటు బిల్లు... వీటన్నింటినీ తట్టుకోడానికి వీలు లేని కోతతో వచ్చిన అత్తెసరు జీతం...

ఎలా సర్దుబాటు చేయాలో తెలీనీ అగమ్య గోచర వాతావరణంలో గజిబిజిగా అయిపోయి నెత్తిని గోడకు బాదుకోవలసిన పరిస్థితి ఎదురైంది.

అంతకంటే ఏం చేయగలడు!

**********

"నో..." పిచ్చికేక పెట్టాడు నిరుపమరావు...

త్రుళ్ళిపడింది శ్యామలాంబ...

"అదేంటండీ బుర్ర బాదు కుంటున్నారు."

"ఆఁ! నేనా! నిజంగా... బుర్ర... ఛ ఛ..."

అని తనింత దాకా కన్నది కలని నిర్ధారించుకున్న తర్వాత అంతా వివరించాడు.

"ఆఁ! నాగుండె అదిరిపడేలా అరిచారు కదా! నేనూ... కన్నాను మీలాంటికల కాదు.. మరోలా..."

స్థానికకి పేపర్‌లో వచ్చిన చైనా వస్తువుల గురించిన వార్త చదివిన దానికి ఫలితం... ఈ'కల' కలం...!!

ఇటువంటి 'కల' కలం మీగుండెల్లో చెలరేగకుండా ఇకనుం'చైనా' చూసుకోండేం...!!

కమాల్ ప్రశ్న - ధమాల్ కార్టూన్



శరీరానికి కాసే కాయలు?

చెమటకాయలు

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

## మరపురాని కలలు కని

ప॥ మరపురాని కలలు కని-మరుదినమ్ము మేలుకొని
నిరాశలే మిగులునని తెలుసుకొంటివా
మనసా-అలసియుంటివా అలసియుంటివా

1.చ॥ ప్రేమ నిన్న రోజుదని-నేడు కరగిపోయెనని
వేదనయే రేపటని-తెల్లమాయెనా
గుండెలు తల్లడిల్లెనా-తల్లడిల్లెనా

2.చ॥ చిగురు ఎండి రాలునని-ఎగిరిపోవు కోయిలని
క్షణికమే వసంతమని-కనులగట్టెనా
అశ్రులు కరిగిరాలెనా-మనసా
అలసటాయెనా-అలసటాయెనా



| | |
|---|---|
| గానం, సంగీతం | : ఎం.చిత్తరంజన్ |
| రాగం | : చక్రవాకం<br>16వ మేళకర్త రాగం<br>- ఆహిర్ బైరవ్ (హిందుస్తాని సం॥) |
| తాళం | : రూపకం (కర్ణాటక సం॥)<br>- దాద్రా (హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : స రి గ మ ప ద ని స |
| అవరోహణ | : స ని ద ప మ గ రి స |

- షడ్జము, శుద్ధ రిషభం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశృతి దైవతం, కైశికి నిషాదం-ఇందులోని స్వరాలు.

కర్ణాటక, హిందుస్తాని శాస్త్రీయ సంగీతాలలో చక్రవాకం, ఆహిర్ భైరవ్ అను పేర్లతో బాగా ప్రచారంలో ఉన్న రాగమిది.

"ఎటులబ్రోతువో తెలియదేకాంతరామయ్య", "సుగుణములే చెప్పుకొంటే సుందరరఘురామ" అనే కీర్తనలు కర్ణాటక సంగీతంలో చాలా ప్రసిద్ధి చెందినవి. లలిత సంగీతంలోను, లలిత శాస్త్రీయ పద్ధతిలోను కూడా యీరాగంలో ఎన్నో గేయాలు జనాదరణ పొందాయి. ఘంటసాల గానం చేసిన "నీకొండకు నీవే రప్పించుకో" తెలుగువారిని ఎంతగానో ఆకట్టుకున్న చక్కని భక్తి గీతం. "పిబరే రామ రాసం రసనే" అనే సదాశివ బ్రహ్మేంద్ర కీర్తనను బాలమురళిగారు స్వరపరచి ఆకాశవాణి 'భక్తిరంజని' కార్యక్రమంలో అద్భుతంగా స్వరకర్తలకు స్ఫూర్తిదాయకమై 'జగమే రామమయం", "రాధకు నీవేర ప్రాణం" మొదలగు పాటలు ఆవిర్భవించాయి. ఆకాశవాణిలో లలిత గీతాలెన్నిటికో చక్రవాక రాగం ఉపయోగించబడింది. "శరదాగమనం శరదాగమనం" (రచన : డా॥సి.నారె-సంగీతం: పాలగుమ్మి విశ్వనాథం), "నవంబరొకటి వచ్చింది నవయుగోదం తెచ్చింది (రచన : నాయని సుబ్బారావు-సంగీతం : మంచాళ జగన్నాధరావు), ప్రస్తుత గీతం "మరపురాని కలలు కని" వంటివి ఎన్నో ఆకాశవాణి ద్వారా విస్తృత ప్రచారాన్ని పొందాయి. మధ్యప్రాచ్య సంగీత రీతులలో కూడా చక్రవాక రాగం వినిపిస్తూంటుంది. ఈజిప్షియన్ డ్యాన్సు సంగీతంలో యీ రాగం వాడగా నేను చాలాసార్లు వినడం జరిగింది. "లైలా మజ్నూ" నృత్య నాటికలో అరబిక్ సంగీత పద్ధతిలో "పదిలమోహో పదిలమోహో హృదయమా" అనే రజని గారి గీత రచనకు చక్రవాక రాగంలో సంగీతం కూర్చి పాడాను. తత్యం లాంటి మల్లవరపు వారి రచన "మరపురాని కలలు కని" స్వీయ సంగీతంలో నేను గానం చేయుగా, ఈమాసపు పాటగా ఆకాశవాణిలో ప్రసారమై చాలా పాపులర్ అయింది.

ప॥ ;సరిప మామ | గమగరి సారిని | ;నిసాస సానిద | నిరిరిససా |
. మరపు రాని | తలటతని. . | . మరుదినమ్ము. | మే. టకొని |

సగామదా | నిపనిదపదమపమా | సగామససదా | నిపనిదపదమపమా |
నిరాశలే | . మిగులన. ని. . | నిరాశలే. . | . మిగులన. ని. . |

;మదాప మాగ | మా, గపమగసరి | నినిని నిసరిరిస | సా;; | రిరిరి రిస | సరినిసా, ;; ॥
. తెలుసు కొంటి | వా. మనసా. . . | అలసియుం. . టి. | వా. . | అలసియుంటి | వా. . . . . . ॥మరపు॥

1.చ॥ ;సగామ దాని | పనిదప మప గమా | ;మదాని సససని | నిసరిరి రిససరిని |
. ప్రే. మ నిన్న | రో. . . జు. దని | . స్నే. హ కరగి. | పో. . యెన. ని. . |

;నిసానిదా సా | ;మనిద మని | ;దసాని నిదపదమా | మా, గమాదపా | గపమగమరి | గా;; |
. వే. దన యే | . రే. ప టని | . తె. ల్ల మా. . . యె | నా. గుం. డెలు | త. ల్లడి. ల్లె | నా. . |

;రిరిరి రిస | సరినిసా, ;; |
. త. ల్లడిల్లె | నా. . . . . . ॥మరపు॥



2వ చరణం కూడా మొదటి చరణం వలె పాడాలి.

2వ చరణం చివర "అశ్రులు కరగి రాలెనా" అన్న పంక్తి తరువాత "మనసా అలసటాయెనా-అలసటాయెనా" అన్న పంక్తిని పల్లవిలోని "మనసా అలసియుంటివా-అలసియుంటివా" అనే పంక్తి వలె పాడాలి.

## చక్రవాకం రాగం ఆధారంగా కొన్ని చిత్ర గీతాలు



| | పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | ఏడుకొండలవాడ వెంకటరమణ | పెళ్ళిచేసిచూడు | పి.లీల | ఘంటసాల |
| 2. | జగమే రామమయం | కథానాయిక మొల్ల | పి.సుశీల | ఎస్.పి.కోదండపాణి |
| 3. | రాధకు నీవేర ప్రాణం | తులాభారం | పి.సుశీల | సత్యం |
| 4. | నీకొండకు నీవే రప్పించుకో | ప్రైవేటు రికార్డు | ఘంటసాల | ఘంటసాల |
| 5. | పిబరే రామరసం | పడమటి సంధ్యారాగం | బాలు | బాలు |
| 6. | కండగెలిచింది | భక్తకన్నప్ప | రామకృష్ణ పి.సుశీల | సత్యం |
| | **హిందీ** | | | |
| 1. | పూఛోనకైసే మైనే రైన్ బితాయి | మేరీ సూరత్ తేరీ ఆఖే | మన్నాడే | ఎస్.డి.బర్మన్ |
| 2. | మేరీవీణా తుమ్ బిన్ రోయే | దేఖ్ కబీరా రోయా | లత | మదన్‌మోహన్ |
| 3. | హోఁటోఁపే ఐసీ బాత్‌కో | జువెల్ థీఫ్ | లత | ఎస్.డి.బర్మన్ |

## ఆకాశవాణి సంగీత సమ్మేళనం - 2002 (రాత్రి 10నుండి11గం॥ వరకు)

| | | |
|---|---|---|
| డిసెంబరు 16 సోమవారం | -డా॥ ఆర్.ఎన్. స్నేహలత | -గాత్రం |
| డిసెంబరు 17 మంగళవారం | -శ్రుతి సడోలికర్ | -గాత్రం |
| డిసెంబరు 18 బుధవారం | -శ్రీకృష్ణన్ శర్మ | -గిటార్ |
| డిసెంబరు 19 గురువారం | -ఎ. కన్యాకుమారి | -వయొలిన్ |
| డిసెంబరు 20 శుక్రవారం | -పండిట్ జదీశ్‌ప్రసాద్ | -గాత్రం |
| డిసెంబరు 21 శనివారం | -ఎం.ఎస్. సుశీల | -గాత్రం |






నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ తీరుతెన్నులపై అధ్యయనం చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది

**వే**లాది లక్షలాది కళ్లు-తెరమీద చూసే సినిమాకి మాత్రం రెండే కళ్లు. ఆ రెండు కళ్లూ "నిర్మాతా, దర్శకుడూనూ" అంటుంది సినిమా పరిశ్రమ. ఈ రెండుకళ్లూ సినిమా నిర్మాణాన్ని చత్వారం కళ్లతో కాకుండా, స్వచ్ఛమైన చూపుతో చూడాలి. అంత బాగా సుస్పష్టంగా ఈ కళ్లు చూడగలిగితేనే, తెరమీది బొమ్మని కూడా ప్రేక్షక నేత్రాలు అంత తేరిపార చూడగలుగుతాయి.

అయితే ఈ రెండు కళ్లూ అన్నింటినీ "సమాన దృష్టి"తో చూడగలగాలి. చూడాలి. అందుకు బాగా అనుభవం ఉండాలి. ఏ కంటికీ హ్రస్వదృష్టి వుండకూడదు. రెండు కళ్ళకీ దూరదృష్టి దీర్ఘదృష్టి కొండొకచో దివ్యదృష్టీ కూడా వుండాలి. ఓ కంటికి హ్రస్వదృష్టి ఉంటే మాత్రం హాస్యమే.

అలాంటి కన్ను గల ఒక నిర్మాత (నేను ఆ కంపెనీలో పనిచేశాను గనక, అనుభవం సంపాయించాను గనక- ఆ హ్రస్వాక్షుని పేరు చెప్పడం బాగుండదు) ఆయన రెండు సినిమాలకు నిర్మాతగా వ్యవహరించే సరికి సర్వం విశదమై పోయింది. కొంప మునిగిపోతోంది, ఇక లాభం లేదని మూడో సినిమాకి తానే "దర్శకుడూ, నిర్మాతా" అని ప్రకటించేసుకుని రంగంలోని దూకాడు. నిర్మాతగా రెండు సాంఘికాలయినాయి గనక, స్వీయ దర్శకత్వంలో జానపదం తియ్యాలని సంకల్పించి కథా చర్చలకి దిగాడు. దిగడం అంటే ఏమిటి-అన్నీ తానే. తానుగా నాలుక్కాయితాల్లో రాసిన కథా సంగ్రహాన్ని-లేదా సంగ్రహ కథని-రచయితకి చూపించాడు. "మీరు కచ్చితంగా చెప్పండి మీ అభిప్రాయం. ఎలా వుంది కథ?" అని అడిగాడు. అంత కచ్చితంగా చెప్పమన్నాడు కదా అని రచయిత నిర్మొహమాటంగా "అంత బాగులేదు. సువర్ణ సుందరి, పాతాళభైరవి, గుణసుందరి కథ లాంటివన్నీ గుర్తొచ్చాయి. కథ కలగాపులగంగా వుంది" అని చెప్పేసే సరికి, నిర్మాణ నేత్రం అయిన నిర్మాత కళ్లు ఎర్రబడ్డాయి. ఆ ఎర్ర కళ్లతో రచయితని చూసే సరికి, రచయిత కళ్లు హరిణనేత్రాలయిపోయి, శరీరం చలికి వణికినట్టు వణికిపోయింది. "నేను వేరే రచయిత చేత స్క్రిప్టు రాయిస్తాను. మీరొద్దు" అని నిర్మొహమాటంగా అతని మొహం మీద చెప్పి, కథాసార పత్రాల్ని ఊడలాక్కున్నాడు.

తనే రాయగలడు. తన ఉద్దేశాలు ఇంకొకడికి నూరిపోసి రాయించడం కంటె, తానే రాసుకోడం సులభం కదా! తనే పాటలు, మాటలూ. అంతకు ముందు సినిమాల్లో ఒక్కో పాటా రాసిన తను అన్ని పాటలూ అవలీలగా రాసేయగలడు. రాశాడు. సంగీత దర్శకుడిని పిలిపించాడు. "ఈ పాటలకి వరసలు కట్టు. నవరసంగా వుండాలి. కాచీగానూ, క్లాసికల్ గానూ వుండాలి. హిట్టు చెయ్యి" అంటూ పాటల కాయితాలు ఇచ్చాడు. సం.ద ట్యూన్‌లు కట్టడం మొదలు పెట్టి హార్మోనీ మెట్లతో మేడమెట్లు కట్టినట్టు కడుతున్నాడు. దర్శక నిర్మాతకి నచ్చడం లేదు. పక్కనే కూచుని హార్మోనీ వాయించడం చూస్తున్నాడు గనక, తనే అందులోనూ జొరబడిపోయి వేళ్లు కదిపేయాలని ఉబలాట పడిపోతున్నాడు గాని, ఆ పని చెయ్యలేదు. అతను చేసిన వరసలు బాగులేవు. రెండు రోజుల మ్యూజిక్ సిట్టింగ్స్ తర్వాత, దర్శక నిర్మాత కచ్చితంగా చెప్పేశాడు ట్యూన్‌లు ఎందుకు బాగులేవో "చూడూ! నువ్వు హార్మోనీ వాయిస్తున్నావు గదా, నల్ల మెట్లూ తెల్లమెట్లూ రెండూ ఎందుకు వాయిస్తావు? దేన్నో ఒక దాన్ని నమ్ముకో. నల్లవైనా వాయించు, తెల్లవయినా వాయించు. ఇవీ అవీ కలిపి వాయిస్తే నీకు మంచి ట్యూన్ ఎలా వొస్తుంది?" అన్నాడు. దాంతో సంగీత దర్శకుడు, తబలిస్టూ పకపకా వస్తున్న నవ్వుకి ఆనకట్ట కట్టడానికి ప్రయత్నిస్తూ దర్శక నిర్మాత గారి "హ్యామరథం" స్పీడుకి బ్రేక్ వెయ్యాలని చూసి లాభం లేదని గొల్లుమని నవ్వేశారు. తెల్లవీ నల్లవీ కలిపి వాయిస్తేనే ట్యూన్ అవుతుందని ఆయనకి చెప్పాలా- కూడదా? అది అజ్ఞానమా, అమాయకత్వమా?

నవ్వుతున్న సంగీత దర్శకుడిని, తన మాటల్లో నవ్వు రావడానికి కారణం ఏమిటని దర్శక నిర్మాత వెర్రిమొహం వేసి చూడసాగాడు. నవ్వు ఆపుకుని, సంగీత దర్శకుడు లాభం లేదని, హార్మోనీ మెట్ల గురించి, సరిగమల గురించీ రెండు మాటలు చెప్పి రెండు పాటలు కంపోజ్ చేసి రెండు పూటల్లో వినిపిస్తానని మాట ఇచ్చాడు. ఆ సంగీత దర్శకుడు అశ్వత్థామ. తెల్లమెట్లు నల్లమెట్లు కలిపితేనే మట్టు వస్తుందని తెలియని మహా పండితుడి దగ్గర పనిచేస్తున్నందుకు సిగ్గు పడిపోయిన అశ్వత్థామ! "నేను మీ పాట రచనలో వేలు పెట్టను. మీరు హార్మోని మీద వేలు పెట్టకండి" అని సీరియస్‌గా చెప్పి పాటలు రికార్డు చేశాడు.

రికార్డింగులో కూడా ద.ని (దర్శకనిర్మాత) "పదనిమగ" అంటారేం? వరసగా సరిగమ పదని అని వేస్తేనే గదా వరస బావుంటుంది!" అని స.ద (సహాయ దర్శకుడు) దగ్గర మళ్లీ గొణిగాడే గాని, గట్టిగా నోరెత్తలేదు.

* * *

ఆ సినిమా షూటింగుకే, ఆ ద.ని. గారి స్టూడియోలో సెట్టు వేస్తున్నారు. వెయ్యడం అయిపోయింది. బాక్‌గ్రౌండ్ పెయింటింగ్స్ చేస్తున్నారు. ద.ని వచ్చాడు చూడ్డానికి. సెట్టులో ఒకవేపు 'గోడ'కి సూర్యోదయం ఎఫెక్ట్‌తో సంధ్యవర్ణం వేశారు. సూర్యోదయ సమయంలో అక్కడ దృశ్యం జరుగుతుంది గనక. ద.ని అటూ ఇటూ చూసి, ఉగ్రనేత్రుడయ్యాడు. ప్రొడక్షన్ మేనేజర్నీ సహాయ దర్శకుల్నీ దగ్గరికి పిలిచి-"తూర్పు ఏ పక్క?" అని అడిగాడు. అందరూ చూపించారు. సూర్యోదయ వర్ణం వున్న గోడని చూపించి, "ఇది ఏ పక్క?" అని అడిగాడు. "ఉత్తరం" అన్నారంతా కోరస్‌లో. "మరి, సూర్యోదయం ఉత్తర దిక్కుకి పెయింట్ చేస్తే మీరంతా ఏం చేస్తున్నారయ్యా?" అని ఉరిమాడు-ద.ని. సినిమా సెట్లో ఏ పక్క సూర్యోదయం వుంటే అదే తూర్పు అవుతుందనీ, సెట్టులో ఆ తేడా తెలీదని తెలియని ద.ని. అజ్ఞానానికి నవ్వాలో, ఏడవాలో తెలీక మేనేజరూ సహాయకులూ తెల్లమొహాలు వేసి,వాటిని వెర్రి

మొహాలుగా మార్చుకుని ద.ని.ని పిచ్చివాడిని చూసీ చూడనట్టు చూశారు.

*   *   *

షూటింగులో, నటీనటులకి ఎలా చెప్పాలో ఏం చెప్పాలో ద.ని.కి తెలీదు. స.ద (సహకార దర్శకుడు) చేత చెప్పించేవాడు. అనుమానాలు అడిగితే, నీళ్లు నముల్తూనే, "రెడీ, టేకొ" అనేవాడు. ఆయన గారి అజ్ఞాన ప్రతిభని అర్ధం చేసుకున్న "హీరో"గారు (పెద్ద హీరోయే) "ఎందుకొచ్చిన గొడవ! ఏదో చెప్పింది విని, చేసేసుకుని పోదాం. కొన్ని డబ్బు కోసం చేసే సినిమాలుంటాయి" అని నచ్చజెప్పుకుని, తన పనేదో తాను చేసుకుపోయాడు. ఏ షాటుకి ట్రాలీ వెయ్యాలో, ఎక్కడి నుంచి ఎక్కడికి వెయ్యాలో, ఏ షాటుకి ఏ లెన్స్ వెయ్యాలో ద.ని.కి తెలియదని, ఛాయాగ్రాహకుడికి (అన్నయ్య) తెలిసిపోయి, తానే అన్నీ చూసుకున్నాడు. షాట్ అయ్యాక, ఎక్కడ కట్ చెప్పాలో తెలీక ద.ని. దిక్కులు చూస్తుంటే స.ద. మెల్లిగా 'కట్ చెప్పండి సార్' అని ప్రాంప్టింగ్ ఇచ్చేవాడు. "స్టార్ట్" చెప్పడానికి, అనుమానం వుండేది కాదాయనకి. కట్ చెప్పడమే సమస్య.

*   *   *

అంతకుముందు సినిమాలకి తాను నిర్మాత మాత్రమే. అంచేత షూటింగులకి ఎక్కువగా వచ్చేవాడు కాదు. వస్తే అదీ ఇదీ అంటారని. షాట్స్ రాసే కంటిన్యుటీ పుస్తకంలో కొత్త 'కాలం' ఒకటి ప్రవేశపెట్టాడు. "రీజన్ ఫర్ రీటేక్" అని. షాట్సు మళ్లీ తీస్తే ఎందుకు తీశారో ఆయన ఆఫీసులో కూచుని చూసేవాడు. "రీజన్ ఫర్ రీ టేక్"లో హీరో డైలాగు మరిచిపోయాడనో, ట్రాలీ సరిగా వెళ్లలేదనో వుంటే, "హీరో ఎందుకు డైలాగు మరిచిపోయాడు? మీరు సీను ఇవ్వలేదా? అతను కంఠతా ఎందుకు పెట్టలేదు? ఆ బాధ్యత మీదే కదా!" అని అరిచేవాడు. ఈ సినిమాకి తానే రెండూ (దర్శకుడు, నిర్మాత) గనక, "రీజన్ ఫర్ రీటేక్" కాలమ్ తీయించేశాడు. ఎంచేతంటే తన తప్పులే ఎక్కువుంటాయి గనక; ఆ విషయం తనకి క్షుణ్ణంగా తెలుసు గనక!

ఎలాగోలా, తప్పటడగులు వేస్తూ దారి తప్పుతూ మళ్ళీ తెలుసుకుంటూ-సినిమా పూర్తయింది. "బ్లాక్ అండ్ వైట్" సినిమాయే అయినా, నావల్టీ అని కొంత కలర్‌లో తీయించాడు ద.ని. పబ్లిసిటీలో చిత్రం పేరు కింద "సగానికి పైగా కలరు" అంటూ రాయించి వేయించాడు. కొన్ని పాటలు, కొన్ని దృశ్యాలు మాత్రమే రంగుల్లో వున్నాయి. సినిమా విడుదలైంది. ప్రొజెక్టర్లలో సజావుగానే నడిచింది గాని, థియేటర్లలో నడవలేదు. ద.ని. సినిమా పేరు కింద వాడిన "సగానికి పైగా కలరు" అన్నదాన్ని వ్యాఖ్యాతలు ఇంకోరకంగా వాడుకున్నారు. "థియేటర్లో ప్రేక్షకులు సగానికి పైగా కలరు" అని! ఆ విధంగా హ్రస్వాక్షుడైన ఆ నిర్మాత-తన అజ్ఞానాహంకారాల వల్ల నష్టపోయాడని సారాంశం!

డిసెంబరు 25 చార్లీ చాప్లిన్ వర్ధంతి సందర్భంగా...



# కరుణ మేళవించిన హాస్యం
# చార్లీ చాప్లినీయం



- ప్రపంచంలో అన్ని భాషల వారూ మెచ్చిన హాస్య నటుడు -చార్లీ చాప్లిన్
- అతడు నటుడే కాదు, డైరక్టర్, ప్రొడ్యూసర్, స్క్రీన్ రైటర్, కంపోజర్ కూడా!
- తొలి చిత్రం 'మేకింగ్ ఎ లివింగ్' (1914)లో గుర్తింపు రాలేదు. 'కిడ్ ఆటో రేసెస్ ఎట్ వెనిస్'(1914) లో వేసిన'లిటిల్ ట్రాంప్' గెటప్పే అతనికి గుర్తింపు తెచ్చింది.
- తన 13 వ సినిమా 'కాట్ ఇన్ ది రైన్'(1914) నుండి దర్శకత్వం మొదలుపెట్టాడు.
- 'ది ట్రాంప్'(1915) నుండి చాప్లిన్ ట్రేడ్ మార్క్ వేషధారణ ప్రారంభమయింది.
- అనేక హాస్య చిత్రాల తర్వాత తీసిన ఫుల్ లెంగ్త్ కామెడీలు 'ది కిడ్ '(1921), ది గోల్డ్ రష్(1925), 'ది సర్కస్'(1928), 'సిటీ లైట్స్'(1931), 'మోడర్న్ టైమ్స్' (1936), 'ది గ్రేట్ డిక్టేటర్' (1940) - ఇవన్నీ హిట్ అయ్యాయి.
- సైలంట్ చిత్రాల ద్వారా ప్రపంచ ప్రేక్షకులందరినీ అలరించిన చాప్లిన్ తన సినిమాలలో శబ్దాన్ని ఉపయోగించటాన్ని ఇష్టపడలేదు. 'ది గ్రేట్ డిక్టేటర్' లో చివర ఓ చిన్న ఉపన్యాసం ఇచ్చి తన నియమాన్ని భంగం చేసుకున్నాడు.
- ఎడ్ క్యారీ అనే కార్టూనిస్టు 1916 లోనే చాప్లిన్ పై కార్టూన్ స్ట్రిప్పు వేసేవాడు. దానిపేరు 'Pa's Imported Son-in-Law'
- టైమ్ మేగజైన్ (1925 జూలై 6) ముఖ చిత్రంపై తొలిసారి కనిపించిన నటుడు చాప్లినే!
- 1975లో అతని బ్రిటిష్ ప్రభుత్వం'సర్' బిరుదానిచ్చింది. ఆ ఫంక్షన్ జరిగిన బకింగ్ హామ్ ప్యాలెస్‌కు మూడు కి.మీ. దూరంలో ఉన్న మురికి వాడల్లోనే అప్పటికి 86 ఏళ్ల క్రితం అతను పుట్టాడు.
- కమ్యూనిస్టు అనే ఆరోపణతో అమెరికా ప్రభుత్వం అతన్ని తిప్పలు పెట్టింది. 'మాన్స్యూర్ వెర్డెక్స్'(1947) సినిమాకై అతనిపై విచారణ జరిపారు.
- 1952 లో యూరోప్ వెళ్లనిచ్చి తిరిగి రావటానికి వీలు లేదన్నారు. 20 ఏళ్ల తర్వాత నిషేధం ఎత్తేసిన తర్వాతే అతని లైమ్‌లైట్ (1952), 'ఎ కింగ్ ఇన్ న్యూయార్క్'(1957) చిత్రాలు అమెరికాలో రిలీజయ్యాయి.
- 1972లో స్పెషల్ ఆస్కార్ అవార్డు తీసుకోవడానికి చాప్లిన్ అమెరికాకు తిరిగివచ్చాడు.
- మేర్లిన్ బ్రాండో, సోఫియాలొరెన్ హీరోహీరోయిన్లుగా తను తీసిన 'ఎ కౌంటెస్ ఫ్రమ్ హాంగ్‌కాంగ్'(1967) లో చివరిసారిగా చాప్లిన్ తెరమీద కనపడ్డాడు.

**-కమ్యూనికేటర్ ఫీచర్స్**

# హిందీ సినీ సంగీతానికే ఉస్తాద్ "నౌషాద్"





**1952** 'మహాద్భుత సంగీత దృశ్యకావ్యం "బైజూబావ్‌రా" విజయోత్సవాలు బొంబాయి బ్రాడ్‌వే సినిమా థియేటర్‌లో జరుగుతున్నాయి. ఆ సినిమా యూనిట్‌ను ఘనంగా సత్కరించారు. ఆ చిత్ర విజయానికి ప్రధాన కారణం సంగీత దర్శకుడి స్వరకల్పన. సన్మానోత్సవం ముగిసిన తరువాత ఆ సినిమా హాలు బాల్కనీలో నిలబడిన ఆ సంగీత దర్శకుడు రోడ్డు ప్రక్కగా ఎదురుగా ఉన్న ఫుట్‌పాత్‌కేసి చూస్తున్నాడు. సరిగ్గా పదహారేళ్లక్రితం ఆ ఫుట్‌పాత్ మీదే పడుకుని ఆ సినిమాహాలుకేసి చూస్తూ కన్నకలలు, పడ్డకష్టాలూ గుర్తొచ్చి ఆయన కళ్లు చెమ్మగిల్లాయి. ఒక్కసారిగా జ్ఞాపకాల పుటల్లోకి వెళ్లిపోయారాయన.

***

**అ**ప్పుడు ఆ కుర్రవాడి వయసు పదేళ్లు కూడా ఉండదు. సంగీతం గురించి ఎక్కువగా ఆలోచించేవాడు. తమ ఇంటిముందు ప్రదర్శించే మూకీ సినిమా హాళ్లతెరకు ముందు ఆర్కెస్ట్రా వాయించే కళాకారులను శ్రద్ధగా గమనించేవాడు. కుటుంబకారణాలవల్ల బడికి వెళ్లి వచ్చిన తరువాత ఖాళీ సమయంలో సంగీత పరికరాలమ్మే షాపులో స్వీపర్‌గా కుదిరాడు. దాంతో తనకిష్టమైన సంగీత ప్రపంచంలోకి వచ్చినట్లుగా భావించుకున్నాడు. ఒకరోజు ఆ బాలుడు దుకాణంలోని హార్మోనియంను వాయిస్తుండగా చూసిన యజమాని కోపంతో మరోసారి పరికరాలన్నింటినీ తుడిచే శిక్ష వేశాడు. కొంతకాలం తరువాత ఆ పిల్లవాడిలో తరగని సంగీత తృష్ణను గుర్తించిన ఆయన ఓ హార్మోనియాన్ని ఉచితంగా ఇచ్చి వేశాడు. దాంతో పట్టలేని ఆనందంతో హార్మోనియంతో ఇంటికెళ్లాడు. అయితే అప్పటికే ఈ సంగీతమ్మీద పిచ్చితో బాధ్యత లేకుండా ప్రవర్తిస్తున్నా వంటూ తండ్రి అనేక సార్లు ఆ కుర్రవాడి వీపు చితక్కొట్టాడు. మళ్లీ హార్మోనియంతో ప్రత్యక్షమయ్యే సరికి అవధులులేని ఆగ్రహంతో హార్మోనియంను వీధిలోకి గిరాటేసి కొడుకును మెడపట్టి గెంటి ఇంట్లోకి వస్తే కాళ్లూ చేతులు విరిచేస్తానని నిప్పులుకక్కాడు. అంతే మళ్లీ ఇంటి ముఖం చూడకూడదని తన ప్రాణప్రదమైన సంగీతాన్ని నమ్ముకుని హార్మోనియంతో లక్నో నుండి బొంబాయి చేరుకున్నాడు ఆ పిల్లవాడు. అయితే అంత కోపంతో కొడుకుని వెళ్లగొట్టిన ఆ తండ్రి తనకొడుకు భవిష్యత్తులో గొప్ప సంగీత దర్శకునిగా ఖ్యాతి గడించ గలడని ఊహించి ఉండడు. ఆ మహా సంగీత దర్శకుడే "నౌషాద్ ఆలీ".

1919 డిసెంబర్ 26న ఉత్తరప్రదేశ్‌లోని లక్నోలో పుట్టారు నౌషాద్. తండ్రి వాహిద్ ఆలీ సిటీ కోర్టులో గుమాస్తాగా పని చేసేవాడు. పాడటమంటేనే దైవ ద్రోహమని భావించే సంప్రదాయ కుటుంబం నుండి బయటకువచ్చిన నౌషాద్ బొంబాయి వచ్చిన తొలి నాళ్లలో కొలాబాలోని డా॥ నమి అనే ఆసామిఇంట్లో తల దాచుకునేవారు. బ్రతుకు తెరువుకోసం సినిమా వాళ్ల చుట్టూ తిరగని రోజులేదు. ఒకరోజు నౌషాద్ ఇంట్లో లేనపుడు లక్నో నుండి అతని స్నేహితుడు పంపిన మనీఆర్డర్ వచ్చింది. అది తీసుకున్న నమి "నన్ను అడగవచ్చుకదా డబ్బు" అన్నాడు. "ఇప్పటికే మీఇంట్లో ఉన్నాను అది చాలదా?" అన్న నౌషాద్ జవాబు లకు డా॥నమి "కాని ఒకటి గుర్తుంచుకో నౌషాద్! ఒక నాటికి నువ్వు చాలా గొప్పవాడివి అవుతావు. ఆరోజు ఈ నమి నీకు ఆదాబ్ (ప్రణామం) చేస్తాడు" అన్నాడు. ఆనాటి మాటలు భవిష్యత్తులో నిజం కాకుండా పోలేదు. పనికోసం పగటిపూటంతా సినిమా స్టూడియోల చుట్టూ తిరిగి రాత్రివేళల్లో మిత్రుని గదికి వెళ్లడం ఇష్టంలేని నౌషాద్ ఫుట్‌పాత్‌లపైనే పడుకుని గడిపేవారు నౌషాద్.

నౌషాద్‌కు తొలిసారిగా 'సముందర్' సినిమాకి పియానిస్ట్‌గా పనిచేసే అవకాశంవచ్చింది. తరువాత "పతీపత్ని" చిత్రానికి సంగీతం అందిస్తున్న హరిశ్చంద్రబాలీ మధ్యలోనే తప్పుకోవడంతో నౌషాద్ ఆచిత్రానికి సంగీత దర్శకత్వం వహించి పూర్తిచేశారు. కానీ టైటిల్స్‌లో ఆయన పేరు సహాయ సంగీత దర్శకునిగా వేశారు. తర్వాత "మీర్జాగాలిబ్" పంజాబ్ చిత్రానికి అసిస్టెంట్ గా చేశారు. ఇంకా మూవీటోన్, జనరల్ ఫిలింసిటీ, బనాట్ వాలా రికార్డింగ్ కంపెనీల్లో వివిధ హోదాల్లో పని చేశారు. అయినా జీవితం దిన దిన గండం నూరేళ్లాయుష్షులా గడిచింది. సినీ రంగంలో తన అదృష్టాన్ని వెదుక్కునే గమనంలో ఎన్ని దెబ్బలు తిన్నా, బాధపడినా నౌషాద్ తాను చేరుకోవాలనుకున్న లక్ష్యం వైపు పయనించడం మాత్రం మానుకోలేదు. అచంచలమైన ఆత్మవిశ్వాసమే అతన్ని ముందుకు నడిపించింది. మళ్లీ మనోహర్ వద్ద అసిస్టెంటుగా చేరిన నౌషాద్‌ని చందూలాల్‌షా 75రూపాయల నెలజీతంతో కూర్చుకున్నాడు. ఆర్థిక భద్రత కలిగినా షా వద్ద సీనియర్ సంగీత కారునిగా పనిచేస్తున్న జ్ఞానదత్ నౌషాద్‌ను ఎదగనీయలేదు. దాంతో మళ్లీ నిర్మాతల వద్దకు తిరగడం ప్రారంభమయింది.



అప్పటికే నౌషాద్ ప్రతిభను గుర్తించిన ప్రసిద్ధ రచయిత దీనానాథ్‌మధోక్ నౌషాద్‌ను మోహన్ భావ్‌నాని వద్దకు తీసుకెళ్లి అపుడాయన తీస్తున్న

"ప్రేమ్‌నగర్"కు సంగీతం చేయించమన్నాడు. కొత్తవానితో చేయడం చాలా రిస్క్ అవుతుందని మొదట అంగీకరించలేదాయన. అయితే రెమ్యూనిరేషన్ ని నీవద్దే ఉంచుకుని సినిమా ఫెయిలవుతే ఇవ్వవద్దు అని చెప్పాడు. చివరికి భల్‌నాని నౌషాద్‌ని తీసుకున్నాడు. "ప్రేమ్‌నగర్" 1940లో విడుదలై విజయభేరీ మ్రోగించింది. ఆయనే ఓసారి "దీనానాథ్ మధోక్ లేకపోతే సంగీత దర్శకునిగా నేను లేనే లేను" అని చెప్పుకున్నారు.

తొలిబంతే సిక్సర్ పోయినట్లు 'ప్రేమ్‌నగర్' హిట్ కావడంతో నౌషాద్ సినీ జీవితం మహత్తరమైన మలుపు తిరిగింది. ఆతరువాత మధోక్ నౌషాద్‌ను విజయభట్‌కి పరిచయం చేశాడు. ఫలితంగా దర్శన్, స్టేషన్ మాస్టర్ చిత్రాలకు సంగీతం చేశారు. 'స్టేషన్ మాస్టర్' చిత్రం గాయనిగా సురయాకి తొలిచిత్రం. ఇంతలో కర్దార్ ఆహ్వానం మేరకు విజయభట్ ప్రత్యేక అనుమతితో 'నయీ దునియా' చిత్రానికి సంగీతం అందించారాయన. 1944లో రతన్ సినిమాతో నౌషాద్ అగ్రశ్రేణి సంగీత దర్శకుడైపోయారు. రతన్ సినిమా గీత, సంగీతాలకు జనం వీధుల్లో కేరింతలు కొట్టారు.

1952లో వచ్చిన "బైజుబావ్‌రా"తో నౌషాద్ టాప్ మోస్ట్ సంగీత దర్శకుడైపోయారు. విజయభట్ తీసిన ఈ చిత్రంలో భరత్ భూషణ్ మీనాకుమారి నటన ఓ ఎత్తుకాగా నౌషాద్ సంగీతం అంతా మరొక ఎత్తు. ఒక రకంగా చెప్పాలంటే నౌషాద్ సంగీతమే ఈ సినిమాకు హీరో. ఇప్పటికి 50ఏళ్ళయినా ఈ సినిమా పాటలు వన్నె తరగని గీతరాజాలై ఉన్నవి. భైరవి, రాగంలో చేసిన "తూ గంగాకి మౌజ్‌మే", మాయా, మాళవ గౌళ రాగంలోని "మొహెభూల్ గయే సావరియా", పీలూ రాగంలోని "ఝూలేమె పవన్", మాల్కోస్ లో కూర్చిన "మన్ తడ్‌పత్ హరిదర్శన్‌కో" బిలావల్‌లోని "బచ్‌పన్‌కీ మొహబ్బత్", దర్బారీ కానడలోని "ఓ దునియాకే రఖ్ వాలే" పాటలు నేటికీ సినీ సంగీతాభిమానులను ఆనంద సాగరంలో ఓలలాడిస్తున్నాయి.

ఈ నేపథ్యంలో నౌషాద్ మేలా, గంగా జమున, అనోఖి అదా (1948), అన్‌మోల్‌ఘడి, పహలేఆప్, శారదా, కానూన్, సన్యాసి, షాజహాన్, కీమత్, నూర్జహాన్ - నాటక్, దర్ద్, దిల్లగి, జాదూ, దాస్తాన్, అందాజ్ (1949), ఆన్, అమర్, చాంద్‌నీరాత్, బాబుల్, షబాబ్, ఉరన్‌కరోలా, మదర్‌ఇండియా, దీదార్, సాథీ, సోహ్నీ మహివాల్, లీడర్, మేరే మెహబూబ్, దులారీ వంటి 60 సినిమాలకు సంగీత దర్శకత్వం నెరిపారు.

1960లో "మొఘల్-ఎ-ఆజం" నౌషాద్ సంగీత సౌరభాలను మరోసారి దశదిశలా వెదజల్లింది. దర్శకుడు, నటీనటులు, ఇతర టెక్నీషియన్స్ అంతా ఒక వైపైతే ఈ సినిమాలో నౌషాద్ సంగీతం మరో వైపు నిలిచి తనకే అగ్రాసనం దక్కించుకుంది. ఈచిత్రంలోని "ప్యార్‌కియాతో డర్నాక్యా" పాట నౌషాద్‌ను మరోసారి హిమాలయ శృంగంపై కూర్చోబెట్టింది. మూడుదశాబ్దాల పాటు నౌషాద్, రఫీ - షకీల్ బదాయూనీల కాంబినేషన్ రసగుళికలనదగిన పాటలను అందించింది. 1944లో "పహెలే ఆప్"లో పాడించి రఫీని సినిమా రంగానికి పరిచయం చేసింది నౌషాద్‌గారే.



నౌషాద్ కూర్చిన వందలాది పాటలన్నీ సూపర్ హిట్లే. స్వతహాగా ఉర్దూలో పాండిత్యంగల కవి కావడంవల్ల కవుల రచనల్లోని భావాన్ని తన స్వరాలతో సమ్మిళితం చేసి అందించడం ఆయనకు ఎడంచేతి ఆటలా సాధ్యమైంది. మరోవైపు నుంచి కథకునిగా కొన్ని సినిమాలకు కథలను సైతం సమకూర్చారు. వాటిలో "ఉరన్ కరోలా" ఒకటి. ఈ సినిమాలోనే తెలుగు తార టంగుటూరి సూర్యకుమారి నటించింది. దీని తమిళ వెర్షన్‌లో మన తెలుగు గాయని ఆర్. బాల సరస్వతి నౌషాద్ సంగీతంలో పాడింది. ఇంకా మన ఎస్. రాజేశ్వరరావు, రమేష్ నాయుడు, మాస్టర్ వేణు ఈయన వద్ద శిష్యరికం చేసిన వారే.

నౌషాద్ స్వరాలతో రూపొందిన పాటలన్నీ కర్ణ పేయమైనవే. ఆయన పని చేసిన సినిమాలు ఫెయిల్ అవచ్చు నేమోగానీ ఆయన పాటలు బాగాలేవు అనే అభిప్రాయం ఏనాడు వ్యక్తం కాలేదు. సుహానీరాత్ ఢల్‌చుకీ (దులారీ), మెరెబచ్‌పన్‌కి సాథీ, జవాహై మొహబ్బత్, ఆజా ఆజా ఆజా మెరె బర్‌బాద్ మొహబ్బత్‌కే (అన్‌మోల్ ఘడి), జబ్ దిల్ హీ టూట్ గయా హమ్ జీకే క్యాకరేంగే (షాజహాన్), మిల్‌కే బిఛడ్ గఈ అఖియాన్ (రతన్) నహన్‌మె (గంగా జమున) ఝూమ్ ఝూమ్‌కె నాచో ఆజ్‌గావో ఖుషీకే గీత్ (అందాజ్), తూమెరా చాంద్ మైతెరీ చాంద్ నీ (దిల్లగీ) ధర్తీకో ఆకాష్‌పుకారే (మేలా), తోడ్‌దియా దిల్ మేరా (అందాజ్), తుఝే ఖోదియా హమ్‌నే పానేకే బాద్, తేరీ యాద్ ఆఈ (ఆన్), చాంద్ ఛుపా (సోహ్నీమహివాల్) వంటి పాటలు ఆయన మెలోడియస్ కంపోజింగ్స్‌లో నుండి కొన్ని మాత్రమే. సినిమాలకు దూరమైన తరువాత ఆయన "టిప్పుసుల్తాన్" వంటి టి.వి. సీరియల్స్ కి పనిచేశారు.

అయితే గత దశాబ్దంగా సినీ సంగీతంలో వచ్చిన మార్పులను ఆయన నిరసిస్తారు. "పాటల సాహిత్యంలో ద్వందార్థాలు. సంగీతం రణగొణ ధ్వనులతో తన సాహిత్యాన్ని డామినేట్ చేయడం -సినిమా సంగీతం అనిపించుకోదు. అసలు గాయకులు ఏం పాడుతున్నారో తెలీడంలేదు. సంగీతానికున్న విలువలు తరిగిపోయాయి. ఇటీవల వచ్చిన శక్తి లో షారుఖ్, ఐశ్వర్యలపై చిత్రీకరించిన "ఇష్క్ కమీన" పాటలోని ఇష్క్ కమీన లాంటి మాటలు వినలేక చెవులు మూసుకోవలసి వచ్చింది. "అంటూ నవంబర్ 20న డి.డి-1లో ప్రసారమైన "హండ్రెడ్ ఇయర్స్‌టు మ్యూజిక్ రికార్డింగ్" అన్న కార్యక్రమంలో తమ అభిప్రాయాలను నిష్కర్షగా వ్యక్తపరిచారు.

"నౌషాద్ అకాడమి" పేరున ఒక సంస్థను నెలకొల్పిన నౌషాద్ అలనాటి సంగీతాన్ని భద్రపరచడం, సంగీతకారులకు సహాయ సహకారాలందించడం వంటి కార్యక్రమాలను చేపడుతున్నారు. ఇందుకు మహారాష్ట్ర సాంస్కృతిక శాఖ కూడా తమ వరిధిలో నౌషాద్‌కి సహకరిస్తుండటం విశేషం.

సినీ సంగీత దర్శకులుగా ఫిలింఫేర్, జాతీయ అవార్డులు పొందిన నౌషాద్ 1982లో అత్యున్నత పురస్కారమైన దాదా ఫాల్కే అవార్డు అందుకున్నారు. పద్మభూషణ్ తో, 1995లో మద్రాసు తెలుగు అకాడమి ఉగాది పురస్కారం, మధ్యప్రదేశ్ ప్రభుత్వం లతామంగేష్కర్ అవార్డు, దీనానాథ్ మంగేష్కర్ (2000) అవార్డులందు కున్నారు.

ఆరున్నర దశాబ్దాల తన సినీ జీవితంలో "నేను బాణీలు కూర్చిన పాటలో ఇంత వరకు నాకు తృప్తి కలిగించిన పాటలేదు" అనే నౌషాద్ పాశ్చాత్య నాగరికతా మోహం, వ్యాపార దృక్పథం. మితిమించిన శృంగారం మన సంప్రదాయాన్ని, సంస్కృతిని మంటగలుపుతున్నాయని. అందుకే నేటి సినిమారంగంలో ఇమడలేక దూరంగా ఉంటున్నానని నిక్కచ్చిగా చెబుతారు.

- హెచ్. రమేష్‌బాబు

సీరియల్

10

# సినీతిచంద్రిక



రావి కొండలరావు

ఇరవై నిముషాల తర్వాత అక్కడికి చేరుకున్నాను.

"ఏవయా అసిస్టెంటూ - నాకంటే ముందుగా వచ్చి కూచోవయ్యా అంటే, ఎక్కడెక్కడో తిరిగి ఇప్పుడు వస్తున్నావా? - నీ ఇన్‌సిన్సియారిటీ ఇప్పుడే ప్రారంభం!" అన్నాడు దర్శకుడు. నేనేం మాట్లాడలేదు. దర్శకుడు లోపలకుపోయాడు. నేనట్లాగే ఆ గుమ్మంలోనే నించున్నాను - గంటసేపు, ఆ తర్వాత, ఆఫీసుబాయ్ గావును సైకిలు దిగి - "యారు?" అని కసిరాడు.

"డైరెక్టరుగారు...." అన్నాను.

"ఇల్లె ఇల్లె" అని వాడు లోపలకుపోయి మళ్ళీ వచ్చి - "వుక్కారు - అవరు డిస్కషన్‌లే ఇరిక్రారు. వెళియిలే వుక్కారు." అని గద్దించి ఫ్లాస్కుతో సైకిలెక్కి వెళ్ళిపోయాడు! నాకు చాలా కోపం వచ్చింది. ఎంత నీచంగా వున్నాను- అనుకున్నాను. కానీ - ఏం చేస్తాను, అని అరుగుమీదే కూచున్నాను.

రాత్రి పదిగంటలు దాటాక, దర్శకుడు బయటకు వచ్చాడు. నన్ను చూసి - "ఓహో నువ్వా - ఏం ఇక్కడున్నావ్? - ఆహ్... చెప్తాను - రేప్పొద్దున్నే ఇక్కడికిరా!" అని కారెక్కి వెళ్ళిపోయాడు.

"నాన్ చొల్లిల్లియా - అవళవుదాఁ అవర్ పాకమాట్టారూ," అని నవ్వాడు నౌకరు.

**జరిగిన కథ**

**ఒక ఊళ్లో ఒక ధనవంతుని కుమారుడు సినిమా తీస్తానని పట్టుబడతాడు. ఒక మాజీ దర్శకుడు వచ్చి వాళ్ళకు సినిమా తీయడంలో సాధక బాధకాలు చెప్పసాగేడు. "నిర్మాత హీరోయిన్ మోహంలో పడడం వల్ల నా మొదటి సినిమా ఫెయిలయింది. ఆకలికి మాడుతుండగా ఫలానా అనే ఒకతను వచ్చి కొత్త నిర్మాత వద్దకు తీసుకెళ్లాడు. కథ గురించి చర్చించాక ఊరెళ్లి డబ్బులు తెస్తానని చెప్పి నిర్మాత మాయ మయిపోయాడు. ఆకలి బాధలు తాళలేక ఓ పెద్ద డైరక్టరు వద్ద అసిస్టెంటుగా జాయిన్ అవుదామని వెళ్లాను..."** **(ఇక చదవండి)**

నేను కాళ్ళీడ్చుకుంటూ, ఈడ్చుకుంటూ వెళ్ళాను, ఎక్కడికో నాకు తెలీదు. కాళ్ళలో శక్తి చమ్మగిల్లి పోయింది. అక్కడేదో అరుగు లాగా కనిపించింది. చూడగానే పార్కు బెంచీ. హారి! - నాకు తెలియకుండా నాకాళ్లే నన్నెట్లా తీసుకొచ్చేశాయి. నా స్వర్గసీమకు. ఆఫీసులో వాలి సోలిపోయాను.

"లెండి సార్ లెండి .... ఏమిటి నిద్ర .... ఎనిమిదయితేనూ .... లెండి లెండి .... అవుట్‌డోరుకు ప్రశస్తమైన ఎండ ..." అని వినిపించింది - చటుక్కున కళ్ళుతెరచి చూచాను -ఫలానా! నన్ను లేపుతున్నాడు.... ముందు కలగన్నానా అనుకున్నాను. ఇదే సంభాషణ పలుకుతూ, ఆనాడు ఫలానా నన్ను లేపాడు. ఆనాడు లేవటంలో ఎంత ఆనందం ఉంది! ఈనాడు లేవటంలో ఎంత విషాదం ఉంది!

"లేచి ఏం ప్రయోజనమోయ్! ఎవరికోసం లేవను, ఎవరి కోసం బతకను?" అన్నాను హెవీగా.

"ఏమిటిది గురూ! జీవితం మీద విరక్తి కలిగినట్టుంది. విరక్తి కలిగినప్పుడే ఈ హెవీ డైలాగులు వచ్చేది! లెండి - ఎవరికోసం నిద్రపోయారో వారికోసమే లెండి."

లేచాను చటుక్కున! ఎందుకంటే నిర్మాత ఏమన్నా రాశాడేమోననిపించింది.

"ఏమన్నా రాశాడయ్యా?"

"ఊరుకోండి గురూ. వాడు రాయటం మనం బ్రతకటం అన్నీ ఒకటే. ఉండండి - మా ఊరెళ్తానుగా - అప్పుడు చెప్తాను" అన్నాడు ఫలానా పిడికిలి బిగిస్తూ. ఫలానాను కూచోబెట్టి, నా సంగతంతా వివరించాను.

"అదేంటి గురూగారూ! మీవంటివాళ్ళు మలమల మాడి చచ్చినా నేను సంతోషిస్తాను గాని, మళ్ళా అసిస్టెంటుగా జేరటం మాత్రం సహించను!" అన్నాడు ఉద్రేకంగా.

"ఏం చెయ్యను? .... కొన్నాళ్ళపాటు ఘటం నడవాలిగదా".

"సరే జేరండి - కాస్త చిన్నవేషమైనా నాకిప్పించకపోతారా...."

ఫలానా ఘటికుడు. ఎట్లా తెస్తాడో ఎక్కడినుంచి తెస్తాడో మరి. జేబులో రెండు రూపాయలున్నాయి. నాకు బాగా టిఫిను ఇప్పించి, అర్ధరూపాయి చేతిలో పెట్టబోయాడు.

"చాల్లేవయ్యా - సంభావనకూడానూ" అన్నాను.

"ఉంచండి గురూ - మధ్యాహ్నం భోజనానికి



రాకపోయినా టిఫినుకేనా వస్తుంది" అని జేబులో పడేశాడు.

ఫలానాతో చెప్పి, డైరెక్టరు కోసం బయలు దేరాను. సాయంత్రం మీటవుతానని ఫలానా వెళ్ళిపోయాడు, నేను వెళ్ళేసరికి డైరెక్టరు ఇంకా రాలేదు. బయట కూచున్నాను - నౌకరు కంటబడకుండా. కాస్సేపట్లో డైరెక్టరుగారు కారు దిగాడు. గుడ్‌మార్నింగ్ కొట్టాను.

"రా - రా - ఏం బయట కూచున్నావు పాపం - ఒరే బాయ్ - బుద్ధిలేదురా నీకు - లోపల కొచ్చి కూచోమనకపోయావు?" అని కసుర్తూ నన్ను లోపలకు తీసుకుపోయాడు.

''కూర్చో,'' అన్నాడు. అక్కడెక్కడ కూచోవాలో నాకర్థం కాలేదు - కుర్చీలూ, బల్లలూ ఏమీలేవు.

"అవును - ఇక్కడ కూచునేటందుకు ఏమీ ఉండవు. మా ప్రొడ్యూసర్‌గారు బలేవాడు. స్క్రిప్టుమీద కూచుంటాం అంటే కుర్చీలూ, బెంచీలు తీయించేశాడు. కిందనే కూచో. కాస్సేపటికి రైటరు వస్తాడు, రాగానే మేమందరం ఆ స్క్రిప్టు మీద కూచుంటాం ఓ.కే.?" అన్నాడు దర్శకుడు.

''కానీ మీరు కూచోకుండా నేనెట్లా కూచోను?"

"వెరీగుడ్



నీకు మంచి జీతం యిప్పిస్తాను - రానీ నిర్మాత రానీ!" అని దడిపించాడు.

కాస్సేపటికి నిర్మాతా, కవీ వచ్చారు.

"అయ్యా - ఇతను మహాశయుడు! మనకు అసిస్టెంటుగా ఉంటాడు. డైరెక్టరుగా మంచి అనుభవం ఉన్నవాడు - తెలిసిన వాడూనూ, నెలకు నూరు రూపాయల జీతం ఇవ్వండి. ప్రొడక్షన్ పన్లు కూడా చూస్తాడు. ఇప్పుడో పాతిక అడ్వాన్సు ఇవ్వండి.'' ఆ నిర్మాత మారు మాట్లాడకుండా పాతిక రూపాయలు నా చేతికిచ్చాడు. ఆ డబ్బు చూసేప్పటికి నా కళ్ళు తిరిగాయి. మా డైరెక్టరు ఎంత మంచివాడో!

"అబ్బాయ్, నువ్వు ఇంక బయటరూములో కూచో - వస్తున్నవాళ్లు వస్తూ ఉంటారు - కూచో" అన్నాడు దర్శకుడు. నేనొచ్చి ముందు రూంలో కూచున్నాను. ఇంతలో నౌకరు కుర్రాడు పరుగెత్తుకుంటూ, ఏడ్చుకుంటూ వచ్చి - "సార్ సార్ మన్నిచ్చి డింగో సార్ - తెరియామే ఉళర్‌నే తెరియామ పుళర్‌నే - యన్నే మన్నిచ్చి డింగో" అంటూ కాళ్లమీద పడ్డాడు. వాడిని లేవనెత్తి మన్నించానంటే కాని ఏడుపు మానలేదు.

అట్లా కూచుని ఉండగా, ఒకామెవచ్చి నమస్కరించింది.

"ఎవరండీ?"అన్నాను.

"నా పేరు ఇందిరండీ. అసలు పేరు దమయంతనుకోండి. మాది బందరండీ. మంచి నాటకానుభవం ఉందండీ - ఈ ఊరొచ్చి రెండు నెల్లయిందండీ. మీ సినిమాలో ఏదేనా వేషం ఉంటేనండీ-"

"కూచోండమ్మా. వేషాలు ఏమున్నాయో ఏమిటో నాకేం తెలీదు. నేనే కొత్త. ఇవాళే వచ్చాను."

"వస్తే మాత్రం ఏముందండీ, తప్పకుండా ఏదేనా వేషం యిప్పించండి. ఏ వేషమైనా ఫర్వాలేదు. కాస్త మంచివేషం మాత్రం యిప్పించండి. చాలా నాటకాల్లో వేశానండి - నన్ను సినిమాల్లోకి వెళ్ళమని, మా ఊళ్ళో అంతా బలవంతం చేశారండి" అన్నదామె.

"చూడండి - నేను కూడా చాలా అవస్థలు పడుతున్నవాడినే. ఈ ఇండస్ట్రీలో సగానికి సగం మంది పనులు లేక బాధపడుతున్న వాళ్ళే. మీరొచ్చి ఇంకా రెండునెల్లే అయింది. సంవత్సరాల తరబడి ఈ ఊళ్ళో ఉంటున్నవాళ్ళున్నారు. వాళ్ళలో కొందరు ఇవాళ్టి వరకూ మొహానికి రంగు వేసుకోలేదంటే ఆశ్చర్యం లేదు! ఏం చేస్తాం అమ్మా పేరుకు పెద్దదే ఈ చిత్రపరిశ్రమ! ఉన్న నిరుద్యోగులంతా ఇందులోనే ఉన్నారు. ఈ పరిశ్రమలో సగానికి సగం ఖేదమే! ఆంధ్రదేశంలో కాస్త నటుడు నటి అనిపించుకున్నవాళ్ళంతా ఇక్కడే ఉన్నారు. కొంతమందికి అవకాశాలు కలుగుతున్నాయి. కొందరికి లేవు. అయినా మీరు తొందరపడి ఎందుకని వచ్చేశారు? సులభంగా దొరకనిదాన్నే సినిమా ఛాన్సు అంటారు. మీలాగానే వెనక ఒక అబ్బాయి మద్రాసు వచ్చి ఖేదపడి - బాధలుపడ్డ వైనం చెబుతా వినండి" అని ప్రారంభించాను.

(ఇంకావుంది)

# పద్మనాభం ఆత్మకథ



## సీరియల్ 7

పద్మనాభం గారికంటె ముందు హాస్య నటులు సినిమా నిర్మాణం చేపట్టడం జరిగింది. కానీ అవి విజయవంతం కాలేదు. శివరావు తీసిన 'పరమానందయ్య శిష్యుల కథ' ఘోరంగా ఫెయిలయి ఆయన కెరియర్‌నే దెబ్బతీసింది. రేలంగి తీసిన 'సమాజం' కూడా బాగా ఆడలేదు. అయినా శ్రీ పద్మనాభం చిత్ర నిర్మాణంలోకి ప్రవేశించారు. సాధారణంగా కొత్తగా నిర్మాతలయిన వారు 'సేఫ్టీ' కోసం తమిళ సినిమాను 'డబ్' చేయడమో, లేదా ఏదో పరభాషా చిత్రాన్ని తెలుగులో 'రీమేక్' చేయడమో చేస్తారు. కానీ పద్మనాభం అతి ధైర్యంగా 'స్ట్రెయిట్' చిత్రాన్ని చేపట్టారు. అది భారీ తారాగణంతో!

తన సినిమా కదాని తనే ముఖ్యపాత్ర వేయలేదు. రామారావు, సావిత్రి వంటి హేమాహేమీలతో సినిమా తీశారు. ఆ సినిమా నిర్మాణం గురించి ఆయన మాటల్లో చదవండి...

'వాగ్దానం ' సినిమాకు ఆత్రేయగారు రచయిత, దర్శకుడు. ఈ చిత్రంలో మహంకాళి వెంకయ్యగారు నాకు నువ్వుల నూనెతో మాలీష్ చేసే సన్నివేశం. ఆయనకు మాలిష్ చేయడం నిజంగా బాగా వచ్చు కాబోసు. షాట్‌లో బాగా మాలిష్ చేశారు. భలే హాయిగా ఉంది. షూటింగ్ అయిన తరువాత ఇంటికిపోయి ఒక రోజంతా పడి నిద్రపోయాను.

ఇంకా కొన్ని మంచి సినిమాల విషయం చెప్పవలసివస్తే - శారద కాంబినేషన్‌తో రఘురాం ఫిలిమ్స్ వారి 'తండ్రులు కొడుకులు' సినిమా. హేమాంబరధరరావు గారు దర్శకనిర్మాత. అన్నపూర్ణ 'ఇద్దరు మిత్రులు'లో నాగేశ్వరరావు గారిది డబుల్ రోల్. నాకు అమ్మానాన్నలుగా సూర్యకాంతం, రేలంగి. నాకు శారద కాంబినేషన్. పి.ఎ.పి. వారి 'కులగోత్రాలు' లో గిరిజ, నేను జోడీగా వేశాం.



అలాగే ఎన్.ఏ.టి. వారి 'గులేబకావళి కథ' సినిమా. ఇందులో లంక సత్యం, పేకేటి, నేను కలిసి వేశాం. చిన్నపిల్లాడిలా గొంతు మార్చి చేశాను. అలాగే 'పూలరంగడు' లో హాఫ్ నిక్కర్, కళ్ళజోడుతో పిల్లాడిలా చేశాను. 'దాగుడుమూతలు' లో కూడా ఈ విధంగానే చేశాను. అన్నీ ప్రజాదరణ పొందాయి.

నటుడు కావడమే మహద్భాగ్యం అనుకున్న నేను నిర్మాత కూడా అయి సినిమాలు తీయడం జరిగింది. నాటక నిర్మాణానికై పెట్టిన రేఖామురళీ ఆర్ట్సు బ్యానర్ సినిమా సంస్థ అయిన కథ చెప్పాలంటే - పిక్చర్‌లలో బిజీ కావడంతో నాటకాలకు కొంత అంతరాయం కలిగింది. మన యూనిట్ వాళ్లకు పని ఏదైనా ఉంటే బాగుండునే అనుకుంటూండగా మాతోబాటు ఉండే రచయిత వీటూరి 'దేవత' కథ వినిపించాడు. కోదండపాణి నేను విన్నాం చాలా బాగుంది అనుకున్నాం. డబుల్‌రోల్ కాబట్టి సినిమాకే గానీ నాటకానికి ఒప్పదు.

కానీ సినిమా తీయడం మనవల్ల కాదు, బడ్జెట్ ఎక్కువ. శ్రమ అవుతుంది, పైగా నేను నటుడిగా చాలా బిజీగా ఉన్నాను. సినిమా నిర్మాణం పెట్టుకుంటే నటనకు ఇబ్బంది కలగవచ్చు, 'కథ బాగుంది కాబట్టి ఇంకెవరికైనా వినిపించండి. ఎవరు చేసినా నాకు సంతోషమే' అని చెప్పాను. రెండు నెలలు గడిచింది. ఓ రోజు మాటల్లో కోదండపాణి "కథ బాగుంది కదా, వేరెవరో ఎందుకు, ధైర్యం చేసి మీరే తీయండి." అని ప్రోత్సహించారు. హీరో పాత్రకు రామారావు గారయితేనే బాగుంటుంది. కానీ ఆయన మన సినిమాలో వేస్తారా?



'దేవత' సినిమా తీసేనాటి ముచ్చట. 'కన్నుల్లో మిసమిసలు' పాట రామారావు గారు, సావిత్రిలతో సాతనూర్ డ్యాంలో తీద్దామని ప్లాను చేశాం. నా అంబాసిడర్ కారులో రామారావు గారిని మద్రాసు నుండి సాతనూర్ తీసు కెళుతున్నాం. గోపి డ్రైవ్ చేస్తున్నాడు. నేను ఫ్రంటు సీటులో కూర్చున్నాను. బ్యాక్‌సీట్‌లో రామారావు గారు పడుకొన్నారు. చెంగల్పట్టు ప్రాంతానికిరాత్రి 9-30 సమయంలో సమీపిస్తున్నాం.

అంతలో ఇరవై అడుగుల దూరంలో రోడ్డు మీద పెద్దపులి కనబడింది. పది అడుగుల పొడుగుంది. హండ్రెడ్ ఫీట్ రోడ్ తాపీగా దాటుతోంది. గోపి వణుకుతూ "పు..పు..పులి " అన్నాడు. "ఏం ఫరవాలేదు, స్పీడు తగ్గించు, అరవద్దు, రామారావు గారు లేస్తారు." అని ధైర్యం చెప్పాను.

వాడికి ధైర్యం చెప్పానే కాని నా గుండె కూడా కారు కన్నా వేగంగా కొట్టుకోసాగింది. పెద్దపులి వెళ్లిపోయేదాకా అదే పరిస్థితి. పులి వెళ్లాకనే ఇద్దరం ఊపిరి పీల్చుకున్నాం. 'బతికి బయటపడ్డాం. నాకు మహా భయం వేసింది. మీరు భయపడలేదే!" అన్నాడు గోపి. నేను చెప్పా - "పులికి నేను భయపడలేదురా, వెనక సింహాన్ని తీసుకెళుతున్నాం. నాకు అదంటేనే భయం" అని!

తిరువణ్ణామలై దాటేటప్పటికి తెల్లవారుఝాము 4 గంటలు అయింది. కారు ఆపాం. రామారావు గారు లేచారు. అప్పుడు చెప్పాను - "అన్నగారూ, ఒక విషయం జరిగింది. " అని.

"ఏమిటి?" అని అడిగేరు కుతూహలంగా.

"చెంగల్పట్టు దగ్గర పెద్దపులి రోడ్ క్రాస్ చేసి వెళ్ళింది." అన్నా.

"మరి నన్నెందుకు లేపలేదు? నేనూ చూసేవాణ్ణే!" అన్నారాయన.

"పులి వెళ్ళిపోయింది కదా! అంతగా అవసరం వస్తే సింహాన్ని లేపి వుండేవాళ్ళం." అన్నాను నవ్వుతూ.

ఆయన పొట్టచెక్కలయ్యేటట్లు నవ్వారు.

హీరోయిన్‌గా బుక్ చేస్తూ నేను సావిత్రి గారికి అడ్వాన్సుగా డబ్బు ఇస్తూ ఉంటే ఒక వంద నోటు పొరబాటున చేజారి కిందపడింది. వంగి డబ్బు తీసుకొని కళ్ళకద్దుకొంటూ "ఇది మంచి శకునం "మీ 'దేవత' వందరోజులు ఆడుతుంది, చూడండి" అన్నారు సావిత్రి. మరి అది ఆవిడ సెంటిమెంటేమో కానీ ఆవిడ జోస్యం ఫలించింది. దేవత 1965లో విడుదలై ఆబాలగోపాలాన్ని అలరించింది. వందరోజులు ఆడింది.

ఒకరోజున వీటూరిగారిని వెంటబెట్టుకుని రామారావు గారి వద్దకు వెళ్లాను. సినిమా తీస్తున్నానంటే సంతోషించారు. నేను, వీటూరి గారు కలిసి ఎన్.టి.రామారావు గారికి కథ చెప్పాము. ఆయనకు కథ నచ్చింది. 'నేను చేస్తాను బ్రదర్, గో హెడ్' అని భుజం తట్టి పంపారు. ఆయన ప్రోత్సాహంతో కొండంత బలం వచ్చింది. ఇక హీరోయిన్! ఆ పాత్రకు తగినవారు సావిత్రే!

సావిత్రిగారి దగ్గరకి వెళ్లి కథ చెప్పాం. ఆమెది డబుల్ రోల్. ఆమె కథవిని 'బాగుందని' అంటూ అంగీకారం చెప్పింది. కానీ ఆవిడకి సందేహం వచ్చింది. "నేను మూడు నెలల గర్భవతిని. మీ సినిమా ఇప్పుడు మొదలుపెడుతున్నారు. తీయడానికి ఆర్నెల్లు పట్టవచ్చు. గర్భంతో యాక్టు చేయడం ఎలాగ? మరి ప్రసవం అయ్యేదాకా ఆగగలరా?" అందామె. నేను ధైర్యంగా "మేము మూడు నెలల్లో చిత్రాన్ని ముగిస్తాం." అని చెప్పాను. 'అది సాధ్యమేనా?" అంటూ ఆశ్చర్య పడిందామె. ధైర్యం చేసి ఇల్లు 40 వేలకు తాకట్టు పెట్టాను. వాణీ ఫిలింస్ డిస్ట్రిబ్యూటర్స్ కాకర్ల వెంకటేశ్వర రావు, గోగినేని వారి సహకారంతో మూడు నెలలలో చిత్రం పూర్తి అయింది. నా మాట నిలబెట్టుకోగలిగేను.


'దేవత'లో వల్లం నరసింహారావు, సావిత్రి, ఎన్.టి.ఆర్.

సినిమా నిర్మాణం గురించి కొన్ని విశేషాలు చెబుతాను - 'దేవత' చిత్ర నిర్మాణం జరుగుతుండగా నాగయ్యగారికి పద్మశ్రీ అవార్డు వచ్చింది. శ్రీ నాగయ్య గారిని నేను నాన్నగారూ అని పిలిచేవాడిని. వారి త్యాగయ్యలో నేను నటించాను. అప్పుడే నన్ను ఆశీర్వదించారు. రేణుకా ఆఫీసులో నాకు 25 రూపాయలిచ్చి అన్నం పెట్టిన ఆ మహనీయుడు నా చిత్రం 'దేవత'లో నటించడం నేను కలలో కూడా ఊహించని ఘట్టం. అందరం ఆయనకు పూలమాలలు వేసి సత్కరించాం.

'దేవత'లో రామారావు, సావిత్రి గార్లకు కొడుకుగా వేసిన 'మురళి' నా కుమారుడు. తర్వాత చాలా ఏళ్లకు 'పెళ్ళికాని తండ్రి'లో పోలియో కుర్రవాడిగా నా దర్శకత్వంలో నటించాడు. 'శ్రీ కాళహస్తి మహత్మ్యం' నాటకంలో తిన్నడిగా చేశాడు. త్వరలోనే నటుడిగా పెద్ద పాత్రలో రాబోతున్నాడు. అదృష్టదేవత ఎప్పుడు వరిస్తుందో చూడాలి.

నేను నిర్మించిన తొలి చిత్రంలో హీరోగా నటించిన రామారావు గారికీ, నాకూ 'షావుకారు' నుండి సన్నిహితం. ఎన్నో సినిమాలలో కలిసివేశాం. ఆయన మహా పురుషుడు. అటువంటి వ్యక్తి మళ్ళీ పుట్టడు-ఆయనతో అనేకమైన చిత్రాలలో నటించాను-ముఖ్యంగా 'శ్రీకృష్ణ తులాభారం'లో ఆయన కృష్ణుడు, నేను వసంతకుడు-శాశ్వత కీర్తి నాకు దక్కింది.

ఆయన కార్యశూరుడు! 'తెలుగుదేశం' పార్టీ ప్రచారానికి రావలసిందిగా నాకు కబురు చేశారు. కొన్ని పరిస్థితుల కారణంగా వెళ్లలేకపోయాను. తరువాత ఆయన ముఖ్యమంత్రి పదవి చేబట్టడం జరిగింది. ఈ రాజకీయాలు ఆయనకు తెలియవు. జీవిత చరమాంకంలో ఆవేదన పడుతూనే మనల్ని విడిచిపెట్టి వెళ్లారు. ఆయన లేడన్న విషయం జ్ఞాపకం వస్తే ఇప్పటికీ నా కళ్ల చెమ్మగిల్లుతాయి.

(ఇంకావుంది)

'దేవత' సినిమాలో పద్మనాభంది సినిమాలంటే ప్రాణం పెట్టే పాత్ర. తన రూమ్‌లో సినీ తారల ఫోటోలు పెట్టుకుని వారి ధ్యాసలోనే ఉంటాడతను. తన మరదలు (గీతాంజలి) ఓ రోజున ఆ ఫోటోలను చూసి "ఏంటి బావా ఈ ఫోటోలు!?" అని కొంచెం చులకనగా మాట్లాడేసరికి వారందరి గొప్పతనాన్ని వర్ణిస్తూ ఓ పద్యం పాడతాడతను. సినీ నటుల్ని వర్ణించే పద్యాలు అంతకుముందు రాలేదనే చెప్పాలి. ఆ పద్యం ఇదే:

రచన: వీటూరి — గానం: మాధవపెద్ది సత్యం

ఈతడే ట్రాజెడీ యాక్టింగులో కింగు
హింది ఫీల్డుకు ప్రాపు దిలీపు
నటనలో హ్యూమరు నటులకే గ్లామరు
రాణించు గ్లామరు రాజకపూరు
రాముడై ఇలతోటరాముడై -జగదభి
రాముడై వెలిసిన రామరావు
వాసిగా అలదేవదాసుగా కవి కాళి
దాసుగా వెలుగు నాగేశ్వరుండు
మ్రోగు జగ్గయ్య కంఠము ఖంగు ఖంగుమని
దంచు విలనుని కాంతారావు గుంజీ -గుంజీ-గుంజి గుంజి
ఇతడు బాలయ్య రమణమూర్తితడే చలము
అబ్బ వీరిని పొగడ నీ అబ్బతరమే
బైబైబై - నా అబ్బతరమె అ...అ...అ....

ఆ తర్వాత అతడు మద్రాసు వెళ్లి తన మనసుకు నచ్చిన సినీ తారలను కలుస్తాడు.(ఆ రోజుల్లో అది ఒక పెద్ద ఎట్రాక్షన్ అయింది.) తానొక నటుడై పోయినట్టు కలగంటాడు. ఆ కలలో హీరోయిన్ కూడా తన మరదలే...! ఆ తర్వాత ఆమెతో ఓ డ్యూయెట్...! యల్.ఆర్.ఈశ్వరితో కలిసి పద్మనాభం స్వయంగా పాడిన ఆ యుగళ గీతమిది:

రచన: కొసరాజు — పాడినవారు: పద్మనాభం, యల్.ఆర్.ఈశ్వరి

కుమార్: మావూరు మదరాసు, నాపేరు రాందాసు
కమ్మని నీ పోజు కవ్వించే ఈ రోజు
మదనపడి మనసుచెడి వచ్చాని అమ్మాయి ॥మావూరు॥
హేమ: మావూరు బొంబాయి నాపేరు రాధాబాయి
ఏమిటి నీ బాధ ఏ మాత్రం నీ హోదా
ఆ విషయం ఆ వివరం చెప్పవోయి అబ్బాయి
కుమార్: రోడ్లమీద కార్లున్నాయ్... బ్యాంకులో డబ్బులున్నాయ్
దేవుడిచ్చిన కాళ్లున్నాయ్... చూడ్డానికి కళ్లున్నాయి
మనబింకం మనసొంతం తెలిసిందా అమ్మాయి
హేమ: క్యాడిలాక్ కారుందా ? న్యూ మోడల్ మేడుందా ?
ఇంటిముందు వ్యానుందా ? నిదురబోను ఫ్యానుందా?
కాఫీలకు సినిమాలకు కరువేమీ లేదుకదా?
కుమార్: మావూరు మదరాసు నాపేరు రాందాసు
వూరు తిరగ బస్సుంది పబాం....పబాం...
వుండను ప్లాట్‌ఫారముంది హా...హా...
కడుపునిండా నీరు త్రాగ కార్పొరేషన్ టాపుంది
ఏమున్నా లేకున్నా ఏమున్నా లేకున్న
మిన్నయైన దొకటుంది...మిన్నయైనదొకటుంది
హేమ: ఏముంది
కుమార్: ప్రేమించే హృదయముంది
హేమ: అదే నాకు కావాలి ఇతడె నన్ను ఏలాలి
కుమార్: అబ్బాయిని అమ్మాయిని ఇద్దరినీ కనాలి
కుమార్,హేమ: హాపీగా తాపీగా... హాపీగా తాపీగా
బ్రతుకు బరువు తీరాలి బ్రతుకు బరువు తీరాలి
కుమార్: మావూరు మదరాసు నాపేరు రాందాసు
హేమ: మావూరు బొంబాయి నాపేరు రాధాబాయి

# 'ఆంధ్రజయదేవ' కామసముద్రం అప్పలాచార్యులు




సంగీత సాహిత్యాలకి నీరాజనాలు పట్టిన సంస్థానాల్లో గద్వాల ముఖ్యమైంది. దీన్ని 'విద్వద్గద్వాల' అంటారని కూడా చెప్పుకున్నాం...

ఈ గద్వాల సంస్థానం కాకతీయ సామ్రాజ్యం నుంచి ఉద్భవించింది. కాకతి రుద్రాంబ-ప్రతాపరుద్రులు రాజ్యం చేసే కాలంలో రాయచూర్-కర్నూలు ప్రాంతాలు అరణ్యాలుగా ఉండేవి. కాకతీయ సామంతులు ఈ ప్రాంతాన్ని అడవులన్నీ నరికేసి నివాసయోగ్యంగా తయారు చేశారు.

1347లో బహమనీ సుల్తానులు రాయచూరు, కర్నూలు ప్రాంతాలు జయించడంతో వీళ్లు వాళ్లకు సామంతులయ్యారు. మళ్ళీ 1489లో బీజాపూర్ సుల్తానులు జయించడంతో వాళ్లకు సామంతులయ్యారు!...

1663 ప్రాంతంలో పెదసోమభూపాలుడు రాజ్యానికి వొచ్చాడు. గద్వాలు సంస్థానాన్ని నిర్మించిన వాళ్ళలో పెదసోమభూపాలుడు ప్రముఖుడు. ఇతను బీజాపూర్ సుల్తానుకు నామమాత్రపు సామంతుడుగా ఉంటూ సర్వస్వతంత్రుడై పరిపాలించేవాడు. ఆ తర్వాత ఔరంగజేబు బీజాపూర్, గోల్కొండ మొదలైన రాజ్యాలని జయించడం మొదలు పెట్టడంతో-పెదసోమభూపాలుడు ఔరంగజేబు తో స్నేహం చేసుకున్నాడు. ఈయన కాలంలో 'గద్వాల' ఒక్క వెలుగు వెలిగింది. పెదసోమ భూపాలుడు స్వయంగా కవీ-పండితుడు.

ఎన్నిసార్లు చెప్పుకున్నా తనివి తీరని ఒక సంఘటన... చర్విత చర్వణమే అయినా మరోసారి చెప్పుకుందాం... కార్తీక మాసంలో జరిగే కవిపండిత సభకి... వచ్చే పండితులు, కవులూ, సంగీతవేత్తలూ నడిచే దారిలో తెల్లటి మల్లు గుడ్డ పరిచీ ఆ పాద ధూళిని పోగు చేసి చూర్ణం చేసీ దాన్ని బంగారు బరిణెలో భద్రం చేసి నీళ్లలో వేసుకునీ రాజ కుటుంబీకులు యావన్మందీ తీర్థంతో సేవించేవారట...

ప్రపంచ చరిత్రలోనే ఇది అరుదైన సంఘటనగా నేను భావిస్తాను. ఆ దృశ్యం తల్చుకున్నా... చదివినా అప్రయత్నంగా కళ్ళల్లో నీళ్లు తిరిగి... గద్వాల ప్రభువులకి సాష్టాంగ పడాలనిపిస్తుంది. అలాంటి 'గద్వాల' సంస్థానంలోని సంగీత విద్వాంసుడే కామసముద్రం అప్పలాచార్యులు.

కామసముద్రం అప్పలాచార్యులు-కౌండిన్యస గోత్రికుడు.

---

గౌరవనీయులైన భరణిగారికి,

'భరణి' లో పొందికగా దాచుకునే పసిడి బంగారపు ఆభరణం లాంటి విలువైన సంగీత విద్వాంసుల కథా వస్తువును ప్రతి పక్షంలో పాఠకులకు బహూకరిస్తున్నందుకు బహుళ ప్రజాభిమాన్యులు అవుతున్నారంటే అతిశయోక్తి కాదు-యదార్థం. 'కృష్ణం కలయ సఖి సుందరం' మా మనో ఫలకంపై ఓ విన్యూత్నమైన రూపంలో హృద్యంగమంగా 'హరి హరా ద్వైతం'లో ముద్ర వేసుకుంది. సంగీతాన్ని మహేంద్రవాడపై శిష్య వాత్సల్యం, ఆ పోశనింపజేసిన శ్రీ శృంగారం వారు సదా స్మరణీయులు.

ఆచార్యుల వారి ఆశీర్వచన బలమే-బాపన్నను- హరి హర కృతి కర్తను జేసింది. అందు 50 కృతులు, 10 వర్ణాలు, 10 జావళీలు ఉన్నాయన్నారు. ఆ పుస్తకం సంగీతాభిమానులకు లభ్యమయ్యే విక్రయశాల ఎక్కడో? శ్రీ శృంగారం వారి పేరు అళహసింగారా చార్యులు, కాని అలహ కాదు. అచ్చు తప్పు అనుకుందాం.

ఆదితాళంలో ఉదయ రవి చంద్రిక రాగంలో విఘ్నేశ్వర స్తుతి వీనుల విందుగా పాడుకోవచ్చుననుకుంటూ- బాపన్న శాస్త్రిగారి మరో కృతి బాలా త్రిపుర సుందరి మీద వ్రాసేరని చదువుతూ ఉంటే ప్రక్క పేజిలో తళుక్కుమంది ఓ ఫేస్! తీరా ఎవరా అని పరికిస్తే 'తనికెళ్ళ ' వారిది! మనస్సు వెంటనే చివుక్కుమంది . చెప్పకనేం అందుక్కారణం సంగీత కథా రసస్వాదన చటుక్కున ఆగిపోయింది 'సమాప్తం' అని. మరో నాల్గు రస గుళికలు, అక్షర రూపంలో పాఠకులకు పడేయొచ్చుకదా - మీ సొమ్మేం పోయింది సార్. మా 'పది రూపాయలకు' పరమాన్నాన్ని ఎలాగూ విలువైందే - - 'హాసం' ప్రతి విందు విస్తరిలో మీరు వడ్డింప చేస్తున్నారు.

మనోహరభక్ష్యాలతో - 'హాసం' మలి ప్రతి కోసం ప్రతీక్షిస్తూ ఉంటా!

భవదీయుడు
శ్రీమాన్ శ్రీకాశ్యపి
సింహాచలం.

---

గౌరవనీయులైన భరణిగారికి,

నాకో బుల్లి చెల్లి, దానికి గల్లీలో పెళ్లి, చెల్లి పెళ్లి జరగాలి మళ్ళీ మళ్ళీ అని ఆశు కవిత్వం చెప్పి, 'వేయకుంటే చస్తా గానీ, వేయక చస్తానా?' అని ఎడిటర్ చే కంటతడిపెట్టించి, కబడ్దార్! వేయకపోతే చూడని బెదిరించే కర్కశ కవిని, మాటల రచయితగా, పాటల రచయితగా విభిన్న పాత్రలు పోషించే విలక్షణ నటుడుగా తెలుసుగాని, తమరు విరాడ్రూపులని, సంగీత సాహిత్యాలను సంగమింపజేసి, సామాన్యునికి కూడా సారాంశాన్నందించ గల్గే సాహితీ మూర్తులని, మరుగున పడిన, మన మధ్యలోనే యుండి మనకు తెలియక అజ్ఞాన మూర్తులుగా మిగిలిన, అశేష ప్రజ్ఞా పాండితీ మూర్తులను ఆవిష్కరింపజేయు, అసాధారణ ప్రతిభాశాలురని, "హాసం" పత్రిక ద్వారా తెల్సుకొని హార్దికాభినందనలంద జేస్తున్నాను.

ఎందరో మహానుభావులు మరుగున పడిన ఆ మహనీయుల చరిత్రలు మథించి, అమృత భాండాన్ని అందజేస్తున్న మీరు నిజంగా మహత్కార్యాన్ని భుజస్కందాలపై వేసుకుని నిర్వహిస్తున్నారు. మీకు, మీ ద్వారా 'హాసం' పత్రికా సంపాదక వర్గానికి, ఈ సంప్రదాయాన్ని ఇలాగే కొనసాగించమని వేడుకుంటున్నాను. భరణి లో పుట్టినవారు ధరణి ఏలుతారంట. మీరే నక్షత్రంలో పుట్టారో మాకు తెలియదు. గానీ ధ్రువతారలను దర్శింపజేస్తూ సాహితీ జగత్తునేలుతున్నారు. మీరిలాగే సాహితీ సేవ జేస్తూ సరదాగా నాలుగు జోకులు, నాలుగు పాటలు, నాలుగు సన్నివేశాలే సినిమా కాదని, నాల్గు కాలాల పాటు నిలచి, సందేశాత్మకమై, సర్వజనామోదాన్ని పొంది సంతోషాన్ని కల్గించేది సినిమా అని, దానికెందరో ఎంతో శ్రమించి సాధించారని తెలియజేస్తూ తీరుతెన్నులు నేర్పండి.

విధేయురాలు
శ్రీమతి విశాలాక్షి
గోపాలపట్నం, విశాఖపట్నం.

శ్రీనివాసాంబా-కృష్ణమాచార్యుల పుత్రుడు... అహోబిల శ్రీనివాసుని శిష్యుడు...

సంగీత సాహిత్యాల్లో దిట్ట....

ఒకనాడు పెదసోమభూపాలుడు కొలువుదీర్చి అప్పలాచార్యుల వారిని పిలిపించి...

"కృష్ణ దిర్వకథలష్ట పదులివి తెనుగొనర్చి

సంతసము గూర్చు మప్పలాచార్య సుకవీ" అని కోరారు.

కోరిక మంచిదే...కానీ క్లిష్టమే...

ఇది ఓ రకంగా వరం... మరో రకంగా శాపం!!

ఎంచేతనంటే జయదేవుడి అష్టపదులకి యావద్భారతదేశంలోనూ ఖ్యాతి ఉంది. అవన్నీ సంస్కృతంలోనే ఉన్నా... ఏ భాషకాభాష వారు ఇవి తమవేనేమో అనుకునేంతగా జన జీవితంలో మమేకమైపోయిన గీతాలు...

ప్రత్యేకంగా చెప్తే తప్ప... ప్రళయ పయోధి జలే అన్నా చందన చర్చిత నీలకళేబర అన్నా... ఇవి తెలుగువేగా అని ఆశ్చర్యపడ్డవాళ్ళు గూడా ఉండొచ్చు.

అంచేత అప్పలాచార్యులొక పనిచేసారు... అసలు ముందు జయదేవుడి జీవితం... ఆయన సాహిత్యాన్నీ ఆపోసన పడదాం అనుకుని కృష్ణుణ్ణి మనసుల్లో స్మరించుకునీ...

జయదేవుడు పుట్టిన ఊరు ఒరిస్సాలోని 'కిందుబిల్వం' అనే ప్రదేశానికెళ్ళి...ఆ మట్టిని చేత్తో పట్టుకుని ముద్దెట్టుకున్నాడు...

మన్నుతిన్న కన్నయ్య నోరంతా తెరిచి నవ్వాడు!!

జయదేవుడి తల్లిదండ్రులైన భోజదేవుడు... రమాదేవి తమ పిల్లాణ్ణి ఊయలలూపిన ప్రదేశానికెళ్ళి... ఆనందంలో ఊగిపోయాడు...

అవును మరి నేనూ లయకారుణ్ణే కాను, ఊయలకారుణ్ణి కూడా అన్నాడు గీతాకారుడు...

జయదేవుడి గీతాలకి ఆయన పద్మావతి నర్తించిన మండపాల మీద కూర్చుని అరచేతుల్తో ఆ గచ్చు తుడిచాడు అప్పలాచార్యులు.

ఆవిడ నాగినిలా ఆడగలదు... నేను కాళీయుడిపై ఆడినట్లు అన్నాడు తాండవ కృష్ణుడు.

అన్నిచోట్ల కృష్ణ దర్శనం-కృష్ణ స్పర్శనం జరిగిపోతోంది అప్పలాచార్యులకి. మొత్తానికి జయదేవుడి గీత గోవిందం కళ్ళకద్దుకున్నాడు...

వేణునాదం వినిపించింది...

12 సర్గలూ, 24 అష్టపదులూ, 72 శ్లోకాలలో ఉన్న గీతగోవిందంలో మధుర-శృంగార భక్తిని... ఆస్వా దించి... దాన్ని తెలుగులో రాయ డానికి శ్రీకారం చుట్టాడు.



పాంచ జన్యం వినివించింది... జేగంటనాదం వినిపించింది.... రాస్తున్నంత సేపూ.... యమున తరంగాల మీదనించి తేలి వొస్తోన్న పిల్ల గాలీ...

ఎక్కడో లీలగా బృందావనం లోంచి వినిపిస్తున్న రసకేళీ... ఇలలోనే జయదేవుని ఆత్మని ఆవిష్కరించుకునీ కొన్ని అనే రాగాలు ఉంచేసీ... కొన్ని సౌలభ్యాన్ని బట్టి రాగాల్ని మార్చీ మొత్తానికి... శ్రీకృష్ణ లీలా తరంగిణి-అనే ఆంధ్రాష్టపది తయారైంది!!

వీటిని పరిశీలించండి!!

| అష్టపది | మూలరాగం | అనువాదరాగం |
|---|---|---|
| ప్రళయ పయోధిజలే | మాళవ | సౌరాష్ట్ర |
| లలిత లవంగ | వసంత | అసావేరి |
| చందనచర్చిత | నామక్రియ | బేగడ |
| రసే హరిమివ | ఘూర్జరి | జేజేవంతి |
| సఖీహే | మాళవగౌడ | మోహన |
| రతిసుఖసారే | ఘూర్జరి | కేదారగౌళ |
| ముగ్ధేమధుమధనం | వసంత | భైరవి |
| ప్రవిశరాధే | వరాళి | మధ్యమావతి |
| క్షణమిథునా | విభాస | సురటి |

అటు సంస్కృతం మీద ఇటు తెలుగుమీద అపారమైన పట్టు ఉన్న కామ సముద్రం అప్పలాచార్యుల వారి 'శ్రీకృష్ణ లీలాతరంగిణి' మువ్వగోపాలుడి మొలకి మరో బంగారు మొలతాడు...

**-తనికెళ్ళ భరణి**

గౌరవనీయులైన భరణిగారికి,

"బాపన్న శాస్త్రి ఉంగా భాషలో లింగంతో మాట్లాడుతున్నాడు" అన్న మహ ద్వాక్యంతో కూడిన మీ వ్యాసాన్ని 'హాసం' పుస్తకంలో చదివాను. ఆర్ద్రత, రమణీయకత పడుగూ పేకల్లా పెనవేసుకుని, భావుకత్వాన్ని తోడు తెచ్చుకుని అఖిలాంధ్ర లోకానికీ ఎంతటి ఆనందాన్ని పంచిపెడుతున్నారండీ? నిజమైన నిష్కామకర్మయిదే కదా! గురజాడ, చిలకమర్తి, కాళ్ళకూరి పానుగంటి వంటి మహానుభావుల రచనలు చదివినప్పుడు అచ్చతెలుగు వాడి మనస్సుకు ఎలాంటి ఉత్కటానందం కలుగుతుందో అలాంటి ఆనందం కల్గింది మీ వ్యాసం చదువుతుంటే. యిప్పుడు హాసం పాత సంచికలు తెప్పించుకోవాలి. మీ వ్యాసాలన్నీ చదవాలి. అంతులేనట్టి ఆనందానుభవం అనుభవించాలి. నమస్కారాలతో...

భవదీయుడు

డా॥ బి.ఎస్. ప్రసాద్,

భీమడోలు.

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు-సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

**-భరణి**

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని

శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయదలుచుకునే వారు

**తనికెళ్ళభరణి**

కేరాఫ్: "హాసం", 502,

శ్రీబాలాజీ నిలయం,

13-1-212, మోతీనగర్,

హైదరాబాదు-500 018.

అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.






విలేకరి : మీరింత అందంగా ఆనందంగా ఉంటారు కదా ఆ రహస్యం ఏమిటి? రోజూ ఏం తీసుకుంటారు?

సినీతార : పొద్దున్న పాలు - బ్రెడ్, మధ్యాహ్నం ఆకుకూరలతో తాజా భోజనం, సాయంత్రం ఫ్రూట్ జ్యూస్....

విలేకరి : మరి రాత్రికి?

సినీతార : ఓ పదివేలు .... (అనేసి నాలిక్కరుచుకుంది)



భర్త : అమ్మదొంగా .... ఇన్నాళ్ళు నాకు చెప్పావు కాదేం

భార్య : ఏ విషయం అండీ

భర్త : అదే .... నువ్వు తల్లివి కాబోతున్నావని...

భార్య : భయపడ్డానండి

భర్త : పిచ్చిదానా.... ఇందులో భయపడడానికేముంది .... సంతోషించాలిగాని.

భార్య : అలాగే అనుకొని పెళ్ళికాకముందు ఓ సారిలా చెప్తే మా అమ్మానాన్నా నన్ను చితక్కొట్టేశారండి.



"నువ్వు కుక్కనైతే కొనగలవుగాని నీపట్ల దానికి విశ్వాసం ఉండేలా చేసుకోగలవా?" అన్నాడు భర్త డాగ్ షోలో కనబడిన ఓ కుక్కపిల్లని కొనుక్కొని వచ్చిన భార్యతో

"భలేవారే .... పెళ్ళయిన కొత్తలో మీరు మాత్రం మాట వినేవారా .... ఏంటి ....? నెమ్మదిగా దారికి తేలేదూ .... ఇదీ అంతే ...." అందా ఇల్లాలు కుక్కపిల్లని దువ్వుతూ.



"పెళ్ళెందుకు చేసుకున్నావ్?"
"జీవితం కోసం"
"మరి విడాకులెందుకు కావాలంటున్నావ్?"
"బ్రతకటం కోసం"



"అమ్మా నన్ను నీ కడుపులో ఎవరు తెచ్చి పడేశారు?"
"ఆ దేవుడు బాబు"
"మరి నిన్ను"
" ఆ దేవుడే బాబు"
"మరి అమ్మమ్మని"
"ఆ దేవుడే బాబు"
"ఎంతపని జరిగిపోయిందమ్మా"
"అదేంటి బాబు అలా బాధపడుతున్నావు?"
"బాధపడక ఏంచెయ్యమంటావమ్మా! మనింట్లో మూడు తరాలుగా సహజమైన పుట్టుకలు లేకుండా పోతుంటే"



"క్లయిమాక్స్‌లో నేను చనిపోయిన సీను చూసి థియేటర్ జనం భోరుమని ఏడ్చారట తెలుసా?" అంది ఓ హీరోయిన్ మరొక హీరోయిన్‌తో

"నేనూ విన్నాను ఈ న్యూసు. 'అయ్యో ఇది నటనే కదా!?' అంటూ ఏడ్చారట" అందా రెండో హీరోయిన్ కూల్‌గా.



"అన్నట్టు ఆ ప్రకాష్‌ని పెళ్ళి చేసుకోను అని అన్నావట ఎందుకూ?"
"అతనొట్టి పిరికివాడు .... అతనితో జీవితంలో సుఖపడలేం"
"నిన్ను కట్టుకోడానికి సిద్ధపడినవాడు పిరికివాడెలా అవుతాడు భలేదానివే!?"






ప్రవీణ్ : కొట్టానంటే 32 పళ్ళు రాలిపోతాయ్ తెలుసా !?

సుబ్బారావు : నేను కొట్టానంటే 64 పళ్ళు రాలిపోతాయి ఏమనుకున్నావో ఏంటో !

సురేష్ : అదేంటి సుబ్బారావ్ గారూ .... 64 పళ్ళేంటి? మనిషికుండేది 32 పళ్ళేగా !

సుబ్బారావు : నీలాంటి తింగరోడు మధ్యలో వచ్చి కల్పించుకుంటాడనే టోటల్‌గా చెప్పా.



కొత్తగా ఉద్యోగంలో చేరిన ఒక యల్.డి.సి. "ఈ లెటర్ ఏం చెయ్యాలండీ?" అని అడిగాడు హెడ్‌క్లర్క్‌ని.

"పెండింగ్ పెట్టు" అన్నాడు హెడ్‌క్లర్క్.

ఇంకో ఫైల్‌తీసి "ఇదేం చెయ్యాలి?" అన్నాడు.

"పెండింగ్ పెట్టు" అన్నాడు మళ్ళీ.

ఆ తరవాత ఇన్ని కాయితాలు తెచ్చి "ఇవ్వన్నీ పెండింగ్ పెట్టు' అన్నాడు హెడ్‌క్లర్క్.

యల్.డి.సి.కి సహనం నశించింది. "నేను కూడా మనిషినేనండీ. ఇన్ని ఇచ్చి పెండింగ్ పెట్టమంటే ఒక్కసారిగా నావల్ల అవుతుందా. ఇవ్వన్నీ ఒక్కరోజులో పెండింగ్ పెట్టడానికి నాకేమీ నాలుగు చేతుల్లేవు. రోజుకి కొన్ని పెండింగ్ పెడతా" అని చిర్రుబుర్రు లాడుతూ కాయితాలన్నీ డెస్క్ మీద విసిరి కొట్టాడు.



కోమల్‌రావు గ్రంథసాంగుడు. అతగాడికి ఈ మధ్యనే పెళ్ళైంది. భార్య సుమతి చెవిలో అతగాడి పూర్వ వృత్తాంతాలన్నీ పూసగుచ్చినట్టు చెప్పారెవరో. ఓరోజు సినిమా థియేటర్లో టిక్కట్టు దొరక్క బాధపడుతున్న ఓఅమ్మాయిని చూపించి, "ఇదేనా అది" అడిగింది సుమతి. "అదే - అదే - టికెట్లేమైనా ఎక్స్‌ట్రా వున్నాయేమో కనుక్కొస్తానుండు" అని వెళ్ళి, తిరిగొచ్చి," ఎక్స్‌ట్రా టికెట్లేవీ లేవుట. నువ్వు ఆటోలో జాగర్తగా ఇంటికెళ్ళు. నేను పిక్చరు చూసొస్తా". అన్నాడు కోమలరావు.

**నీతి: తెగే దాకా లాగకు.**

---



మాట్నీ సినిమా చూద్దామని పత్నీ సమేతంగా కారులో వెళ్ళాడు కోట్నీస్.

పెయిడ్ పార్కింగ్ వాళ్ళు పార్కింగ్ రేట్ చాలా చెప్తున్నారని - కారుని దూరంగా పార్క్ చేసి, వచ్చాడు- సినిమా పూర్తియ్యేలోగా ఇరవైసార్లు బైటికొచ్చి చూసుకున్నాడు కారుని.

ఇదంతా గమనించిన పార్కింగ్ గుమాస్తా నవ్వి- "పదిరూపాయల కోసం బంగారం లాంటి సినిమా మిస్సయ్యారు గాదా సార్"అన్నాడు.

"సినిమా దేవుందోయ్... టోటల్‌గా అర్థం అయిపోతుందిలే...! అనవసరంగా పార్కింగ్‌కి వేస్ట్ చెయ్యటం బదులు అది బెటర్". అన్నాడు కోట్నీస్ డబ్బు మిగిల్చానన్న ఆనందంతో.

"అదిసరే సార్ ఇందాకో కుర్రాడొచ్చి - ఓ స్టీరింగ్ వీల్, స్టీరియో డెక్ అమ్ముతానని బేరం పెట్టాడు. మీ కార్లో అవి ఉన్నాయో లేవో చెక్ చేసుకోండి" అన్నాడు పార్కింగ్ గుమాస్తా చిద్విలాసంగా.



సులేమాన్, సుబ్బారావ్ జిగ్రీ దోస్తులు. ఒకళ్ళు జైలుకెళితే ఇంకొకళ్ళు బెయిలిప్పించడం ఆనవాయితీ.

"ఎట్టాగో అట్టా నువ్వు తప్పించుకుని బయట పడు. నాకు బెయిలివ్వచ్చు". అన్నాడు సుబ్బారావు.

"నీకు బెయిలిచ్చాక తప్పించుకున్నందుకు నన్ను బొక్కలో తోస్తారుగా." అనుమానం వెలిబుచ్చాడు సులేమాన్. "అప్పుడు నేను బయటే ఉంటాగా నీకు నేను బెయిలిప్పిస్తాను" అన్నాడు సుబ్బారావు.

ఈ జోక్‌లను పంపినవారు :

**బిరుదురాజు భుజంగరాజు, హైదరాబాద్**




**జరిగిన కథ**

అజయ్ అనే శ్రీమంతుడికి విజయ్ అనే నిరుద్యోగి తారసిల్లుతాడు. విజయ్‌కి తల్లి లేదు. తండ్రి అప్పులు చేశాడు. చెల్లెలు మీనా కాపురం చిక్కుల్లో పడింది. అజయ్‌కి బాల్యంలోనే తల్లి, ఇటీవలే తండ్రి పోయాడు. మేనేజర్ భానోజీదే పెత్తనమంతా. ఒక సంవత్సరం పాటు తమతమ స్థానాలను మార్చుకుని పరిస్థితులను ఎదుర్కొనాలని ఇద్దరూ నిశ్చయించుకుంటారు. విజయ్ ఇంటికి వెళ్ళిన అజయ్‌కు పొద్దున్నే అప్పులవాడు వచ్చి ఘర్షణపడ్డాడు. అజయ్ ఇంటికివచ్చిన విజయ్‌ను అత్తయ్య శంకిస్తుంది. అజయ్‌ను వెంటబెట్టుకు వచ్చాక సందేహ నివృత్తి అవుతుంది. మీనాను రౌడీలు అల్లరి చేయడం భరించలేక అజయ్ ఆమె అత్తవారింటికి బయలుదేరతాడు. అతని బావ బుజ్జి పిరికివాడు. తండ్రికి తెలియకుండా గడ్డం చేయించుకుంటూ ఉంటాడు. (ఇక చదవండి)



# అన్నపూర్ణావారి ఇద్దరు మిత్రులు

## సీరియల్ - నవల 7



రచన : ముళ్లపూడి వెంకటరమణ



కానీ పరంధామయ్యగారికి వెయ్యేళ్లాయుస్సు కాబోలు.

'ఓ హెుయ్ ఇంటి ఇల్లాలూ' అంటూ ఓ పొలికేక, బొయ్‌మన్న మొరుగూ, గుర్రవంత కుక్కా, ఆ వెనక చెట్టంత పరంధామయ్యగారూ లోపలి కొచ్చారు.

మీసాలంత కనుబొమలూ, గేదె కొమ్ములంత మీసాలూ, ఉరిమేగుడ్లు - ఆ పరంధామయ్య గారు భోళా మనిషనీ, మంచి ముండావాడనీ ఎరగనివాళ్లు, ఝడుసుకుంటారు చూడగానే.

ఆయన ఓ భారీ కుక్కనీ, నగలు వాపసిస్తేతప్ప కోడల్ని కాపరానికి రానివ్వరాదన్న పట్టుదలనీ పెంచుకుంటున్నాడు.



'ఓ హెూయ్ ఇల్లాలో' అన్నాడాయన అరుగు మీద కూర్చుంటూ, గోడఅవతల మండువాలో సన్నివేశాన్నింకా గమనించలేదు.

'ఏటా పొలికేకలు! ఒసేయ్ ఓ హెూయ్ అంటూ, ముద్దుగా పేరు పెట్టి సూరమ్మా అని పిలవరాదూ' అంటూ ఇంటి ఇల్లాలివతల కొచ్చింది.

పరంధామయ్యగారు భళ్లున నవ్వాడు! 'ఓసి నీ ముద్దు ముక్కలుగానూ, ఈ వయసులో నీకు ముద్దేవిఁటీ, పోయి కాస్త నిప్పుపట్రా' అన్నాడు.

'ఇదిగో అగ్గిపెట్టి' అంటూ గూట్లో పెట్టినందుకొని అందించిందిల్లాలు.



పరంధామయ్యగారు, చురుగ్గా పుల్ల వెలిగించి చుట్ట ముట్టించబోయి ఉలిక్కిపడి, పుల్లవిసిరి, పెట్టిని భార్యమీదకి విసిరికొట్టి గఁయ్‌మన్నాడు.

'ఏవిటండీ! మళ్ళీ ఏ మొచ్చింది?' అంది అర్ధాంగి.

'అగ్గిపెట్టె ఇవ్వొద్దని ఎన్నిసార్లు చెప్పాను! చుట్ట ముట్టించుకోబోతే, నా మీసాలకు అంటుకుంటే? ఫో! పోయి పిడకమీద నిప్పేసి తీసుకురా!' అంటూ కుక్కని స్తంభానికి కట్టి అరుగు దిగి లోపలికెళ్లేవరకూ -

ఆ మూల గోడ కంటుకుపోయినట్టు నిలబడి గజగజ వణికిపోతున్న బుజ్జీ మంగలీ కనబడ్డారు.



'ఓరి అంట్లవెధవా! పెళ్లాన్ని ఏలుకోలేని చవటవి నీకు గడ్డం ఒకటి తక్కువైందా? ఆఁ!' అని గర్జించి, లోపలకి దూకాడు.

'ల్లే ల్లేదు నాన్నా! ఎక్కువై దురదపెడుతోంది.'

"చాల్లే, నోర్ముయ్! నెల్లాళ్ళకోసారి క్షవరం చేయించుకోమని ఎన్నిసార్లు చెప్పాను? వారం వారం చేయించుకోవడానికింట్లో డబ్బేం మూలుగుతోందనుకున్నావా? ...' అంటూ మంగలి కేసి తిరిగి, 'పోరా ఫో! మా గాడిదకి బుద్ధిలేకపోతే నీకేనా ఉండద్దూ?' అని ఉరిమాడు పెద్దదొర.

వీధిలోకి భయపడిపోతున్న మంగలికేసి చూసి 'సగమే చేశాడు నాన్నా!' అన్నాడు బుజ్జి దీనంగా.

'ఈ వేళకి అది చాల్లే!'



ఆ వేళకి ఇవతలికొచ్చిన సూరమ్మగారు మొత్తుకొంది - 'అయ్యో, అయ్యో అదేమిటండీ! సగం గడ్డంతో వీధిలో ఎలా తలెత్తుకు తిరుగుతాడండీ?'

'అసలు వీధిలో కెందుకెళ్ళాలి? ఉద్యోగమాఁ ! సద్యోగమాఁ! గుమ్మపాలుతాగి కండలు పెంచుకూచ్చోడమేగా వీడి పని! .... వెధవచుట్ట వెధవచుట్టాని. మూడుసార్లు ముట్టిస్తేగాని ముట్టుకోదు - అయిదుసార్లు అంటిస్తేగాని అంటుకోదు' అన్నాడాయన పనికి మాలిన కొడుకుని, పనికిమాలిన చుట్టనీ కలియదిడుతూ.



చుట్ట మళ్ళీ ముట్టించి లేచాడు.

'ఇదిగో అబ్బీ! నేనలా వీధిలో కెళ్ళొస్తాను. నే వచ్చేసరికి కుక్కకి పాలుతాగించి శుభ్రంగా సబ్బుతో స్నానం చేయించు. ఏం? తెలిసిందా!'

'తెల్సింది' అన్నాడు బుజ్జి, సగంమాసిన బుంగమొహం పెట్టి.

'ఏమిటి?'

'పాలుతాగి సబ్బుతో స్నానం చేయమన్నావు.'

'నువ్వు కాదురా వెధవా! కుక్క.. ఏం?'



'అలాగేలెండి. అయ్యో రాత! ఈ ఇంట్లో ఆ కుక్కపాటి నోచుకోలేదు నా బిడ్డ' అంటూ గసురుకుంది సూరమ్మగారు.

తండ్రి కనుమరుగవగానే భుజంగరావు పౌరుషం పడగ విప్పింది.

'అమ్మా అమ్మా ఈ అవమానం భరించలేను. నీ చేత్తోనే ఇంత విషంకలిపి యియ్యి. ఆ కుక్కక్కాస్త పెట్టి నేను కాస్త తింటాను. పీడా విరగడవుతుంది' అన్నాడు.

'ఏవిట్నాయనా ఆ మాటలు. ఒక్కగానొక్కడివి. వరప్రసాదివి. డబ్బులు నేనిస్తాను షాపుకెళ్ళి చేయించుకురా మా బాబుగదూ' అంటూ రొండిలోంచి డబ్బులుతీసి ఇచ్చింది.

ఈ బుజ్జగింపుకు బుజ్జి పొంగిపోయాడు. 'మా అమ్మ - మా బుజ్జి' అంటూ చెంగు చెంగున బుజ్జి తువ్వాయిలా గెంతులు వేస్తూ సైకిలు తీసుకుని వీధిలోకి వచ్చాడు.



గుమ్మంలోనే బావమరిది 'విజయ్' ఎదురై, సైకిలు ఢీ యిచ్చాడు.

బుజ్జి కిందపడి లేచి, సగం గడ్డం బావకి కనపడకుండా గంభీరమైన ప్రొఫైలు ఫోజు పెట్టి మెడ పైకెత్తి 'రా బావా రా, చాలా రోజులకి -' అంటూ సాధ్యమైనంత



ఆనందం అభినయించాడు. బావను ఆపాదమస్తకంగా పరిశీలనగా చూశాడు అజయ్.

'అదేంటి బావా? మెడ అలా పెట్టావ్' అన్నాడు.

'ఏం లేదు బావా! రాత్రి నిద్రలో మెడనరం పట్టేసింది' అంటూ చేత్తో ఒక భాగాన్ని కప్పుకున్నాడు బుజ్జి.

'మరా చెయ్యేమిటి?'

'అదా? .... హోది .... అది పిప్పిపన్నుపోటు, యమబాధగా ఉంది'



గుమ్మంలో సందడి విని సూరమ్మగారు చక్కా వచ్చింది! 'ఏం నాయనా అంతా కులాసా? మా కోడలు మీనా బాగుందా?' అంటూ.

అజయ్‌కి ఇచ్చకాలు చెప్పడం చేతకాదు. చాలా డబ్బుండడంవల్ల మనిషికి లభించే వైభోగం ఒకటుంది. చాలా సందర్భాలలో ధైర్యంగా నిజం చెప్పేయ్యొచ్చు. దరిమిలాను సత్యవంతుడని కీర్తి రావడానికిదో కారణం అవుతుంది.

కోపం మీద కూడా ఉన్నందువల్ల, పిల్లనిచ్చుకున్న వాళ్ళన్నమాట కూడా మరిచిపోయి నిష్కర్షగా అడిగేశాడు. 'ఎలా బాగుంటుంది చెప్పండి, మీరింత అన్యాయం చేశాక. ఆ విషయం తేల్చుకుందామనే వచ్చాను .... ఏం బావా? మీనాను ఎప్పుడు దిగబెట్టమంటావ్?' అన్నాడు చనువుగా, చొరవగా.

'మాదేముంది బావా. అంతా మా నాన్న యిష్టం' అన్నాడు బుజ్జి ముసిముసి నవ్వులు నవ్వుతూ.

'నీ భార్యను నీ ఇంటికి తీసుకురావడానిక్కూడా మీ నాన్న యిష్టమేనా?' అన్నాడు అజయ్ చురచుర చూసి.

'నీకు తెలీందేముంది విజయ్. మీ మావయ్య చండశాసనుడు .... అదిగో చూడు వాడికి గడ్డం చేయించుకోవడానిక్కూడా స్వతంత్రం లేదు' అంది సూరమ్మగారు.

'అవును బావా సగం క్షవరంలో -' అంటూ ఉత్సాహంగా ఫిర్యాదు చెయ్యబోయాడు బుజ్జి.



'సిగ్గులేదూ? ఎన్నాళ్ళిలా చవటలా బతుకుతావ్?' అన్నాడు అజయ్ చిరాగ్గా.

మరో సందర్భంలో అయితే, ఎన్నాళ్ళో చెప్పబోయేవాడేగాని, బుజ్జికి హఠాత్తుగా పౌరుషం వేసుకొచ్చింది.

'బావగారు దూకుడుగా మాటాడుతున్నారు - ఎన్నడూలేంది - పిల్లనిచ్చినవాళ్ళు -' అన్నాడు గుడ్లు తిప్పుతూ.

'పిల్లనిస్తే, మీరేం చేసినా భరించి చూస్తూ ఊరుకోమనా. పెళ్ళయి నాలుగేళ్ళయిందే - ఇప్పటికి మీనా మీ గడపతొక్కిందీ?' అంటూ ఎదిరించాడు అజయ్.

'నిజమే విజయ్ మాకు మాత్రం కోడలు నట్టింట్లో కళకళలాడుతూ తిరగాలని లేదూ. అయినా, ఆ నగలు ఏదో -'

'అవును మీకు కోడలుకన్న నగలు ముఖ్యం.'

'- అని మేము అనటంలేదు బావా. మా నాన్న -'

అజయ్ చుర్రుమన్నాడు చిరాకుతో.

'ప్రతిదానికీ నాన్న ...నాన్న సిగ్గులేదూ అలా మాట్లాడ్డానికి? మీనా మెడలో పుస్తెకట్టింది నువ్వు. మీనాను ఇక్కడకు తీసుకురావలసిన బాధ్యత నీది. ఇదిగో ఆఖరుమాట చెబుతున్నా. వారం రోజుల్లో, మీనాను తీసుకువచ్చావా, సరి - లేకపోతే -'



'లేకపోతే-?' అన్నాడు బుజ్జి. కేవలం కుతూహలంతో.

'నా తడాఖా చూపిస్తా' అంటూ పిడికిలి బిగించి, తడాఖా ప్రదర్శించాడు అజయ్.

ఆ రౌద్రం చూచి తల్లీకొడుకూ విస్తుపోయారు మాట తోచక.

'ఏం మాట్లాడరేం?' అని గద్దించాడు అజయ్.

'ఏం మాటాడ్డం?' అన్నాడు బుజ్జి, మూడోసారి చమత్కారం ప్రయోగిస్తూ.



'వారం రోజుల్లోగా తీసుకు రాకపోయారా - జాగ్రత్త' అంటూ హెచ్చరించి, గుమ్మంలోంచే వెనుదిరిగి వెళ్లిపోయాడు అజయ్.

బుజ్జి కొయ్యబారిపోయాడు - బావ వెళ్లినవేపే చూపుమేరా చూసి వెనుదిరిగాడు.

'అదేమిటే అమ్మా! నాన్నలాగ పెద్దమీసమేనా పెంచలేదూ - బావకి ఇంత కోపం పెరిగిందేమిటే?' అన్నాడు విజ్ఞాన సముపార్జన కోసం.

'వాళ్ళ క్షోభ వాళ్లది' అంది తల్లి. కొడుకు మరీ ఇంత మెత్తని వాడైపోవడం, ఆవిడకీ అట్టే నచ్చలేదు.



'ఇన్నాళ్ళూ ఇలా పిల్లిలావచ్చి పిల్లిలా వెళ్ళేవాడు. ఈవేళ రావటం పులే; పోవటం పులే' అన్నాడు బుజ్జి పిల్లికీ పులికీ వరుస ప్రకారం అభినయం పడుతూ.

తల్లి నిట్టూర్చింది. 'వాళ్ళు మాత్రం ఎంతకాలం ఓపికపడతార్రా బుజ్జీ, చూశారు చూశారు వాళ్ళకీ విసుగు పుట్టింది.'



'మీనా పూసెత్తితే నాన్న తన్నుతాడు; ఊరుకుంటే బావ తన్నుతాడు, ఎట్టా చచ్చేది?' అన్నాడు బుజ్జి, దెబ్బ తగలకుండా నెత్తి కొట్టుకుంటూ.



'ఏమిట్రా నాయనా ఆ మాటలు. ఒక్కగానొక్కడివి. వరప్రసాదివి - నే చెప్పినట్టు విను' అంటూ, వరప్రసాదిని దగ్గరకు తీసుకుని తారకమంత్రం ఉపదేశించింది. అప్పటికప్పుడు ఆలోచించి ఖాయపరచుకున్న మార్గం అది. దమ్మిడీ అంత ఉండే బుజ్జి తాలుకు బుజ్జి మొహం, విచ్చురూపాయంతయింది దీపం వేసినట్టు వెలిగింది.



'భలే భలే! నువ్వెంత మంచిదానవే అమ్మా. భలే ఉపాయం భలే ఉపాయం' అంటూ, ఆనందంతో -గజ్జెలు తక్కువగా బాలకృష్ణమ్మలా చిందులు తొక్కాడు. హఠాత్తుగా ఆ నర్తనం ఆగిపోయింది. అందుక్కారణం గజ్జెలు లేకపోవడంగాదు. ఇంకేదో గుర్తొచ్చింది.

'అమ్మబాబోయ్! నాన్నకి తెలిస్తే ఇంకేమన్నా ఉందా! చంపెయ్యడూ?' అన్నాడు.

'ఆయనకి తెలియనిస్తానుట్రా వెర్రినాగమ్మా' అంది తల్లి వీపుతట్టి.

'మా అమ్మ బుజ్జి అమ్మ' అంటూ మళ్ళీ చిందులు తొక్కాడు బుజ్జి.

* * *

భజనమందిరానికి బయల్దేరు తున్న భక్త రామదాసుగారు, గుమ్మటం లాటి కుర్రాడు గుమ్మంలో సైకిలు దిగి లోపలికి రాగా చూసి చెంగున గంతేసి, "ఎవరు? ఎవరా సాక్షాత్కరిస్తున్నదీ" అన్నారు తన కళ్ళను తానే నమ్మలేనట్లు. ఆ రామచంద్రుడేనా, అడపా తడపా కల్లో కనబడని వాడొకడే... వాడికీనాడు, అమ్మ అనుగ్రహం వల్ల, ధైర్యం, సాహసం అబ్బి, సైకిలేసుకొని, ధైర్యంగా నాన్నకి చెప్పకుండా అత్తారూరొచ్చేశాడు. సామాన్యమా?



"నేను మావయ్యా. నేనూ బుజ్జిని" అన్నాడు భుజంగరావు-సిగ్గుపడి ముడేసుకుపోయి.

"బుజ్జే! మా అల్లుడు బుజ్జే, ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకూ! రామా! రక్షకా! ఈనాటికి నా పూజ ఫలించిందా తండ్రీ! ధన్యోస్మి, ధన్యోస్మి" అంటూ పైనున్న వాడికి వందనం చేసి, నీరింకిన కళ్లలో ఇన్నాళ్లకిన్నేళ్ళకు ఊరిన రెండు బాష్పబిందువులను ఆప్యాయంగా అపురూపంగా వత్తుకున్నాడు ముసలాయన.



"మీనా ఎక్కడ మావయ్యా" అన్నాడు బుజ్జి-కొళాయికో, కోవెలకో వెళ్ళిందంటే, ఇట్నించిలాగే అటు పరిగెడదామని.

"ఉందినాయనా; అశోకవృక్షం క్రింద సీతమ్మవారిలా ఉంది."

"ఇంకెందుకు మావయ్యా. వచ్చేశాగా. పుష్పకవిమానం మీద తీసుకుపోతాను'' అన్నాడు అల్లుడు.

''ఆహా, ఎంత తియ్యటి మాట! రాకరాక అల్లుడు



ఇంటికొచ్చి, తెగిపోయాయనుకున్న సంబంధాలు మళ్ళీ ఈనాడు కలుస్తున్నాయి. అదే బతికుంటే-''

"ఎవరు మావయ్యా?" అన్నాడు బుజ్జి కొంచెం కంగారుపడి.

"అదే మీ అత్తయ్య. ఈ రోజు నిన్ను చూసుకుని ఎంత పండగ చేసేదో" అంటూ కళ్లు తుడుచుకుని, బుజ్జిని కళ్ళారా మళ్ళీ ఆపాదమస్తకం (అట్టేదూరం ఉండదు) చూసి ఆనందపడి లేచాడు రామదాసు గారు. "బుజ్జీ! ఎంత మారిపోయావ్. ఎప్పుడో, పెళ్ళపుడు చూశాను సన్నగా, పీలగా, వానపాములా ఉండేవాడివి. ఇప్పుడూ-''



''కండలు పెరిగి, కొండ చిలవలా గున్నానా?'' అన్నాడు బుజ్జీ కండలు చూసుకుంటూ.

ఉపమానం అట్టే నచ్చలేదు కాబోలు రామాయణ ప్రస్తావన లేనివి ఆయనకి ఆనవు "అంతా ఆ రాముల వారి దయ. రా నాయనా రా, ముందు ఆ శ్రీరామచంద్రుని దర్శనం చేసుకుని ఆశీర్వచనం పొంది మరీ ఇంట్లోకి వెళుదువుగాని'' అన్నాడు మావగారు.



''ఎందుకు మావయ్యా. రామచంద్రుడి లాంటి మిమ్మల్ని చూచానుగా!''

"అపచారం అపచారం నేను ఉత్త రాంభజన రామదాసుని. అయోధ్య రాముడు అక్కడున్నాడు. రా-'' అంటూ బుజ్జిని బుజ్జగించి మంటపంలోకి లాక్కుపోయాడు రామదాసుగారు.

భజన జోరుగా సాగిపోతోంది.



"రాతినే ఇల నాతిగమార్చి
కోతికే పలు నీతులు నేర్పి
మహిమలెన్నో చూపిన దేవ
మముబ్రోవ రావేలా"

అంటున్నారు భక్తులు

మావగారు తనకేసి చూసినపుడు భక్తితో గట్టిగా తలాడించి పాట మూడో కాలంలోకి వెళ్ళి అంతా తన్మయానందంలో పాడేస్తున్న వేళ, చల్లగా వెనక్కి జరిగి, అరుగు దిగి, ఇంటికి పరుగెత్తాడు బుజ్జి.



ఇల్లు ప్రశాంతంగా ఉంది. బుజ్జి, సావిట్లో పడేసిన సంచిలోంచి మిఠాయి పొట్లం, పువ్వులు తీసుకుని నట్టింట్లోకి వెళ్ళాడు. అలికిడి లేదు "మీనా! మీనా!" అంటూ నోరారా పిలుస్తూ, వంటింటి వేపు వెళ్లాడు.

అపుడే ఇవతలికి వస్తున్న మీనా, భర్తను చూసి గతుక్కుమని, తేరుకుని సిగ్గుపడి వసారాలో స్థంభం చాటుకి వెళ్ళి తలవంచుకు నిలబడింది.

బుజ్జి ఆమె దగ్గరకు వెళ్ళాడు.

"మీనా! ఇలా చూడు. నేను నీ బుజ్జిని, వచ్చేశాగా. చూడు మీనా" అంటూ బుజ్జగించి గడ్డం క్రింద మునివేలు పెట్టి మృదువుగా ఆమె ముఖం తనవేపు తిప్పుకున్నాడు.



కలువ రేకులవంటి కనులలో మంచి ముత్యాలలా మెరిసిన బాష్ప బిందువులు, చీకటిలాటి, వియోగం లాటి, విషాదం లాటి కాటుక మీదుగా దిగుతూ నీలాలై మెరిసి, సిగ్గుతో ఎరుపెక్కిన చెంపల మీదుగా దిగుతూ కెంపులై వెలిగి దిగి భర్త పాదాలను అర్చించాయి.

బుజ్జిది పసిమనసు. తన బాధే తనకు సరిగ్గా బోధపడదు; ఇతరులది సరేసరి.

మీనా, దుఃఖం కట్టలు తెంచుకుంది.

బుజ్జి బెంబేలెత్తిపోయాడు.



"ఎందుకు మీనా... ఇన్నేళ్లు నేను రాలేదనేనా ఏడుస్తున్నావ్? చెప్పు'' అన్నాడు దీనంగా.

మీనా హృదయోద్వేగం భాషలో ఇమిడేది కాదు. అయినా బుజ్జి తల్లడిల్లిపోతుంటే చూడలేక పోయింది.

"కాదు... ఈ నాటికైనా మీకు దయగలిగిందని-ఆనందం" అంది అతి ప్రయత్నం మీద నెమ్మదిగా.



''ఆనందమా. అవును, ఆనందమే. నాకూ కన్నీళ్లు వస్తున్నాయి. ఇంద మిఠాయి. తిను ఊఁ'' అంటూ కళ్లు తుడుచుకున్నాడు.

"మీరు?'' అంటూ మీనా మిఠాయి అందుకొని అతని నోటికి అందించింది. **(ఇంకా వుంది)**

# అన్ని రకాల అహంభావాలను, స్వభావాలను సహజంగా పండించగల ఏకైక నటి

# సూర్యకాంతం



**సూర్యకాంతం చనిపోయి ఎనిమిది ఏళ్లు కావస్తున్నా ఎవరూ ఆమెను మరచిపోలేదు. రోజూ తలచుకుంటూనే ఉన్నారు. "ఈ పాత్ర సూర్యకాంతం అయితే ఎంత బాగా చేసి ఉండేదో!" అని చెప్పుకునే ప్రేక్షకులు ఇప్పటికీ కన్పిస్తూనే ఉంటారు మనకు. సూర్యకాంతం అంతపేరు తెచ్చుకోవడానికి, ఆమె చనిపోయినా మనం ఈనాటికీ ఆమెను మరచిపోకుండా వుండడానికి గల కారణం ఏమిటి?**

-అంటూ అపరభద్రకాళిలా కోడలుపై విరుచుకుపడే అత్తగా-**(సతీ సక్కుబాయి)**

అంటూ క్షణాల్లో భర్తను వెర్రి వాజమ్మను చేసే భార్యగా **(కులగోత్రాలు)**

అంటూ దోచుకొని వచ్చే ఆడపడుచుగా **(పెంకి పెళ్ళాం)**

**(తోడి కోడళ్ళు)**

అంటూ చాప కింద నీరులా సాటి కోడలికి చాడీలు చెప్పి, వ్యవహారం నిగ్గు తేలేటప్పుడు తప్పించుకునే చుప్పనాతిలా - యిలా సైకాలజీ ప్రకారం లక్షణాలను బట్టి స్త్రీలను ఎన్ని రకాలుగా విభజించవచ్చో అన్ని విధాల హావభావాలనూ ప్రదర్శించిన ఏకైక నటి ఆమె.

"కన్యాశుల్కం"లో గురజాడ అప్పారావు సృష్టించిన "మీనాక్షి" పాత్ర సూర్యకాంతం కోసమే అనిపిస్తుంది.

అనడంలోని వ్యంగ్యార్థం కాని,

అంటూ స్త్రీ గుణాన్ని వివరించి చెప్పడంలోని పాత్రోచిత స్వానుభవాన్ని కానీ సూర్యకాంతం తప్ప మరెవరు చెప్పగలరు. అందుకే ఈమెను హెచ్.ఎం.రెడ్డి గారు ."**Uncomparable Dynamic Star**" అనేవారు.

ఓర చూపులు చూస్తూ, ఎడం చెయ్యి విరుస్తూ, కుడిచెయ్యి నడుం మీద నిలబెట్టి ఆమె చెప్పిన సంభాషణా చాతుర్యం! గయ్యాళిగా, ముచ్చులా, పరమశాంతమూర్తిగా, తపస్వినిలా, ముద్దరాలుగా... ఎలా కావాలంటే అలా ఆ రచయితలు సృష్టించిన పాత్రలను తాను ధరించి వాటిని సజీవ శిల్పాలుగా చేసిన ఘనత సూర్యకాంతమ్మదే.

తూర్పుగోదావరి జిల్లా కాకినాడలో మంచి స్థితిమంతులైన బ్రాహ్మణ కుటుంబంలో వెంకటరత్నమ్మ పొన్నాడ అనంతరామయ్య దంపతులకు పద్నాలుగవ సంతానంగా జన్మించింది సూర్యకాంతం 'కళల మీద ఆసక్తితో చిన్నప్పుడే నృత్యం కూడా నేర్చుకుంది. ఆ రోజుల్లో రెండణాలు ఇస్తే రెండు సినిమాలు చూపించేవారు. లీలా చిట్నీస్, అశోక్ కుమార్ నటించిన ఖజాంచి, బంధన్ వంటి హిందీ సినిమాలు చూసేది. తను కూడా వాళ్ళలాగానే హిందీ చిత్రాల్లో నటించాలనే ఆసక్తితో కాకినాడలో మెక్‌లారెన్స్ హైస్కూలులో మెట్రిక్యులేషన్‌తో చదువు మానేసి మద్రాసుకు వచ్చింది. అలా మద్రాసు వచ్చిన కొత్తలో నెలకు 75 రూపాయలు జీతంతో జెమినీ స్టూడియోలో ఆర్టిస్టుగా ప్రవేశించిందామె. అనంతరం ప్లేబాక్ సింగర్ పి.లీలతో పరిచయం కలగడంతో ఆమెతో కలిసి 'స్టార్ కంబైన్స్' ఆఫీసుకు వెళితే అక్కడ దర్శకుడు పి.పుల్లయ్య, రచయిత తాపీ ధర్మారావు గారు కలిశారు. వారు ఆమెను సినిమాలలో నటిస్తావా? అంటే... 'లేదు, హిందీ సినిమాలలో మాత్రమే నటిస్తాన'ని నిష్కర్షగా చెప్పింది సూర్యకాంతం. అయితే ఏదో ఒక విధంగా పి.పుల్లయ్య ఆమెను ఒప్పించి 'నారదనారది' అనే చిత్రంలో నటింపచేశారు. రెండో చిత్రం స్వస్తిక్ వారి 'ధర్మాంగద' (1949). అందులో ఈమెది మూగ, కుంటి వేషం. కుంటిదానిగా ఈమె నటించినప్పుడు కాలు మడిచి కట్టకుండానే ఎంతో సహజంగా చేసింది. ఈమె నటనను చూసి తాపీ ధర్మారావు గారు "నీలో ఎంత టాలెంట్ వుందమ్మా!" అని ప్రశంసించారు.

"ధర్మాంగద' చిత్రంలో సైగలు చేస్తూ నటించడంతో ఆరంభమైన సూర్యకాంతం సినిమా జీవితం, తర్వాత తర్వాత కోటి ప్రభలతో ప్రకాశించింది. "ధర్మాంగద" చిత్రం తర్వాత 'గృహ ప్రవేశం' వంటి చిత్రాల్లో చిన్నా, చితకా వేషాలు వేసినా సాధనా వారి 'సంసారం' (1950)తో ఆమె నట జీవితం మలుపు తిరిగింది. సూర్యకాంతం గజాననా వారి కోడరికం(1953) లాంటి సినిమాల

నుండి అత్త పాత్రలు వేయడం ప్రారంభించింది. 'కోడరికం' చిత్రం తర్వాత 'గయ్యాళి అత్త' పాత్రలకి సూర్యకాంతం పెట్టిన పేరయిపోయింది. నిజ జీవితాల్లో ఏ అత్తగారైనా కోడల్ని రాచి రంపాన పెడుతుంటే-''అమ్మో ఆవిడా''

**'సంసారం' చిత్రంలో ఇరవై అయిదేళ్ళ వయసులోనే అరవై ఏళ్ళ 'శేషమ్మ'గా నటించిన సూర్యకాంతంకు ఎంతోపేరు వచ్చింది. ఆ చిత్రంలోనే "నేను విదేశాలన్నీ తిరిగొచ్చినదాన్ని" అని గొప్పలు పోయే ఓ పాత్రను "నువ్వేమిటి? ముక్కాని పోస్టుకార్డు వెళ్తుంది" అని సూర్యకాంతం చెప్పిన డైలాగుని ఆనాటి ప్రేక్షకులు పదే పదే చెప్పుకునేవారు.**



సూర్యకాంతమే! "అని అందరూ చెప్పుకునే స్థాయికి ఎదిగింది. సినిమా షూటింగులకు, ఏదైనా ఫంక్షన్లకు సూర్య కాంతం వెళ్ళి నపుడు ఆటో గ్రాపుల కోసం వచ్చే ప్రజలు ఈమె దగ్గరికి వెళ్ళడానికి భయ పడేవారు. ఇదే విషయాన్ని ఒకసారి సుత్తివేలు "మనం మన పిల్లలకి రాక్షసుల పేర్లు పెట్టం. అలాగే... మీ పేరు పెట్ట డానికి కూడా భయ పడతారు. ఎందువల్ల నమ్మా!" అని సూర్య కాంతాన్ని అడి గాడట. అందుకామె "ఏం చేస్తాం! నేనంటే అంద రికీ అలాంటి భయ భక్తులు న్నందుకు సంతోషమే'' అని చమత్కరించారట.

సంవత్సరానికి నాలు గైదు పిక్చర్లు రిలీజయ్యే కాలంలోనే దాదాపు 750 చిత్రాల్లో నటించిన ఘనత సూర్యకాంతానికి దక్కుతుంది.

రత్నమాల (1948), లైలా మజ్ను (1949), చక్రపాణి(1954), పెళ్ళిచేసి చూడు (1952), చంద్ర హారం(1954), దొంగరాముడు(1955), చిరంజీవులు(1956), కన్యాశుల్కం(1955), భాగ్యరేఖ(1957), మాయాబజార్(1957), మాంగల్య బలం (1959), అత్తా ఒకింటి కోడలే (1958), గుండమ్మ కథ (1962), దాగుడు మూతలు (1964), మూగ మనసులు (1964) ఇలా ఓ పెద్ద దండకమంత అవు తాయి ఆ సినిమాల పేర్లు.

తెలుగులోనే కాక మరుమగళ్, కుడుంబమ్, ఏళై యిన్ఆస్తి (హెచ్.ఎం.రెడ్డి గారిది) వంటి 49 తమిళ చిత్రాల్లోనూ 'బహుత్‌దిన్ హుయే', 'దోదుల్హే', 'బాలనాగమ్మ' వంటి హిందీ చిత్రాల్లోనూ నటించింది.

తెరపై సూర్యకాంతం గయ్యాళిగంపలా కనపడినా, ఆమె మాటలు కటువుగా వినపడినా -నిజ జీవితంలో ఆమె అతి సౌమ్యురాలు. అందుకే ఆరుద్ర గారు అనే "మాట మామిడల్లం - మనసు పటిక బెల్లం'' అనిపించే వ్యక్తులకు ఉత్తమ ఉదాహరణ నటి సూర్య కాంతం. ఓసారి విజయవాడ వెళ్లినప్పుడు పొరుగింట్లో ఇద్దరు ఆడ వాళ్లు పోట్లాడుకుంటూ "సూర్యకాం తంలా ఏమిటే అలా నోరు పారేసుకుంటున్నావ్'' అనుకోవడం విని, తాను పోషించిన పాత్రల ప్రభావానికి మనస్సులో పొంగిపోయినా "వ్యక్తిగా నేను అలాంటి గయ్యాళి దాన్ని కానే" అని బాధపడిన వ్యక్తి సూర్యకాంతం, సూర్యకాంతం సెట్ మీద వుంది అంటే ఆ సెట్ అంతా సందడిగా ఉండేది. షూటింగ్‌ల్లో జోకులు చెప్పడం, అందర్నీ సరదాగా నవ్వించడం ఆమెకు హాబీ, అదే విధంగా ఆమెకు కారు డ్రైవింగ్ చేయడమంటే మహా సరదా. "జీవితంలో ఈ రోజే మనది, రేపు ఏమౌతుందో మనం చెప్పలేం" అనే తత్వం గల సూర్యకాంతం శుభ్రంగా కడుపు నిండా తినేది, పది మందికి పెట్టేది. షూటింగ్‌కు

వచ్చినప్పు డల్లా-తనతో ఏవేవో తినుబండారాలు తీసుకు రావడం, అందరికీ పెట్టి, వారితో కలిసి భోంచేయ డం ఈమెకు అలవాటు. ముఖ్యంగా పులిహోర చెయ్యడంలో యీమెది అందెవేసిన చెయ్యి. ఇలాంటి అలవాటు సావిత్రి, షావుకారు జానకి వంటి కొద్దిమంది నటీమణులకే ఉండేది. అవసరమైన వాళ్లకి ఆర్థిక సహాయం చేసేదే గానీ, అనవసరం అనిపిస్తే మాత్రం 'అణా' కూడా విదిల్చేది కాదు. మొహమాట పడకుండా తనకు రావాల్సిన పారితోషికాన్ని నిర్మా తల్ని గట్టిగా దబాయించి అడిగేది.



సూర్యకాంతం మంచి నటి మాత్రమే కాదు. గొప్ప సంఘ సేవకురాలు కూడా. ఆంధ్రప్రదేశ్ రంగస్థల కళాకారుల సంఘానికి ప్రతి సంవత్సరం తనవంతు సహాయాన్ని అందించేది. అనేక విద్యా సంస్థలకు, వికలాంగ కేంద్రాలకు, గ్రంథాలయా లకు తనవంతు సహాయం చేసేది. ముఖ్యంగా దివిసీమ తుఫాను వల్ల ధ్వంసమైనప్పుడు ఇరవై ఏడు రోజులు రాష్ట్రమంతటా తోటి నటీనటు లతో పర్యటించి విరాళాలు సేకరించి రామకృష్ణ మిషన్ ద్వారా బాధితులకు అందజేసింది. అంతేగాకుండా ఉచిత నాటక ప్రదర్శనల ద్వారా ప్రజలకు సమయోచితంగా సహాయపడింది కూడా. అయితే సంఘసేవ పేరుతో పాపులారిటీని పెంచుకోజూసే వారిని చూసి అసహ్యించుకునేది. "మానవసేవే మాధవసేవ" దీనికి ఇంత ఆడంబరం అక్కర లేదని ఖండించేది. ఇక ఆమె వ్యక్తిగతంగా చేసిన గుప్త దానాలకు లెక్కలేదు. సినిమా మోజుతో పల్లె టూళ్ల నుంచి మద్రాసు వచ్చిన ఎంతోమందిని ఈమె ఆదుకునేదని పరిశ్రమలో చెప్పుకునేవారు.

చలనచిత్ర రంగంలో ఈమె చేసిన విశిష్ట సేవలకు గుర్తింపుగా సహజ నట కళాశిరోమణి, హాస్య నట శిరోమణి, బహుముఖ నటనా ప్రవీణ, రంగస్థల శిరోమణి, అరుంగ లైమామణి వంటి బిరుదులు ఎన్నో ఈమెను వరించాయి. అదే విధంగా మహానటి సావిత్రి స్మారక అవార్డును అందు కుందామె. తెలుగు సినీ కళా రంగానికి చేసిన సేవలను గుర్తించి శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం (తిరుపతి) జులై 27వ తేదీన (1994) 'డాక్టర్ ఆఫ్ లెటర్స్' గౌరవ పట్టాను ప్రదానం చేసింది. ఆ సందర్భంలో ఆమె "ఆరు న్నర కోట్ల మంది అభిమాన ధనంగా ఈ భారాన్ని మోస్తున్నాను. మేమెంత పెద్ద వాళ్ళమైనా మమ్మ ల్ని మనుషుల్ని చేసి నటన ద్వారా ప్రేక్షకు లకు పరిచయం చేసిన విజయా అధినేత నాగిరెడ్డి గారి కాళ్ళకు, అన్నపూర్ణ పిక్చర్స్ దుక్కిపాటి మధుసూదన రావు గారి కాళ్ళకు దణ్ణం పెట్టుకోవాలి. వారు పెట్టిన అన్నంతోటి ఈనాడు బతుకుతున్నాం, అంతేకాదు "ఆ చిత్రంలో అలా చేసింది కదా! ఈ చిత్రంలో ఇలా చేయిద్దాం" అనే రీతిలో నా పాత్రలను తీర్చిదిద్దిన రచయి తలకు" మా కాంతమ్మకి క్యారెక్టర్ ఏది అన్న నిర్మాతలకు "ఏమ్మా! తల్లీ! మరి కాస్త మిర్చి మసాలా వేసి చెయ్యి!" అన్న దర్శకులకు, తోటి కళా కారులకు, నన్ను ఇంతటి స్థాయికి తీసు కువచ్చిన ప్రేక్షకులు అందరికీ చెందుతుంది ఈ ఘనత!" అని అంది వినమ్రంగా.

డయాబెటిస్ కారణంగా 1994 డిసెంబరు 18వ తేదీన మర ణించింది సూర్య కాంతం. ఆమె భౌతిక కాయాన్ని మద్రాసు మైలాపూర్ శ్మశాన వాటికకు తీసుకెళ్ళేటప్పుడు ఆ అంత్యక్రియలకు హాజరైన వ్యక్తులు చాలా తక్కువ మంది మాత్రమే వుండడం అత్యంత విచారకరం. ఈమె నటించిన చివరి చిత్రం ఎస్.పి.పరశురాం.

పాత్రలో నటించడం వేరు, జీవించడం వేరు అంటూ వ్యవహారంలో ఉన్న వ్యాఖ్యానాలను తోసిపుచ్చి ఆ రెండూ కలిస్తేనే పాత్ర పండు తుందని సిద్ధాంతీకరించిన సహజనటి సూర్య కాంతం. ఆమె సంభాషణలు ఎటు వంటి వ్యాకరణ నియమాలు లేనట్టు గడగడ చెప్పినా, వ్యాకరణ పండితులు పేర్కొనే అన్ని సూత్రాలు ఆ డైలాగులలో స్పష్టంగా వినిపిస్తాయి. ఒక్క సీను వున్న పాత్రలోనైనా ఆమె తన నటనా విశ్వరూపాన్ని ప్రదర్శించేది. తనకు సాధ్యమైనంత వరకు తన పాత్రకు న్యాయం చేయడానికి ప్రయత్నించేది. మానసిక శాస్త్రవేత్తలు విశ్లేషించే అన్ని రకాల "ఇగో"లను సూర్య కాంతం తప్ప మరెవరూ ప్రదర్శించ లేదు.

**- కంపల్లె రవిచంద్రన్**

## 'మనస్విని' అవార్డు గురించి...

**గత పక్షం 'హాసం' సంచిక 65 వ పేజిలో ప్రచురించబడిన 'చంద్రబోస్ కు మనస్విని అవార్డు' అనే వార్తపై స్పందిస్తూ- 'మనస్విని' అవార్డు ఆత్రేయ పేరుమీద మొదలు పెట్టినది కాదని, ఆయన పోయినపుడు ఆయన పుస్తకాలను వెలువరించే సమయాన ఆ అవార్డుని ప్రారంభించడం జరిగిందని వివరిస్తూ- 'మనస్విని' పేరిట ప్రతియేటా ఒక మంచి సినీ గీతానికి అవార్డు ఇవ్వాలన్న ఆలోచన ఆత్రేయ మరణించటానికి ముందునుంచే తమకు వుందని 'మనస్విని' ట్రస్ట్ మేనేజింగ్ ట్రస్టీ శ్రీ కె. జగ్గయ్య, కన్వీనర్ శ్రీ కె. మురారి 'హాసం' కు తెలియజేశారు.**

**-ఎడిటర్**

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

# సంగమ్-'ఓ మేరే సనమ్...'

| | | |
|---|---|---|
| చిత్రం | : | సంగమ్ (1964) |
| రచన | : | శైలేంద్ర |
| సంగీతం | : | శంకర్-జైకిషన్ |
| గానం | : | లతా మంగేష్కర్, ముకేష్ |
| అభినయం | : | వైజయంతీమాల, రాజ్‌కపూర్ |



ఓ మేరే సనమ్, ఓ మేరే సనమ్
దో జిస్మ్ మగర్ ఎక్ జాన్ హైఁ హమ్
ఎక్ దిల్ కే దో అర్‌మాన్ హైఁ హమ్
ఓ మేరే సనమ్, ఓ మేరే సనమ్

ఆ: తన్ సౌంప్ దియా, మన్ సౌంప్ దియా, కుఛ్ ఔర్‌తో మేరే పాస్ నహీఁ
జో తుమ్ సే హై, మేరే హమ్‌దమ్, భగవాన్ సే భీ వో ఆస్ నహీఁ
జిస్ దిన్ సే హుయే ఎక్ దూజే కే ఇస్ దునియా సే అన్‌జాన్ హైఁ హమ్.
ఎక్ దిల్ కే దో అర్‌మాన్ హైఁ హమ్
ఓ మేరే సనమ్, ఓ మేరే సనమ్

అ: సున్‌తే హైఁ ప్యార్ కీ దునియా మేఁ దో దిల్ ముష్కిల్ సే సమాతే హైఁ
క్యా గైర్ వహాఁ అప్‌నోఁ తక్ కే సంగ్ భీ న ఆనే పాతే హైఁ
హమ్‌నే ఆఖిర్ క్యా దేఖ్‌లియా, క్యాబాత్ హై, క్యోఁ హైరాన్ హైఁ హమ్
ఎక్ దిల్ కే దో అర్‌మాన్ హైఁ హమ్
ఓ మేరే సనమ్, ఓ మేరే సనమ్

ఆ: మేరే అప్‌నే, అపనా యే మిలన్ సంగమ్ హై యే గంగా జమునా కా
జో సచ్ హై సామ్‌నే ఆయా హై జో బీత్ గయా ఎక్ సప్‌నా థా
యే ధర్‌తీ హై ఇన్సానోం కీ, కుఛ్ ఔర్ నహీఁ ఇన్సాన్ హైఁ హమ్
ఎక్ దిల్ కే దో అర్‌మాన్ హైఁ హమ్
ఓ మేరే సనమ్, ఓ మేరే సనమ్





తెలుగునాట విజయఢంకా మోగించి ఆ తరానికి చెందిన హిందీ రాని వారికి కూడా ఇప్పటికీ గుర్తున్న చిత్రం 'సంగమ్'. పూర్తిగా కలర్‌లో తీసిన ఈ చిత్రం గురించి అప్పట్లో గొప్పగా చెప్పుకునేవారు. తొలిసారిగా విదేశాలలో షూటింగ్ జరుపుకున్న భారతీయ చిత్రం కూడా ఇదే. కలర్‌లో యూరప్ అందాలను చూసి ప్రేక్షకులు పులకించిపోయారు. ఇక పాటల సంగతి సరేసరి. ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఆ పాటలు సంచలనం సృష్టించాయి. ఈ అంశాలన్నిటితో పాటు చక్కని కథాకథనాలతో ఈ చిత్రాన్ని రూపొందించి తనకు తానే సాటి అనిపించుకున్నారు నిర్మాత-దర్శకుడు రాజ్‌కపూర్.

ఈ చిత్రకథ మానవ స్వభావాలకు సంబంధించినది. ఎవరూ పరిపూర్ణులు కారని అందరిలో ఏవో లోటుపాట్లు ఉంటాయని,

తమ లోపాలు తెలిసి కూడా సరిదిద్దుకోలేకపోవటం మానవ మాత్రులకు సహజమేనని తెలిపే కథ ఇది. సుందర్(రాజ్‌కపూర్), గోపాల్ (రాజేంద్రకుమార్), రాధ (వైజయంతీమాల) చిన్ననాటి స్నేహితులు. సుందర్‌కు రాధ అంటే పిచ్చి ప్రేమ. రాధ గోపాల్‌ని ఆరాధిస్తుంది. రాధ గోపాల్‌కి తన మనసులోని మాట చెప్పే లోపలే సుందర్ గోపాల్‌కి తన ప్రేమ గురించి చెబుతాడు. స్నేహితుడి కోసం గోపాల్ రాధ ప్రేమని తిరస్కరిస్తాడు. కానీ జీవితంలో స్థిరపడని సుందర్ పెళ్ళి ప్రస్తావనని రాధ కుటుంబం నిరాకరిస్తుంది. దానితో సుందర్ తానేమిటో నిరూపించుకోవాలని సైన్యంలో చేరతాడు. కొన్నాళ్ళకు అతను యుద్ధంలో మరణించాడనే వార్త వస్తుంది. తర్వాత రాధ, గోపాల్ దగ్గరవుతారు. కొన్నాళ్ళకు సుందర్ తిరిగివస్తాడు. స్నేహితుణ్ణి మోసగించాననే భావంతో గోపాల్ వారిద్దరి మధ్య నుంచి తప్పుకుంటాడు. రాధ, సుందర్‌ల పెళ్ళి జరుగుతుంది. రాధ పూర్తిగా సుందర్‌కి అంకితమవుతుంది. వాళ్ళ జీవితం సాఫీగా సాగుతుండగా గతంలో గోపాల్ రాధ కోసం రాసిన ఓ ప్రేమగీతం సుందర్ కళ్ళబడుతుంది. అది ఎవరు రాశారో చెప్పటానికి రాధ నిరాకరిస్తుంది. సుందర్‌కు ఆమె ఇప్పుడు తననే ప్రేమిస్తుందని తెలిసినా ఇంతకుముందు వేరొకరిని ప్రేమించిందనే విషయాన్ని మరచిపోలేక మధనపడతాడు. తాను తప్పు చేస్తున్నానని తెలిసినా మనసుకు నచ్చజెప్పలేకపోతాడు. చివరికి అసలు విషయం సుందర్‌కి తెలియటంతో గోపాల్ శాశ్వతంగా వారి మధ్య నుంచి తప్పుకోవటానికి తన ప్రాణాలర్పిస్తాడు.





భారతీయ వివాహ వ్యవస్థ ఎంత దృఢమైనదో రాజ్‌కపూర్ ఈ సినిమా ద్వారా చెప్పాడు. సుందర్‌ను ఎంత ఏవగించుకున్నా, వివాహం చేసుకున్నాక రాధ అతనికే అంకితమయిపోతుంది. ఈ విషయం విదేశీయులకు మింగుడు పడలేదు. అందుకే 'సంగమ్' ఫారిన్లో పెద్దగా ఆడలేదు.

తన భావాలను ఇతరులకు చెప్పినంత తేలికగా వారి మనసులను అర్థం చేసుకోలేని సుందర్ పాత్రలో రాజ్‌కపూర్ ఎంతో సహజంగా నటించారు. గోపాల్ పాత్రకు ముందు దిలీప్‌కుమార్‌ని అనుకున్నా చివరికి రాజేంద్రకుమార్ నటించారు. 1964లో ఆయన నటించిన 'జిందగీ', ఆయీ మిలన్ కీ బేలా'లతో పాటు ఈ చిత్రం కూడా విజయవంతమయి ఆయనకు  జూబిలీ కుమార్ అనే పేరు తెచ్చిపెట్టాయి. ఇక రాధ పాత్ర విషయానికొస్తే  కమర్షియల్ చిత్రాలలో ఇంత రేంజ్ ఉన్న పాత్రలు అరుదుగా ఉంటాయి.  నవరసాలు గల ఈ పాత్రను వైజయంతీమాల అద్భుతంగా పోషించారు.



ఆర్.కె.సంస్థకి రెగ్యులర్ అయిన శంకర్-జైకిషన్, హస్రత్ జైపురి, శైలేంద్రల టీమ్ అందించిన పాటలు పాత్రల భావాలను, స్వభావాలను ఎంతో ప్రభావవంతంగా ఆవిష్కరించాయి. 'హర్ దిల్ జో ప్యార్ కరేగా', యే మేరా ప్రేమ్‌పత్ర్ పఢ్‌కర్', 'దోస్త్ దోస్త్ నా రహా', 'ఓ మేరే సనమ్' పాటలు ఆయా సందర్భాలలో మాటల్లో చెప్పలేని భావాలను చెబుతాయి. రాజ్‌కపూర్ తొలి కలర్ చిత్రమైన ఈ చిత్రంలో పాటల చిత్రీకరణలో కొత్త ప్రయోగాలు చేసి అదనపు అందాలను అందించారు. ముఖ్యంగా 'దోస్త్‌దోస్త్ నా రహా' పాటలో సూపర్ ఇంపొజిషన్ టెక్నిక్ ఉపయోగించి అద్భుతమైన ఫలితాలు సాధించారు.

గోపాల్ రాధకు రాసిన ప్రేమలేఖ సుందర్‌కు దొరికిన తర్వాతే వచ్చే గీతం 'ఓ మేరే సనమ్'. వారు ఒక పార్టీకి వెళ్ళేముందు అతనికి ఆ ప్రేమలేఖ దొరుకుతుంది. రాధ ఆ లేఖని చింపి పడేసినా సుందర్ ఆ ముక్కలను ఏరుకోవటం అతను ఎంత దిగజారిపోయాడో తెలియజేస్తుంది. పార్టీలో  వారు పాడే ఈ పాటలో అతనే తన సర్వస్వమని ఆమె, అది తెలిసినా తను గతాన్ని మరచిపోతున్నానని అతను తమ భావాలను చెప్తారు.



'సనమ్' అంటే ప్రియుడు లేదా ప్రియురాలు. 'జిస్మ్' అంటే దేహం. 'జాన్' అంటే ప్రాణం. 'అర్‌మాన్' అంటే ఆశ.

'ఓ నా ప్రియా! ఓ నా ప్రియా!
దేహాలు వేరైనా ఒకే ప్రాణం మనం
ఒకే హృదయపు రెండు ఆశలం మనం
ఓ నా ప్రియా! ఓ నా ప్రియా!'

వారిద్దరిదీ ఒకే ప్రాణమన్నంతగా వారి జీవితాలు పెనవేసుకుపోతుంటాయి. ఈ

విషయం ఇద్దరికీ తెలుసు.

'తన్' అంటే తనువు. 'మన్' అంటే మనసు. 'ఆస్' అంటే ఆశ. 'దునియా సే అన్‌జాన్' అంటే 'లోకాన్ని మరచిపోవటం'.

'తనువర్పించాను, మనసర్పించాను, ఇంకేమీ నా వద్ద లేదు
నీ మీద పెట్టుకున్న ఆశ దేవుడిపై కూడా పెట్టుకోలేదు
ఏనాటి నుంచి ఒకటయ్యామో ఈ ప్రపంచాన్నే మరచాం మనం'.

అతనికే తన సర్వస్వం అర్పించానని, అతనే తన దైవమని అంటోందామె. ప్రపంచమంతా మరచి జీవించారు వారు. పెళ్లికి ముందు మాట ఏమైనా వివాహం తర్వాత అతను తప్ప తన జీవితంలో వేరెవరూ లేరని ఆమె భావం.

ఆమె అలా బాధపడుతుంటే అతని బాధ అతను చెప్పుకుంటున్నాడు-'ముష్కిల్' అంటే కష్టం. 'గైర్' అంటే ఇతరులు. 'అప్‌నే' అంటే తనవాళ్ళు. 'హైరాన్' అంటే కలవరం, కంగారు ('హైరానా' అని తెలుగువాళ్ళు కూడా అంటారు).

'ప్రేమలోకంలో రెండు హృదయాలకు మాత్రమే చోటుంటుందట
అయితే పరులక్కడికి తమవారితో కూడా రాకూడదా?
నేను అసలేం చూశానని? ఎందుకు నాలో ఈ మథనం?'

ప్రేమలో రెండు మనసులు పూర్తిగా కలవటమే కష్టమంటారు. అయితే వారి ప్రపంచంలోకి వారికి కావలసిన వేరే వాళ్ళు రాకూడదా?' అని సుందర్ తనని తాను ప్రశ్నించుకుంటున్నాడు. తాను అసూయపడే అవసరం లేదని అతనికి తెలుసు. అయినా కలవరపడుతున్నాడు. ఎందుకు కలవరపడుతున్నాడో అతనికే తెలియదు. భర్త బాధ తెలిసి సర్దిచెప్పాలని చూస్తోంది ఆమె.

'మిలన్ అంటే కలయిక. 'సంగమ్' అంటే సంగమం. 'సచ్' అంటే సత్యం. 'బీత్ గయా' అంటే గడచిపోయింది. 'సప్‌నా' అంటే స్వప్నం. 'ధర్‌తీ' అంటే భూమి. 'ఇన్సాన్' అంటే మనిషి.

'మన కలయిక గంగా యమునల సంగమం
ముందున్నదే నిజం, గడచిందొక స్వప్నం
మానవమాత్రుల లోకమిది, మానవ మాత్రులమే మనం'

తమ కలయిక పవిత్రమైనదని, తమ ప్రేమ నిజమని, గడచినదంతా ఒక కల అని అతనికి నచ్చజెప్పటానికి ప్రయత్నిస్తోంది ఆమె. తామూ మామూలు మనుషులమేనని, అందరిలాగే తమలోనూ లోపాలున్నాయని, వాటిని అంగీకరించాలని ఆమె ఉద్దేశ్యం. 'యే ధర్‌తీ హై ఇన్సానోం కీ, కుఛ్ ఔర్ నహీఁ ఇన్సాన్ హైఁ హమ్' అనే లైన్లు శైలేంద్ర కవితా ప్రతిభను తెలపటానికి ఉదహరిస్తూ వుంటారు.

- పి.వి.సత్యనారాయణ రాజు

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలు

## 1947

భారతావనికి స్వాతంత్ర్యం సిద్ధించిన వేళలోనే హిందీ సినీ సంగీతం ఓ సంగీత సామ్రాజ్ఞిని సంపాదించుకుంది. 'పా లగూ కర్ జోరి రే' మరో రెండూ సోలో గీతాలను దత్తావ్‌జేకర్ చిత్రం "ఆప్ కి సేవా మేఁ" సినిమాకై లతా మంగేష్కర్ గానం చేసింది.


లతా మంగేష్కర్

కుందన్‌లాల్ సైగల్ అంతిమశ్వాస వదిలారు. "పర్‌వానా" ఆయన చివరి చిత్రం.


సైగల్

సంభాషణలలోనూ, గీతాలలోనూ అందరికీ అర్థమయ్యే భాషలో రాసిన రాజేంద్రకిషన్ హిందీ తెరకు పరిచయం - 'జనతా' 'జంజీర్'ల ద్వారా! అతి విస్తారంగా రాసిన రాజేంద్రకిషన్ చివరి చిత్రం -1995 లో విడుదలయిన "ఆగ్ కా దర్‌యా".

"దో భాయ్" గీతా రాయ్‌ను (తర్వాత గీతాదత్ అయింది) నటిగా నిలబెట్టింది. ఎస్.డి.బర్మన్ సంగీతంలో రూపుదిద్దుకున్న "మేరా సుందర్ సప్నా బీత్‌గయా...." పాట ప్రేక్షకాదరణ పొందింది. 'దిల్ కి రాణి' చిత్రంలోని 'ఓ దునియా కే రహనేవాలే బతా' పాట పాడించి రాజ్‌కపూర్‌ను సింగర్‌గా పరిచయం చేసారు బర్మన్.


రాజ్‌కపూర్

మౌల్వీ కుమారుడయిన షకీల్ బదయూని 'దర్ద్' చిత్రం ద్వారా గీత రచయితగా పరిచయం.


షకీల్ బదయూని

ఉమాదేవి (నటి అయిన తర్వాత టున్‌టున్‌గా పేరు మార్చుకుంది.) గాయనిగా పరిచయం కాబడింది. 'అఫ్‌సానా లిఖ్ రహీ హూఁ..' పాట ద్వారా. వీరిద్దరినీ పరిచయం చేసినది నౌషద్. నౌషద్ స్వరపరిచిన 'ఎలాన్', 'దర్ద్', ఫిరోజ్ నిజామీల 'జుగ్ను'లు మ్యూజికల్‌గా సూపర్‌హిట్ అయ్యాయి.


టున్‌టున్

అయితే పాశ్చాత్య సంగీతాన్ని ( బెన్నీ గుడ్‌మన్ ఇన్‌స్పిరేషన్) ఉపయోగించి 'షెహనాయ్' చిత్రానికై సి.రామచంద్ర చేసిన 'ఆనా మేరీ జాన్ సండే కే సండే' (మీనా కపూర్‌తో కలిసి పాడినది) పాట అత్యంత ప్రజాదరణ పొందింది. పాటలో విజిల్ ఉపయోగించడం కూడా దానితోనే ప్రారంభం.


సి.రామచంద్ర

రేడియో గోవా( అప్పుడు గోవా పోర్చుగీస్ పాలనలో ఉండేది) హిందీ పాటలను ప్రసారం చేయడం ప్రారంభించింది. అదీ బి.బి.సి. (ఇండియా) కు పోటీగా.

## 1948

ఆశాభోంస్లే 'సావన్ ఆయా సావన్ ఆయా' పాట ద్వారా సినీరంగ ప్రవేశం. గీతారాయ్, జోహర్‌బాయిలు సహగాయనీమణులు. హన్స్‌రాజ్‌బెల్ సంగీతం.


ఆశాభోంస్లే

'జిద్దీ' చిత్రం ద్వారా కిశోర్‌కుమార్ ఖేమ్‌చంద్ ప్రకాష్ స్వరరచనలో (మర్నే కీ దువాయేఁ క్యూం మాంగూ) ప్లేబ్యాక్ సింగర్‌గా పరిచయం. ఈ చిత్రంలో కిశోర్ చిన్నవేషంలో నటించాడు.

జిద్దీతో ప్రారంభమైన కిశోర్ -దేవానంద్‌ల అనుబంధం సచ్చే కా భోల్ బలా(1989) వరకూ అవిచ్ఛిన్నంగా కొనసాగింది. అంతే కాదు ఈ చిత్రంలోనే మొట్టమొదటిసారిగా కిశోర్ -లతాలు డ్యూయెట్ 'యే కౌన్ ఆయా రే ' ద్వారా పాడటం జరిగింది.


కిశోర్ -లతా

# సిండరెల్లా కథ లాటి

# నోరా జోన్స్ కథ



- ఆమె తండ్రి ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సితార్ వాద్యగాడు
- ఆమె తల్లి, తండ్రి కలిసివున్నది ఒక ఏడాది మాత్రమే!
- తండ్రి ఆమెను ఎప్పుడూ పట్టించుకోలేదు.
- ఇంకో భార్యద్వారా పుట్టిన కూతురి కెరియర్ మీదనే ఆయన దృష్టి!
- అయినా నోరా జోన్స్ స్వయంకృషితో పైకి రావడానికి ఇవి అవరోధాలు కాలేదు.

అవును, నోరా జోన్స్ తల్లి స్యూ జోన్స్ ఒక నర్స్. సంగీతాభిమాని. రవిశంకర్ అమెరికా లోని డల్లాస్‌కి 1978 లో ఒక కచేరీ ఇవ్వడానికి వచ్చినపుడు ఆయనను, ఆయన ప్రతిభను చూసి ముగ్ధురాలయింది. 57 సంవత్సరాల రవిశంకర్ ఆమెను పెళ్లాడలేదు. వారిద్దరి ప్రేమకలాపం వల్ల 1979 మార్చి 30 న నోరా పుట్టింది. ఆ తరువాత అతి త్వరలో ఆ జంట విడిపోయింది.

ఆ తరువాత రవిశంకర్‌కు సుకన్య ద్వారా అనౌష్కా (హాసం 4 వ సంచిక చూడండి) పుట్టింది. ఆమెకు రవిశంకర్ దగ్గరుండి సితార్ నేర్పించారు. ఆమె మేటిగాయనిగా రూపొందింది. ఆమె కంటె రెండేళ్లు పెద్దదైన నోరా జీవితం మాత్రం పూలపాన్పులా గడవలేదు. , తల్లి అందించిన సహకారమే ఆలంబనగా ఒక్కొక్క మెట్టు కష్టపడి ఎక్కింది.



- ఆమెకు నాలుగు సంవత్సరాల వయసుండగా తల్లి ఉదరపోషణ కోసం న్యూయార్కు నుండి డల్లాస్‌కు మకాం మార్చింది.
- ఐదేళ్ల వయసులో చర్చి లో పాటలు పాడేది, ఏడేళ్ల వయసు వచ్చేసరికి, పియానో, సాక్సొఫోన్ వాయించేది
- ఆమె టీచర్లు సలహా ఇచ్చారు - సాక్సొఫోన్ మానకపోతే నీ గొంతు దెబ్బతింటుంది జాగ్రత్త అని.
- తల్లి వద్దనున్న బిల్లీ హాలిడే రికార్డులు ఆమెకు స్ఫూర్తినిచ్చాయి. పాటలు పాడడం ప్రాక్టీసు చేసేది.
- 15 వ యేట పెర్ఫామింగ్ ఆర్ట్స్ స్కూలులో చేరాక తన గాయనిగా తన ప్రతిభను గుర్తించింది.
- 17 వ యేడు వచ్చేసరికి స్టూడెంటు మ్యూజికల్ అవార్డులు లో 'బెస్ట్ జాజ్ వోకలిస్టు', 'బెస్టు ఒరిజినల్ కంపోజిషన్' అవార్డులు గెలుచుకుంది
- గ్రాడ్యుయేషన్ తరువాత నార్త్ టెక్సాస్ యూనివర్సిటీలో చేరి జాజ్ పియానోలో మేజరు చేసింది.
- ఆ సమయంలోనే లాసెజ్లో అనే బ్యాండ్‌తో కలిసి పాడేది.
- తరువాత న్యూయార్కుకు వెళ్లి పగలు వెయిట్రెస్‌గా పనిచేస్తూ రాత్రుల్లు గ్రీన్విచ్ విలేజి క్లబ్బ్‌లో జాజ్ పాడేది.
- డిసెంబరు 1999 నుండి వాక్స్ పొయెటిక్ బ్యాండ్‌తో కలిసి పనిచేసేది.
- తర్వాత జెస్సీ హారిస్, లీ అలెగ్జాండర్, డాన్ రైసర్ లతో కలిసి స్వంత గ్రూపు ఏర్పాటు చేసుకుంది.
- అక్టోబరు 2000 లో ఈ గ్రూపు ఒక డెమో తయారుచేశారు.

ఇలా ఎంతకాలం సాగేదో కానీ తన 21 వ యేట నోరా పాటపాడుతూండగా విన్న శ్రోతలలో షెల్ వైట్ ఉన్నాడు. ఆయన ఓ మ్యూజిక్ కంపెనీకి ఎకౌంటెంట్. నోరా వాయిస్



అక్కాచెల్లెళ్ల సఖ్యత

విని ముగ్ధుడయిపోయి ఆమె మేనేజరుగా మారిపోయాడు. ఆ తరువాత బ్లూ నోట్ రికార్డ్స్ ప్రెసిడెంటు బ్రూస్ లుండ్‌వాల్ వద్దకు నోరా డెమో టేపు తీసుకెళ్లాడు. జనవరి 2001 లో వాళ్లు నోరాతో కాంట్రాక్టు కుదుర్చుకున్నారు. నోరా వాళ్ల 'ఫస్ట్ సెషన్స్' కి కొన్ని పాటలు రాసింది. గాత్రసహకారం కూడా అందించింది. ('మోర్ దాన్ దిస్', 'డే ఈజ్ డన్' ) మే 2001లో నోరా తన ఫస్ట్ ఆల్బమ్ - 'కమ్ ఎవే విత్ మీ' ఆల్బమ్ పై పని ప్రారంభించింది. ఫిబ్రవరి 2002 లో అది విడుదలయింది. అంతే నోరా ఇక తిరిగి చూసుకోలేదు.

### కమ్ ఎవే విత్ మీ

- ❑ పాప్, జాజ్, జానపద సంగీతాల మిశ్రమం అది
- ❑ కమ్ ఎవే విత్ మీ, నైటింగేల్ లకు సంగీతం కంపోజ్ చేసినది నోరాయే!
- ❑ ది లాంగ్ డే ఈజ్ ఓవర్ పాట రాయడంలో సహకరించింది.
- ❑ ఇతర సింగర్స్‌లా నోరాజోన్స్ శారీరక ప్రదర్శన చేయలేదు.
- ❑ ఆమెకు వాద్యసహకారం అందించిన వారు - బిల్ ఫ్రిసెల్ (గిటార్), కెవిన్ బ్రీట్ (గిటార్), బ్రయాన్ బ్లేడ్ (డ్రమ్స్) జెన్నీ శ్కీన్‌మన్ (వయెలిన్), రాబ్ బర్జర్ (ఎకార్డిన్), శామ్ యాహెల్ (హేమండ్ బి-3 ఆర్గన్). కెన్నీ వుల్‌సన్ (డ్రమ్స్)



పట్టించుకోని తండ్రి రవిశంకర్

ఈ ఆల్బమ్ హిట్ కావడంతో నోరాకు ఖ్యాతి వచ్చినమాట నిజమే కానీ ఆమె వ్యక్తిగత జీవితం గురించి ఆరాలు వచ్చాయి. అప్పుడే రవిశంకర్ కనక్షన్ బయటపడింది. ఆమె స్పష్టంగా చెప్పింది - "నేను కష్టపడే రోజుల్లో మా నాన్న మా దగ్గర లేడు. నాకు మానాన్న అంటే ఇష్టమే కానీ ఆయన చేయనిదానికి క్రెడిట్ ఇవ్వనవసరం లేదు. " అని. అవును, దాదాపు 10 సంవత్సరాల పాటు రవిశంకర్ ఆ కూతురు గురించి పట్టించుకోనే లేదు. అనౌష్కా కచేరీలకు రెగ్యులర్‌గా వెళ్లే ఆ తండ్రి నోరా ఫంక్షన్‌కి తొలిసారి ఎటెండ్ అయినది ఈ ఫిబ్రవరిలోనే! అసలు గత నాలుగేళ్లుగా వాళ్ల మధ్య ఓ పాటి సంబంధాలు ఏర్పడ్డాయి.

సంతోషించదగ్గ విషయం ఏమిటంటే నోరా, అనౌష్కాల మధ్య ఏ పొరపొచ్చాలు లేవు. ఒకరినొకరు ప్రోత్సహించుకుంటూ సఖ్యంగా ఉంటారు. ఇద్దరి ముఖకవళికలలోనూ చాలా పోలికలు కనబడతాయి. పట్టుదలతో సాధించిలేనిది ఏదీ లేదన్న దానికి మరో ఉదాహరణ నోరా జోన్స్!

-కమ్యూనికేటర్ ఫీచర్స్

## సత్యసాయిపై మురళీమోహన్ ఆడియో క్యాసెట్



మనిషిలో దైవభక్తిని, ఆత్మశక్తిని పెంపొందనీయటానికి కృషిచేసే శ్రీ సత్య సాయిబాబా మహిమలు, పుట్టపర్తి విశేషాలు, శ్రీ సాయి సేవాదళ్ సభ్యుల గురించి వివరిస్తూ ప్రముఖ నటుడు, నిర్మాత, 'మా' అధ్యక్షులు శ్రీ మురళీమోహన్ 'జై సత్యసాయి' పేరిట వెలువరించిన ఆడియో క్యాసెట్‌ను ఇటీవల ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు విడుదల చేసారు. శ్రీ మురళీమోహన్, శ్రీ జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు పుట్టపర్తికి వెళ్లి శ్రీ సత్య సాయిబాబాకు స్వయంగా ఈ క్యాసెట్లను అందజేసారు. ఆయన వారిద్దరినీ అభినందించి, త్వరలో రెండోభాగాన్ని కూడా తయారు చేయటానికి అనుమతినిచ్చారు. ఈ 'జైసత్యసాయి ' ఆడియో క్యాసెట్‌కు సాహిత్యాన్ని జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు సమకూర్చగా వందేమాతరం శ్రీనివాస్ స్వరబద్ధం చేసారు. ఎస్.పి.బాలసుబ్రమణ్యం, పి.సుశీల, వందేమాతరం శ్రీనివాస్, సునీత, ఉష, శ్రీకాంత్, సంధ్య తదితరులు పాడిన 9 గీతాలు కల ఈ క్యాసెట్‌ను ఆదిత్యా మ్యూజిక్ సంస్థ మార్కెట్‌లోకి విడుదల చేసింది.

# న్యూస్ వ్యూస్

## అద్దంకిలో 'హాసం'

ఘంటసాల వారి జయంతి, వర్ధంతులను క్రమం తప్పకుండా జరిపే ఘంటసాల కళా సమితి (అద్దంకి) వారు గత పక్షం 4వ తేదీన జిల్లా స్థాయి పాటల పోటీలను నిర్వహించారు. పాల్గొన్న 89 మందిలో ఫైనల్స్‌కు ఎన్నికైన 28 గాయనీ గాయకులు ఆ రోజు ఆర్కెస్ట్రాతో సహా పాటలను పాడి ప్రేక్షకులకు వీనుల విందు చేశారు.



వేదికపై రాజా, మోటుపల్లి రామదాసు, అన్నమనేని వెంకటరావు

ఆనాటి సభకు ముఖ్య అతిధిగా 'హాసం' ఎడిటర్ రాజాను ఆహ్వానించి సినీ సంగీతంపై తమకున్న అభిమానం, అభిరుచి ఎటువంటివో అద్దంకి ప్రజలు ప్రత్యక్షంగా చూపించారు. ఘంటసాల కళా సమితి అధ్యక్షులు మోటుపల్లి రామదాసు, కార్యదర్శి పి.సి.హెచ్.కోటయ్య, జానపద కళాపీఠం అధ్యక్షులు యు.దేవపాలన, కళాసాగర్ అధ్యక్షులు అన్నమనేని వెంకటరావు, సినీరంగ విశ్లేషకులు ఆర్.వి.రాఘవరావు, ప్రముఖ సంగీత అధ్యాపకుడు తిరుపతి త్యాగరాజు పాల్గొన్న సభలో వక్తల ప్రసంగాలు, గాయనీ గాయకుల పాటలు ఎంతగానో ఆకట్టుకున్నాయనడానికి నిదర్శనం-రాత్రి 12 దాటి వాచీలలో డేటు మారుతున్నా సభికులలో ఏ ఒక్కరూ ఆడిటోరియమ్ వదలకుండా కూర్చోవడమే! ఈ కార్యక్రమాలే గాక 'హాసం' ఎడిటర్ రాజాతో ఇష్టాగోష్టిని కూడా 2 గంటల పాటు నిర్వహించి ఎన్నో ప్రశ్నలు వేసి నాటి, నేటి సినీ సంగీతంపై తమకు గల సందేహాలను అక్కడి ప్రజలు తీర్చుకున్నారు. ఆ ప్రశ్నలూ, వాటి సమాధానాలూ వచ్చే సంచికలో వుంటాయి.

## కార్తిక్‌గా మారిన షణ్ముఖ్



రాజేంద్రప్రసాద్ హీరోగా రేలంగి నరసింహారావు దర్శకత్వంలో వచ్చిన 'అమ్మోబొమ్మ' సినిమా గురించి వినేవుంటారు. అలాగే రాశి, రోజా నటించిన 'పోలీస్ సిస్టర్స్' గురించి కూడా! ఈ రెండిటికీ సంగీత దర్శకుడు షణ్ముఖ్. ఇవేకాక మరో ఆరు చిత్రాలు ఆయన అక్కౌంట్‌లో వున్నాయి. మాట వినిపించని పాటని ఒక సౌండ్ పొల్యూషన్‌గా భావించే షణ్ముఖ్ ఇటీవల తన పేరును 'కార్తీక్'గా మార్చుకున్నారు. మెలొడీ అంటే ఎక్కువగా ఇష్టపడే కార్తీక్ ఫాస్ట్‌బీట్‌కి సంబంధించిన ఎన్నో వరసల్ని కూడా కంపోజ్ చేసి తన ట్యూన్ బ్యాండ్‌లో దాచుకున్నారు. వచ్చే అవకాశాల్ని బట్టి వాటిని ప్రేక్షక శ్రోతల్ని అలరించే విధంగా అందించబోతున్నారు కూడా.

---

## మా టీవీ సమర్పించు


జడ్జి : సురేష్ బలరాం

MAA TV

### పాడాలని వుంది


సూత్రధారి : యస్పీ బాలసుబ్రహ్మణ్యం


జడ్జి : నేమాని సూర్యప్రకాష్

### కార్యక్రమాల వివరాలు

### 4వ ఎపిసోడ్-ప్రిలిమినరీ రౌండ్ : 21-12-02



1. కె.కార్తీక

| | |
|---|---|
| ఓంనమఃశివాయ | (సాగర సంగమం) |
| జోలాజోలమ్మ జోల | (సూత్రదారులు) |
| పగలే వెన్నెల | (పూజాఫలం) |



2. కె.మనోజ్‌కుమార్

| | |
|---|---|
| పురుషోత్తమా | (అన్నమయ్య) |
| నూజివీడు సోనియా | (ఔను వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు) |
| యమహా నగరి | (చూడాలని ఉంది) |



3. యం.స్రవంతి

| | |
|---|---|
| కలలైనా నీ తలపే | (శాంతి నివాసం) |
| నాగమల్లి కొనలోన | (బంగారు తిమ్మరాజు) |
| వెన్నెలలోని వికాసమే | (ఆరాధన) |



4. కె.నాగమల్లేశ్వరరావ్

| | |
|---|---|
| రాగమయీరావే | (జయభేరి) |
| చెంగావి రంగు చీర | (బంగారు బాబు) |
| సౌందర్యలహరి | (పెళ్ళిసందడి) |

### 5వ ఎపిసోడ్ ప్రిలిమినరీ రౌండ్ : 28-12-02



1. ప్రదీప్‌కుమార్

| | |
|---|---|
| సంగీతమే సరస సల్లాపమే | (సరిగమలు) |
| మబ్బే మసకేసిందిలే | (వయసు పిలిచింది) |
| ఈగాలి ఈనేలా | (సిరివెన్నెల) |



2. మాధవి

| | |
|---|---|
| అనురాగము విరిసేనా | (దొంగరాముడు) |
| సారీ సారీ సారీ సారీ | (బావగారూ బాగున్నారా!) |
| రేపల్లియ ఎదఝల్లున | (సప్తపది) |



3. వినయ్

| | |
|---|---|
| పల్లవించవా నా గొంతులో | (కోకిలమ్మ) |
| అయ్యోయ్యయ్యో | (ఇంద్ర) |
| మల్లెలు పూసే | (ఇంటింటి రామాయణం) |



4. వాసవి

| | |
|---|---|
| నే తొలిసారిగా | (సంతోషం) |
| మాయదారి సిన్నోడు | (అమ్మ మాట) |
| నీవు లేక వీణ | (డాక్టరు చక్రవర్తి) |

రచన: సీతారామశాస్త్రి **1** గానం : బాలు

ప: వద్దురా... సోదరా... అరె పెళ్ళంటే నూరేళ్ళమంటరా...
ఆదరా... బాదరా... నువ్వెళ్ళెళ్ళి గోతిలో పడొద్దురా...
చెడిపోవద్దు బ్రహ్మచారీ... పడిపోవద్దు కాలుజారీ...
తాళికట్టొద్దు ఖర్మకాలి... ఆలి అంటేనే భద్రకాళి..
కళ్యాణమే ఖైదురా... జన్మంత విడుదల లేదురా..
నీకొంప ముంచేస్తుందిరా... ఆపుకోలేని ఈ తొందర..
Dont marry... be happy...

చ: శివ అని నా క్లోజ్ ఫ్రెండ్... లవ్‌లో పడి పెళ్ళి చేసుకున్నాడు.
కాలేజీలో వాడు గ్రీకు వీరుడు.. మారేజి కాకముందు రాకుమారుడు
అంతా జరిగి జస్ట్ వన్‌మంత్ కాలేదు..
ఎంతమారిపోయాడో గుర్తుపట్టలేనట్టు..
బక్కచిక్కిపోయి... మంచి లుక్కు పోయి..
ఫేసు పాలిపోయి... జుట్టు రాలిపోయి...
ఈ దేవదాసు వాలకం దేనికంటే.. తను దేవిదాసు కావడం వల్ల అంటు
గుక్కపట్టి ఏడ్చాడు.. ముక్కు చీదుకున్నాడు..
ఒక్క చుక్క మందుకొట్టి ఫ్లాష్ బాక్ చెప్పాడు..
పొద్దున్న లేస్తూనే తన అందాన్ని పొగడాలి...
మరి ఏపూటకాపూటే... తనకైలవ్యూ చెప్పాలి...
ఏం కోరినా తక్షణం.. తీర్చాలిరా ఆ వరం...
కత్తి సామైందిరా కాపురం... పెళ్ళి క్షమించరాని నేరం... ll"Dont"ll

చ: అంతెందుకు మా మల్లిగాడు-మా ఊళ్ళో వాడంతటోడు లేడు..
మామూలుగానే వాడు దేశముదురు. పెళ్ళితోటె పోయింది వాడి పొగరు
ఇల్లాలు.. అమ్మోరు.. పళ్ళేక ఇంటిపోరు..
చల్లారిపోయింది వాడినెత్తురు
ఒక్కపూట కూడా.. ఉండదనుకుంటా..
కస్సుమనకుండా... బుర్ర తినకుండా..
వాణ్ణి తిట్టింతిట్టు తిట్టకుండా వెంటపడి
తరుముతూనే ఉంటదంట వీధివెంట..
కోడెనాగు లాంటి వాణ్ణి.. వానపాము చేసింది..
ఆలికాదురా అది అనకొండ
ఆ గయ్యాళి యమగోల.. కలిగించింది భక్తి యోగం
ఆ ఇల్లాలి దయవల్ల కనిపించింది ముక్తి మార్గం..
సంసారమే వేస్టని.. ఇక సన్యాసమే బెస్టని..
కాషాయమే కట్టాడురా.. కట్టి కాశీకి పోయాడురా.. ll"Dont"ll



చ: నువ్వేనా నా కల్లోకొచ్చింది... నా మనసంతా తెగ అల్లరి చేసింది...
ఊహల పల్లకిలో నిను ఊరేగించెయ్‌నా...
నా కమ్మని కౌగిట్లో.. నిను బంధించేసేయ్‌నా
అరె ముద్దుల మీద ముద్దులు పెట్టి ఉక్కిరి బిక్కిరి చేసేయ్‌నా..
హద్దులు మీరి చెంతకు చేరి కలబడిపోనా... ॥అయ్యోరామ॥ ॥అంద॥
చ: కళ్యాణీ నచ్చిందే నీ ఓణీ... నీ తోడే కోరిందే జవానీ
ఎర్రని బుగ్గలకే వేసెయ్‌నా గాలాన్ని..
నీ ఒంపుల సొంపులకీ ఒక మన్మధ బాణాన్ని
అరె ఎన్నో ఎన్నో అందాలున్నా ఈ లోకంలో చిన్నారీ
అన్నిట్లోకి నువ్వేమిన్న కద సుకుమారీ... ॥అయ్యోరామ॥ ॥అంద॥

రచన: సీతారామశాస్త్రి **6** గానం : షాన్

ప: చెలియా.. చెలియా.. చెయిజారి వెళ్ళకే...
సఖియా... సఖియా.. ఒంటరిని చెయ్యకే..
నడిరేయీ పగలూ చూడక... సుడిగాలై వస్తా సూటిగా...
ఎడబాటే బాటై రానా నీ దాకా..
పడిలేచే కెరటం తీరుగా... దిశలన్నీ దాటే హోరుగా...
నిను తాకేదాకా ఆగదు నా కేకా... ॥చెలియా॥

చ: కదలికే.. తెలియనీ... శిలని కదిలించి ఓ ప్రేమా...
కలయికే... కల అనీ మాయమై పోకుమా..
గతముగా.. మిగిలినా... చితిని బతికించి ఓ ప్రేమా...
చెరిపినా... చెరగనీ... గాయమైపోకుమా...
మౌనమా... అభిమానమా... పలకవా అనురాగమా...
ఓడిపోకే ప్రాణమా వీడిపోకుమా
అడుగడుగు, తడబడుతూ...
నిను వెతికి వెతికి కనులు అలసిపోవాలా ॥చెలియా॥
చ: నిలిచిపో సమయమా... తరమకే చెలిమి ఇకనైనా...
చెలిమితో సమరమా... ఇంతగా పంతమా...
నిలవకే హృదయమా... పరుగు ఆపొద్దు క్షణమైనా...
నమ్మవేం ప్రణయమా... అంత సందేహమా...
వేరుచేసే కాలమా... చేరువైతే నేరమా...
దాడిచేసే దూరమా... దారిచూపుమా...
విరహాలే.. కరిగేలా... జతకలిపి
నడుపు వలపు కథలు గెలిచేలా... ॥చెలియా॥



రచన: ఎ.ఎం.రత్నం, శివగణేష్ **1** గానం: వసుంధరా దాస్, ప్రవీణ్ మణి, దేవన్

ఆ: షకలక బెయ్‌బి షకలక బెయ్‌బి
షకలక బెయ్‌బి షకలక బెయ్‌బి
ఆ: షకలక బెయ్‌బి షకలక బెయ్‌బి లుక్కులివ్వ తోచలేదా
షకలక బెయ్‌బి షకలక బెయ్‌బి లవ్వుచెయ్య తోచలేదా
నొనొ నొనొ నొ నొ నొ నొనొ నొనొ నొ నొ నో ॥షకలక॥
ఆ: మాటలల్లో చెప్పేటి రోజా ఒకటి విసిరిచూడు షయ్యో షయ్యో షయ్యో
నొనొ నొనొ నొ నొ నొ నొనొ నొనొ నొ నొ నో
భ భ భ భ భ భ భ భయమేల ద ద ద ద ద ద ద దడయేల
లోలోన దాగిందంత లెటర్‌రాసి పంపవేల నొనొనొ నొ నొనొ
షకలక బెయ్‌బి షకలక బెయ్‌బి లుక్కులివ్వ తోచలేదా(2)
ఆ: సాగరతీరంలో కాలె మండుటెండల్లో
మిట్టమధ్యాహ్నం మీటవుదాం హో ... హో...
ఒక కోకా కోలలో రెండు స్ట్రాలువేసి
సాయంకాలం దాక తాగుతుందామా నొనొ నొనొ నొనొ
ఆ: నా డ్రస్సుమీద ఐస్‌క్రీం వేసిపో ఓ... హో... హో...
అది తుడిచేసొక్కూడ తాకిపో షయయయ యాయ్యయాయ్య
ఫ్రయిడే టెంపుల్లకు తీసుకుపో సాటర్‌డే డిస్కోథెక్‌కు తీసుకుపో
సండే టైటానిక్ తీసుకుపో తీ సు కు పో నన నన న॥షక॥
ఆ: నే స్త్రీనైతే నువు మగవాడైతే వియ్యే ఎక్ దూజే కేలియే హొత్తుకో
ఎక్ దూజే ఎక్ దూజే ఎక్ దూజే కేలియే ॥2॥
కెహాస్ ఆన్ ద క బేటా ఇకర్రామ్మా
హే హే హే ఏమయిందిరా మీకు
స్త్రీలంటే మీకు ద్వేషమా నువ్వు ఇరవైయ్యేళ్ళ ముసలాడివా
యంత్రానికి పుట్టినోడివా షయ్యోరే హోరే
ఆశ నీకు లేనె లేదా నువ్వు మీసమున్న చెట్టు చేమవా హహహ
క్రీస్తుపూర్వం పుట్టినోడివా షయ్యోరే హోరే
అ: లవ్వుల్లో మునిగి లైఫంత విసిగి
గడ్డాలే పెంచుకున్నాం చాలు చాలు
అమ్మాయిలు చదువుల్లో అధికులవగా
మేమూ ఓడిపోయాం ఓడీ పోయాం
లవ్వుల్లో పడితే లవ్వుల్లో పడితే జీవితం సాగునులే సాగేనులే
లైపుల్లో గెలిస్తే లైపుల్లో గెలిస్తే అమ్మాయిలే వచ్చునులే వలచేనూలే
ఇ: ॥షకలక బెయ్‌బి షకలక బెయ్‌బి॥
అ: ఐ డోన్ట్ వాన్ట్ ఐ డోన్ట్ వాన్ట్ ఐ డోన్ట్ వాన్టా లవ్
ఆ: ఎ పోయ్యా ఆడియో సమ్ యిగో

రచన: ఎ.ఎం.రత్నం, శివగణేశ్. **2** గానం: ఎస్.జానకి, శంకర్‌మహదేవన్

అ: మగధీర ధీర ధీర ధీరా (2) మగధీరా
ఆ: మగధీర నన్నే చేకొనరా నాపైట నెగరవేయ సమయమేదిరా
ఓ ప్రేమపిచ్చి పట్టి వగచేరా ముద్దుల వర్షం కురిపించరా
కత్తుల సవ్వడి విన్న వీరా గాజుల సవ్వడి వినుకోవేరా
మగధీరా మగధీరా ॥మగధీర॥
ఆ: ఆ.. ఆ.. శుభ ఘడియ చూసి కురులు తీసి
పద్దురాయరా జబ్బపైనా
అ: ఆ.. ఆ.. బంగారు కుంచె తేనెలొ ముంచి





ఈ చిన్నదాన్ని దైవమొచ్చి వరమిచ్చునో ॥ఏరు॥
అ: సొంపైన సంపంగి నీ చెంపలోన కెంపువుంది
నా కళ్ళలోన గూడుకట్టి చెవిలోన పాడే చిలకా
నువ్వు అందకుండ పోతుంటె నన్ను వీడి పోవు వయసు ॥సొంపైన॥
అ: ఒక ఘడియ కౌగిలి బిగియించి
నా ఊపిరాపవే ఓ చెలియా
ఆ: నీ గుండె లోగిలి నే చేర నన్ను కొంచం హత్తుకో చెలికాడ
అ: చురుకుంటి చిరుమాట వెలుగంటి ఆ చూపు
దేహమింక మట్టిలో కలసి పోయే వరకు ఓర్చును
ఆ: ప్రాణం నా చెంత వుండగా నువ్వు మరణించి పోవుటయా
అరె నీ జీవమే నేనేనయా చంపదలచు
మరణమైన మాయమయా ॥నెల్లూరి॥
అ: నెల్లూరి నెరజాణ నేకుంకుమల్లె మారిపోనా
నువ్వు స్నానమాడు పసుపు లాగ
ఆ: నిన్ను కొంచం పూసుకుంటా
అ: నీ అందెలకు మవ్వల్లాగ నన్ను కొంచం
ఆ: మార్చుకుంటా
అ: ఓహో__
ఆ: ఓహో__

రచన: ఎ.ఎం.రత్నం, శివగణేష్ **6** గానం:ఎస్.పి.బాలు,హరిణి

అ: అందాల రాక్షసివే గుండెల్లొ గుచ్చావే
మిఠాయి మాటలతో తూటాలు పేల్చావే
కొడవలితొ కసిగా మనసే కోశావే ॥అందాల॥
ఆ: గడ్డి మొక్కకు కోత తెలియునా బాల కొమరినే కానా
నీటి కొంగను చేప మింగునా జరుగునా
బైట పూసినా లోన కాసెడి శనగతోటను మామా
మెలిక తిప్పుతూ కాయలొలిచెడి తుంటరి సుమా
అ: చిలకా రామ చిలకా.. మొలకా ప్రేమ మొలకా ॥అందాల॥
అ: సూర్యుణ్ణి రెండు చేసి కళ్ళలోన దాచుకుంటా అహ కో: ఒహో
అ: చందురుని కంటి పాపలోన తాను వుంచుకుంటా కో: ఒ ఓఓ
అ: రాతిరిని పట్టుకొచ్చి కాటుకల్లె పెట్టెదనా అహ కో: ఒహో
అ: మిణుగుర్లు అంటించి బుగ్గలకు నిగ్గుతేనా కో: ఒఓఓ
ఆ: పొగడి నను రెచ్చగొట్టి నిద్ర చెడగొట్టకయా
తలగడగ నాకొక్క పంచి నువు ఈయవయా
కనుల కునుకే కలయా..
అ: చిలకా రామ చిలకా మొలకా ప్రేమ మొలకా ॥అందాల॥
కో: కొండపల్లి బొమ్మతోటి జంటచేరి ఆడుకుందాం మొగలి పువ్వా ॥2॥
ఆ: తెనెపట్టు పట్టుబట్టి పాడుచెయ్య శపధమా అహ కో:ఒహో
ఆ: ప్రేమంటె పార్టీ విడిచి పార్టీ మార్చు విషయమా కో:ఒఓఓ
ఆ: కన్నెపిల్ల సైగచేస్తె తలక్రిందులవుదువా అహ కో:ఒహో
ఆ: నే నడచు నీడలోన నీవుండ సమ్మతమా..
అ: నే కనక నీరైతే నీ నుదుటిపై నేజారి
అందాల నీ ఎదపై హుందాగ కొలువుంటా కానీ అన్నీ కలలే...
ఇ: చిలకా రామ చిలకా
అ: మొలకా ప్రేమ మొలకా ॥అందాల॥

ఆ: పరిమళం వెంట పయనించే
పరుగు తడబాటు పడుతోంది
అ: పరిణయం దాక నడిపించే
పరిచయం తోడు కోరింది
ఆ: దూరం.. తలొంచే.. ముహూర్తం ఇంకెపుడొస్తుంది.. ॥గుండెల్లో॥

రచన: సీతారామశాస్త్రి **4** గానం: బాలు & చిత్ర

అ: నా మనసునే మీటకే నేస్తమా..
నా దారిలో చేరకే చైత్రమా
సరదాల చిలిపితనమా... చిరునవ్వులోని స్వరమా..
నా తలుపు తట్టి కదిలించకే కవ్వించకే ప్రేమా... ॥నా మనసు॥
అ: నాకెందుకిలా అవుతోంది చెప్పవా ఒక్కసారి
ఆ: నీవెంటపడే ఆశలకి చూపవా పూలదారి
అ: చినుకల్లె చేరి.. వరదల్లె మారి ముంచేస్తే తేలేదెలాగ
ఆ: తడిజాడ లేని... తమ గుండెలోని దాహాలు తీరేదెలాగ
అ: లేనిపోని సయ్యాటతో వెంటాడకే ప్రేమా..
ఆ: నీ కనులలో వెలగనీ ప్రియతమా
నీ పెదవికే తెలుపనీ మధురిమ..
అ: నీ ఊహలలో కొంటెతనం పలకరిస్తోంది నన్ను..
ఆ: నీ ఊపిరితో అల్లుకుని పులకరిస్తోంది వెన్ను..
అ: అలవాటుపడిన ఎద చీకటింట సరికొత్త వేకువై రావా..
ఆ: కిరణాలు పడని తెరచాటులోని ఏకాంతమే ఒదులుకోవా..
అ: నన్ను నేను మరిచేంతలా మురిపించకే ప్రేమా... ॥నీ కనులలో॥

రచన: భువనచంద్ర **5** గానం: దేవీశ్రీప్రసాద్

ooh Baby just give me love...
ooh Baby I want it now (2)
ప: అందమైన భామలు లేత మెరుపు తీగలు(2)
ముట్టుకుంటే మాసిపోయే.. కన్నెల అందాలు
అరె సిల్కు చుడీదారులు... కాంజీవరం చీరలు
రెచ్చగొట్టి రేపుతున్నాయి... వెచ్చని మోహాలు
అయ్యోరామ... ఈ భామ... భలే ముద్దొస్తున్నాదే...
అయ్యోరామ... అందంతో... నను చంపేస్తున్నాదే... ॥అయ్యో॥ ॥అంద॥



రచన: సీతారామశాస్త్రి **2** గానం : ఎస్.పి.చరణ్

ప: నేను నేనుగా లేనే.. నిన్న మొన్నలా..
లేనిపోని ఊహల్లో.. ఏమిటో ఇలా..
ఉన్నపాటుగా ఏదో.. కొత్త జన్మలా..
ఇప్పుడే ఇక్కడే.. పుట్టినట్టుగా... ॥నేను॥
చ: పూలచెట్టు ఊగినట్టు... పాలబొట్టు చిందినట్టు
అల్లుకుంది నా చుట్టూ.. ఓ చిరునవ్వు..
తేనెపట్టు రేగినట్టు... వీణమెట్టు ఒణికినట్టు..
ఝల్లుమంది గుండెల్లో.. ఎవరేనువ్వు..
నా మనసుని మైమరపున ముంచిన ఆ వాన...
మీకెవరికి కనిపించదు ఏమైనా... ఓ...ఓ... ఓఓఓ... ॥నేను॥
చ: చుట్టు పక్కలెందరున్నా.. గుర్తు పట్టలేక ఉన్నా..
అంతమంది ఒక్కలాగే.. కనబడుతుంటే..
తప్పునాది కాదు అన్నా.. ఒప్పుకోరు ఒక్కరైనా..
చెప్పలేను నిజమేదో...నాకూ వింతే
కళ్లను వదిలెళ్లను అని కమ్మిన మెరుపేదో..
చెప్పవ కనురెప్పలకే మాటొస్తే...
ఓ...ఓ...ఓఓఓ.... ॥నేను॥

రచన:సీతారామశాస్త్రి **3** గానం: వేణు, సుమంగళి

అ: గుండెల్లో ఏవుందో... కళ్లల్లో తెలుస్తుంది
ఆ: పెదవుల్లో ఈమౌనం... నీపేరే పిలుస్తోంది
అ: నిలవదు కద హృదయం... నువు ఎదురుగ నిలబడితే
ఆ: కదలదు కద సమయం... నీ అలికిడి వినకుంటే
అ: కలవరమో.. తొలివరమో.. తెలియని తరుణమిదీ.. ॥గుండెల్లో॥
మనసా(3)...మనసా(3)... మనసా(3)...ఓ మనసా..
అ: పువ్వులో లేనిదీ.. నీ నవ్వులో ఉన్నదీ
ఆ: నువ్వు ఇప్పుడన్నదీ-నేనెప్పుడూ విననిదీ
అ: నిన్నిలా చూసి పైనుంచీ-వెన్నెలే చిన్నబోతోంది
ఆ: కన్నులే దాటి కలలన్నీ-ఎదురుగా వచ్చినట్టుందీ
అ: ఏమో... ఇదంతా... నిజంగా కలలాగే ఉంది. ॥గుండెల్లో॥
ఆ: ఎందుకో తెలియనీ-కంగారు పుడుతున్నదీ
అ: ఎక్కడా జరగనీ-వింతేమి కాదే ఇదీ



అ: నీ అందెలకు మువ్వల్లాగ నన్ను కొంచం
ఆ: మార్చుకుంటా
అ: ఓహో__
ఆ: ఓహో__

రచన : ఎ.ఎం.రత్నం, శివగణేశ్. **4** గానం:శంకర్‌మహదేవన్, కవితాకృష్ణమూర్తి

హే..... చంద్రముఖి.... లైల, లైలలే లైలలే....
అ: ఉట్టి మీద కూడు ఉప్పు చాపతోడు ॥2॥ వడ్డించనువ్వుచాలునాకు
ముద్దుపెట్టి నెత్తిన గుండెలో మధ్యన చచ్చిపోవ తోచనమ్మనాకు ॥ఉట్టి॥
ఓ ఏటి గట్టు మీద తూనీగే పడదామా
కాకి ఎంగిలిలా ఒక పండే తిందామా
ఆ: కోలా ఓ కోలా గలా-కోలా....॥2॥
అ: కోలా ఓ కోలా గలా కోలా....॥2॥
అ: కొర్ర మీను తుళ్లే కాలువలో రెల్లుగడ్డి మొలిచే రేగడిలో
నాతోటి బురదచిందులాడు తైతైతైతైతై
చలి గంగ స్నానాలు చేద్దామా సిగ్గు విడిచి వైవై
ఆ: లైలైలైలైలైలై, లైలలైలైలైలైలై
కోకలు రాకలు కల్లే నోయ్
బతుకే నిమిషం నిజమే నోయ్
అ: ఏ.. అరటి ఆకున నిన్నే విందుగ (చెయ్-।5।)
ఆ: ఆశే పాపం హోయ్ హోయ్ హోయ్
చెవిలో గోల గోయ్ గోయ్ గోయ్
అ: పరువపు వయసు సేవలన్నీ (చెయ్-।6।)
ఆ: కోలా ఓ కోలా ఓకోలా గలా ॥4॥ - ॥ఉట్టి॥
ఓ.. చంద్రముఖి.. చంద్రముఖి
ఓ లైల లైల లైలై.... చంద్రముఖి లైలైలైలై......
కోరస్: లైలైలైలై
ఆ: గాలి తప్ప దూరని అడవిలో
తుర్రు పిట్ట కట్టిన గూటిలో
ఒక రోజు నాకు విడిది చెయ్ హోయ్ హోయ్ హోయ్ హోయ్ హోయ్
నువ్వు చీర దొంగిలించి పోయేనా పరువు నిలుపు దాచెయ్
అ: వలువలు అన్నవి కల్లేనోయ్ దాగిన వొళ్లే నిజమే నోయ్ ॥2॥
అంతటి అందం నాకే సొంతం (హోయ్-6)
ఆ: యదలో రొదలే తైతైతై తలచిన పనులే (చెయ్-3)
అ: మేను మేను కలవడమే (హోయ్-6) ॥ఉట్టి॥

రచన : ఎ.ఎం.రత్నం, శివగణేశ్. **5** గానం:స్వర్ణలత, శ్రీనివాస్

ఆ: ఎలేలే...
ఏరువాక సాగుతుండగా చుట్టు పైరగాలి వీస్తుండగా
నే నేరు దాటి అయ్యకేమో సద్దికూడు తీసుకెళ్తా
ఎన్నో మంచి మంచి శకునాలు చూసి నేను మురిసిపోయా ॥ఏరు॥
ఒకవైపు కన్నదిరే మరువైపు మేనదిరే
వీధుల్లో నిండిన కుండలు మోగెను గంటలు ఏలనో
ఒక పూలమ్మి ఎదురొచ్చె పాడి ఆవొకటి కనిపించె
ఇక ఏమౌతుందో ఏటౌతుందో



సంతకం చేస్తా నీ గుండెపైనా
ఆ: లోకం కోసం నిధి పంచు
ఈ దేహం కోసం ఒడిపంచు
అ: ప్రభువుల మనుగడ విధి ధర్మం
బలికావడమే చెలి ధర్మం
ఆ: ప్రియతమా.. ప్రియతమా.. నీకై వేచి ఉన్నా ॥మగధీరా॥
ఆ: గుడులెన్నొ తెరచి బడులు తెరచి
పడక గది చేర తీరికలేదా
అ: ఓ.. కలహాలు తీర్చి చట్టాలు మార్చి
కాగిలి చేరుట పాడి కాదా
ఆ: మోహంలో నను ముంచేసి మంత్రులతోనే మంతనమా
అ: నీ కంట నీరు తుడవంగా ఊళ్లో కుళాయి నీళ్లిచ్చునా
ఆ: ప్రణయమా ప్రణయమా నాపై దయచూపుమా ॥మగధీరా॥
ఆ: మగధీర నన్నే చేకొనరా నాపైట నెగరవేయ సమయమేదిరా
ప్రేమపిచ్చి పట్టి అ: వగచేవా
ఆ: ముద్దుల వర్షం అ: కురిపిస్తా
ఆ: కత్తుల సవ్వడి అ: ఆగువేళ
ఆ: గాజుల సవ్వడి అ: నే వినుకుంటా ॥మగధీర॥

రచన : ఎ.ఎం.రత్నం, శివగణేశ్. **3** గానం : హరిహరన్, మహాలక్ష్మి

అ: నెల్లూరి నెరజాణ నే కుంకుమల్లె మారిపోనా
నువ్వు స్నానమాడు పసుపులాగ నన్నుకొంచం పూసుకోవే
నీ అందెలకు మువ్వల్లాగ నన్ను కొంచం మార్చుకోవే ॥నెల్లూరి॥
ఆ: ఒక కంట నీరులతో పెదవెంట ఉసురులతో
నీవల్ల ఒకపరి జననం ఒక పరి మరణం అయినది
అరె పారేటి సెలయేరు అల సంద్రాన కలిసినట్టు
గుండె నీతోడు గా వెంటాడెనే అరె కాలం మరచి
అడవి చెట్టు పూచెనులే ॥నెల్లూరి॥
ఆ: జొన్నకంకి ధూళే పడినట్టు కన్నులలో దూరి తొలచితివే
అ: తీగ వదిలొచ్చిన మల్లికవే ఒక మారు నవ్వుతు బదులీవే
ఆ: పెదవి పైపెదవుంచి మాటలను జుర్రుకొని
వేళ్లతో హొత్తిన మెడపై రగిలిన తాపమింక పోలేదు
అ: అరెమెలిసేటి రంగుసేటి నీ అందాని కెదురేది
నువ్వు తాకే చోట తీపెక్కులే ఇక
ఒళ్ళు మొత్తం చేయవలెను పుణ్యమునే ॥నెల్లూరి॥
అ: ఒక ఘడియ కౌగిలి బిగియించి
నా ఊపిరాపవే ఓ చెలియా
ఆ: నీ గుండె లోగిలి నే చేర నన్ను కొంచం హత్తుకో చెలికాడ
అ: చురుకుంటి చిరుమాట వెలుగంటి ఆ చూపు
దేహమింక మట్టిలో కలసి పోయే వరకు ఓర్చును
ఆ: ప్రాణం నా చెంత వుండగా నువ్వు మరణించి పోవుటయా
అరె నీ జీవమే నేనేనయా చంపదలచు
మరణమైన మాయమయా ॥నెల్లూరి॥
అ: నెల్లూరి నెరజాణ నేకుంకుమల్లె మారిపోనా
నువ్వు స్నానమాడు పసుపు లాగ
ఆ: నిన్ను కొంచం పూసుకుంటా

అక్కినేని అన్నపూర్ణ

అన్నపూర్ణ స్టూడియోస్

# మన్మథుడు

He Hates Women...!

నాగార్జున అక్కినేని విజయభాస్కర్.కె దేవిశ్రీ ప్రసాద్



అక్కినేని నాగార్జున



కె.విజయభాస్కర్



సిరివెన్నెల సీతారామశాస్త్రి



దేవిశ్రీ ప్రసాద్



భువనచంద్ర

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

## తారాగణం

నాగార్జున అక్కినేని, సోనాలిబింద్రే, అన్షు, చంద్రమోహన్, తనికెళ్ళ భరణి, బ్రహ్మానందం, బాలయ్య, రంగనాథ్, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, అనంత్, మెల్కోటే, సుధ, స్వప్న మాధురి

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ-మాటలు | : త్రివిక్రమ్ |
| సంగీతం | : దేవిశ్రీప్రసాద్ |
| కళ | : వి.శ్రీనివాసరాజు |
| కెమెరా | : సమీర్‌రెడ్డి |
| ఎడిటింగ్ | : శ్రీకర్ ప్రసాద్ |
| పి.ఆర్.ఓ. | : యల్.వేణుగోపాల్ |
| పబ్లిసిటీ డిజైన్స్ | : కృష్ణ డిజిటల్స్ |
| కో-డైరెక్టర్ | : బి.సుబ్బారావ్ |
| ప్రొడ్యూసర్ | : నాగార్జున అక్కినేని |
| స్క్రీన్‌ప్లే-దర్శకత్వం | : కె.విజయభాస్కర్ |



## తారాగణం

అర్జున్, మనీషాకొయిరాలా, రఘువరన్, మణివణ్ణన్, విజయకుమార్, వడివేలు, వి.యం.సి. హనీఫా, సుస్మితాసేన్, లైలా

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| పాటలు | : ఎ.ఎం.రత్నం, శివగణేష్ |
| మాటలు | : శ్రీరామకృష్ణ |
| ఎడిటింగ్ | : బి.లెనిన్-వి.టి.విజయన్ |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : కె.వి.ఆనంద్ |
| పబ్లిసిటీ డిజైనర్ | : లంక భాస్కర్ |
| పి.ఆర్.ఓ. | : జగన్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : ఆర్.ఉదయ్‌కుమార్ |
| మేనేజర్స్ | : పి.రాము, ఎన్.నాగరాజు, ఎస్.మురుగున్ |
| సౌండ్ ఎడిటింగ్ | : ఎన్.గణేష్‌కుమార్, డి.బి.వెంకటేష్ |
| కెమెరా అసిస్టెంట్స్ | : రమేష్, సౌందర్, బెల్లదొరై, వేల్ మురుగున్, బి.కె.శివన్ |
| సహాయ దర్శకులు | : ముత్తువడుగు, ఎస్.పి.హోసిమిన్, కె.ఆర్. మదివారేన్, జి.అనంత నారాయణ్ |
| కో-డైరెక్టర్ | : ఆర్.మాధేష్ |
| అసోసియేట్ డైరెక్టర్ | : ఇళంగణ్ణన్ |
| ఆడియోగ్రఫీ | : హెచ్.శ్రీధర్ |
| స్పెషల్ విజువల్ ఎఫెక్ట్స్ | : ఎస్.టి.వెంకి |
| స్టంట్ | : కణల్ కణ్ణన్ |
| నృత్యాలు | : చిన్ని ప్రకాష్, తరుణ్ కుమార్, అహ్మద్‌ఖాన్ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : అళహరి రఘురామ్ |
| ఆర్ట్ అండ్ స్పెషల్ కాస్ట్యూమ్స్ డిజైనర్ | : తోట తరణి |
| సంగీతం | : ఎ.ఆర్.రహమాన్ |
| నిర్మాత | : శ్రీసూర్యా మూవీస్ |
| కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : శంకర్ |

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

# ఒకే ఒక్కడు

OKE OKKADU



శంకర్



ఎ.ఎం.రత్నం



ఎ.ఆర్.రహమాన్







విడుదల : ఆదిత్య
వెల : రూ. 38/-

మ్యూజిక్ మాస్ట్రో ఇళయరాజా చాలా కాలం తర్వాత ఓ తెలుగు సినిమాకి సంగీతాన్ని ఇవ్వడమే ఈ ఆడియోకి ఓ పెద్ద ప్లస్ పాయింట్! 'మౌనమేలనోయి' సినిమా ద్వారా పరిచయమైన సచిన్ హీరోగా వస్తున్న ఈ 'నిను చూడక నేనుండలేను' సినిమా ఆడియో ఆదిత్య ద్వారా విడుదలయింది. ఇందులోని పాటలను కులశేఖర్ రాశారు.

టిప్పు, శ్రేయ పాడిన 'సరిసరి సరిసరి-గడసరి సరాసరి' పాటలో 'అందానికే నేను కొత్త చిరునామా' అనే లైను సంగీత పరంగా, సాహిత్యపరంగా విన్నవారందరినీ వెంటాడుతూనే వుంటుంది. చరణాలలోని సెకండాఫ్ లైన్లకి జతపడిన ట్యూన్ వింటుంటే ఇళయరాజా తన పాత రోజులలో చిరంజీవి సినిమాలకిచ్చిన ట్యూన్‌లు గుర్తొస్తాయి.

ఇళయరాజా, సాధనాసర్గమ్ పాడిన 'కొమ్మల్లో కోయిలా కూసిందే తీయగా' వినగానే 'ఎన్నాళ్ళకి ఒక మంచి పాట విన్నాం' అనే ఫీలింగ్ ఖచ్చితంగా కలిగి తీరుతుంది. దీనికి ముఖ్య కారణం ఇళయరాజా కంఠం, పాడిన పద్ధతి ఇవన్నీ పిబి శ్రీనివాస్‌ని గుర్తు చేయడమే! మంచి మెలొడీ, చక్కటి ఊపుతో జతపడిన ట్యూన్ మరో కారణం కాగా, చరణాల చివర 'కట్‌కౌంటర్స్'తో గాయనీ గాయనీ ఒకరినొకరు అందుకొంటూ పాడడం ఇంకో కారణం!

కెకె పాడిన 'ఏదో మౌనరాగం' పాట ట్యూన్‌లో ఎంత బరువుందో సాహిత్యంలో అంత డెప్త్ వుంది. 'కంటి పాప చిన్నదేనని చిన్నబోకు స్వప్నమా గూడులేని పావురానికి దారిచూపు దైవమా-గోపురాన వాలరాదని ఇంతపెద్ద శాపమా' వంటి వాక్యాలతో కులశేఖర్ తన గురువు సీతారామశాస్త్రి గారిని ఒకవైపు గుర్తుచేస్తూనే, మరోవైపు మరోవైపు ప్రత్యేకమైన గుర్తింపు పొందుతాడు.

ఆర్.పి.పట్నాయక్ పాడిన 'చమకుచమ చేపకనుల దానా' పాట యూత్‌కి బాగా పట్టే పాట! ఈ పాటలో 'చ' కార, 'జ' కారాలను ఎక్కువగా ప్రయోగించటం వెనుక కులశేఖర్ మనసులో ఏదో ఒక కారణం వుండే వుంటుంది ఎందుకంటే ఆయన వ్యర్థాక్షర ప్రయోగాలు చేసే వ్యక్తి కాదు! అంచేత ఆ కారణం ఏదైనా ఉంటే ఆయన ఎప్పటికైనా శ్రోతలకు చెప్పగలిస్తే బావుంటుంది.

సాధనా సర్గమ్ పాడిన 'జాజిమల్లీ తోటలోనా ఊసులాడే గోరువంకా' మరో మంచిపాట. అభిరుచి వున్న శ్రోతల మార్కులు కొట్టెయ్యడానికి ఔత్సాహిక గాయనీమణులకు ఈ పాట ఎంతగానో ఉపయోగపడుతుంది. 'అభినందన' సినిమా రోజుల్లో ఇళయరాజా ఇచ్చిన మెలొడీ మళ్ళీ ఈ పాటలో తొంగి చూసింది.

కెకె, సాదనాసర్గమ్ పాడిన 'కొండపల్లి అహాహ్ బొండుమల్లి అహాహ్ బాగుందె బాగుందె'పాట వింటే మెలొడీని ఎంతవరకు ఫాస్ట్ చెయ్యొచ్చు అన్న విషయం పరోక్షంగా అర్థమవుతుంది. ■

---




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ 40/-

యస్పీ బాలసుబ్రహ్మణ్యం, యస్.జానకి పాడిన ఓ 13 డ్యూయెట్లను 'బెస్ట్‌పెయిర్' అనే మకుటంతో ఆడియో క్యాసెట్‌గా హెచ్.ఎం.వి. వారు రూపొందించారు.

వీణ వేణువైన సరిగమ విన్నావా(ఇంటింటి రామాయణం), సిరిమల్లెపువ్వల్లె నవ్వు (జ్యోతి), నీ కౌగిలిలో తలదాల్చి (కార్తీకదీపం), తొలివలపు తొందరలో (సొమ్మొకడిది -సోకొకడిది), పంటచేలో పాలకంకి నవ్వింది (పదహారేళ్ల వయసు), ఎదలో...తొలివలపే (ఎర్ర గులాబీలు), ఓ...జవరాల (పేదరాశి పెద్దమ్మ కథ), రాశాను ప్రేమలేఖలెన్నో (శ్రీదేవి), కన్నెపిల్లనని (ఆకలిరాజ్యం), జిలిబిలిపలుకులు చిలిపిగ నవ్వే ఓ మైనా మైనా (సితార), అలివేణి ఆణి ముత్యమా (ముద్దమందారం), మౌనమేలనోయి (సాగరసంగమం), లిపిలేని కంటిబాస (శ్రీవారికి ప్రేమలేఖ) పాటలు ఈ క్యాసెట్‌లో వున్నాయి.

ఈ డ్యూయెట్లన్నీ హిట్టే...ఇందులో కొన్ని ఇటీవల అరుదుగా దొరికే పాటలుగా కూడా అయిపోయాయి. అంచేత ఈ క్యాసెట్‌ను 'గుడ్ కలక్టర్స్ అయిటమ్' గా స్వీకరించవచ్చు. కాకపోతే ఇటువంటి క్యాసెట్లకు 'బెస్ట్ పెయిర్' అనే మకుటం కంటే 'బెస్ట్ కాంబినేషన్' అనే మకుటం ఔచిత్య భంగం లేకుండా ఉంటుంది. ■

**మార్కెట్లో ఉన్న హెచ్.ఎం.వి. కొత్తక్యాసెట్**




వెల : రూ. 45/-



చదువుల్రావు
ఊఁ... పట్టు
నమస్కారం సార్ లైబ్రేరియనగారు. మీరు ఒక్కరూ ఈ బీరువాని ఈడ్చలేక పోతున్నారను కుంటాను. సాయం పట్టనాండి?
చాలాసేపు అయ్యాక_
ఈ లెక్కని ఈ బీరువాని **బయటికి** లాగేటప్పటికి ఓ నాలుగు గంటలు పట్టేలాగుందోయ్. మనవల్లకాదు...
చంపేశారు. ఇందాకటినించీ చెప్పరేమిటండీ **బయటికి** లాగాలని? నేను ఇందాకటి నించి బీరువాని **లోపలికి** తోస్తున్నాను

# న్యూస్ వ్యూస్

## నూతన గాయనీ గాయకులకు ఆహ్వానం-అవకాశం

'అమ్మలు' చిత్రం ద్వారా నటునిగా కూడా పరిచయం అవుతున్న గాయకుడు, సంగీత దర్శకుడు వందేమాతరం శ్రీనివాస్ ఆధ్వర్యంలో నూతన గాయనీ గాయకులకు అవకాశం రానున్నది. డిసెంబర్ 29 ఆదివారం హైదరాబాద్‌లో జరగబోయే ఈ పోటీలో పాల్గొనగోరే గాయనీ గాయకులు 'అమ్మలు' చిత్రంలోని రెండుమూడు పాటలను ఆర్కెస్ట్రా లేకుండా ఒక ఆడియో క్యాసెట్‌లో పాడి, తమ



అడ్రసులను కూడా ఆ క్యాసెట్‌లోనే రికార్డు చేసి 'వందేమాతరం శ్రీనివాస్, అన్నా ఆడియో ల్యాబ్, ఫిలింనగర్, హైద్రాబాద్-33' అనే అడ్రసుకి డిసెంబరు 23వ తేదీలోగా పంపాలి. పోటీకి ఎంపికైన వారికి వారు డిసెంబరు 29న ఏ స్థలానికి రావలసి ఉంటుందో నిర్వాహకులు తెలియ చేయడం జరుగుతుంది. వారికి ప్రయాణవసతి సౌకర్యాలు కల్పిస్తారు. పోటీలో 'అమ్మలు' సినిమాలోని ఏ పాటనైనా పాడవలసివుంటుంది. వాటితో పాటు ఒక మెలొడీ సాంగ్‌ని, ఒక ఫాస్ట్‌బీట్ సాంగ్‌ని కూడా పాడవలసి వుంటుంది. ప్రముఖ సంగీత దర్శకులు ఈ పోటీకి న్యాయ నిర్ణేతలుగా వ్యవహరిస్తారని, ఇందులో ఎంపికైన గాయనీ గాయకులకు వందేమాతరం శ్రీనివాస్ తన తర్వాతి చిత్రాలలో అవకాశాన్నిస్తారని 'అమ్మలు' చిత్ర నిర్మాతలు కె.మంజుల, డా॥వై.సుగుణ కుమారి, కె.కోటీశ్వరి తెలిపారు.

## 'ఒక్కడు'లో మణిశర్మ కెరీర్ బెస్ట్‌సాంగ్స్

దేవి, దేవీపుత్రుడు, మనసంతా నువ్వే, నీస్నేహం, వంటి చిత్రాలను నిర్మించిన నిర్మాత ఎమ్మెస్ రాజు సంక్రాంతి కానుకగా విడుదల చేయబోతున్న చిత్రం- 'ఒక్కడు' ఇందులో మహేష్‌బాబు, భూమిక, ప్రకాష్‌రాజ్ ప్రధాన తారాగణం. హైదరాబాద్‌కి 30కి॥మీ॥ దూరంలో ఈ



సినిమాకోసం వేసిన చార్మినార్ సెట్‌కి దాదాపు 2కోట్లు ఖర్చయిందని ఓ అంచనా. అందుకే లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో నమోదు అయింది కూడా! ఈ సెట్‌లో ఇటీవల ఓ పాటను చిత్రీకరించారు. ఆపాట నైట్‌ఎఫెక్ట్‌లో చిత్రీకరిస్తే బాగుంటుందనుకోవటంవల్ల 18 జనరేటర్లు కావలసివచ్చాయి. 10 రాత్రులపాటు షూటింగ్ జరిపారాపాటకోసం.

"మణిశర్మ తన లైఫ్‌టైమ్‌లో దిబెస్ట్ అనదగ్గ 6పాటలను అందించాడు" అని అన్నారు నిర్మాత ఎమ్మెస్ రాజు. ఈ సినిమాలో ఒక 'ల్యాడర్‌ఫైట్' ఉంది. ఆఫైట్‌లో మహేష్‌బాబు పెర్ఫార్మెన్స్ చూసి అద్భుతమైన రీరికార్డింగ్ చేశాడు మణిశర్మ అని కూడా చెప్పారాయన. ఈ సంచిక మీరు చదివే టైమ్‌కి 'ఒక్కడు' ఆడియో సుప్రీమ్ వారి ద్వారా విడుదలయి మార్కెట్లో ఉంటుంది.

## కర్నూలులో 'హాసం' సమావేశం

గత పక్షం డిసెంబరు 1న సాయంత్రం ఘంటసాల జయంతి సందర్భంగా కర్నూలులో ఘంటసాల అభిమాన సమితి ఏర్పడి హాసం పత్రిక సంపాదక వర్గంతో ఇష్టాగోష్టి సమావేశం ఏర్పాటు చేసింది. జిల్లా కేంద్ర గ్రంథాలయం ఛైర్మన్ శ్రీ కె.జి. గంగాధరరెడ్డి సభకు అధ్యక్షత వహించగా, శ్రీ.బి.సత్యనారాయణ రావు (ఘంటసాల అభిమాన సమితి వ్యవస్థాపకులు) ఆధ్వర్యంలో ఈ సభ బి.వి.ఆర్. ఇంగ్లీషు మీడియం హైస్కూల్ ఆవరణలో జరిగింది.



సభికులతో ఎం.బి.ఎస్.ప్రసాద్, కె.వి.రావు, గంగాధర్ రెడ్డి, రాజా, బి.ఎస్. రావు

నగరంలోని పలువురు సంగీతాభిమానులు హాజరైన ఈ సభలో 'హాసం' తరపున శ్రీ రాజా (ఎడిటర్) శ్రీ ఎం.బి.యస్. ప్రసాద్ (మేనేజింగ్ ఎడిటర్) డా॥ కె.వి.రావు (రిఫరెన్స్ కర్టెసీ) లను కార్యదర్శి ఎస్.వి. రమణమూర్తి వేదికపైకి ఆహ్వానించారు.

శ్రీ సత్యనారాయణరావు సమితి ఆశయాల గురించి వివరించారు. ఘంటసాల జయంతి, వర్ధంతి నిర్వహిస్తామని, విద్యార్థులకు పాటలపోటీలు నిర్వహించి ఘంటసాల అభిమానులందరికీ కావలసిన సమాచారాన్ని అందుబాటులో ఉంచుతామని హామీ ఇచ్చారు. తరువాత శ్రీ ప్రసాద్ 'హాసం' పత్రిక సంగీతానికై చేస్తున్న కృషి దాని పురోభివృద్ధి గురించి వివరించారు. డా॥కె.వి.రావు ఘంటసాల పాటలపై ప్రపంచ వ్యాప్తంగా జరుగుతున్న కృషిని వివరించి, కర్నూలు ఘంటసాల అభిమాన సమితికి అరుదైన ఫోటోల సెట్టు అందజేస్తానని తెలియపరిచారు. అధ్యక్షులు శ్రీ గంగాధరరెడ్డి 'వింటే ఘంటసాల పాటలు వినాలి, చూస్తే ఎన్.టి.ఆర్. సినిమాలు చూడాలి' అంటూ కొన్ని పాటలను ప్రస్తావించి, 'హాసం' పత్రికను కర్నూలు జిల్లాలోని అన్ని గ్రంథాలయలోను లభ్యమయ్యేట్లు చూస్తానని హామీ ఇచ్చారు. సభకులలో ఒకరైన శ్రీ సురేష్‌వర్మ సమితికి వెయ్యి రూపాయల విరాళం ఇస్తూ, తమ స్కూలు విద్యార్థులకు చిన్నతనంలోనే మంచి అభిరుచి అలవరచేందుకు స్కూలు ఆడిటోరియంలో సమావేశం జరుపమని 'హాసం'ను ఆహ్వానించారు. అనంతరం శ్రీ రాజా సభికులు సంగీతంపై లేవనెత్తిన అనేక ప్రశ్నలకు సమాధానాలు ఇచ్చారు. సభానంతరం సమితి సభ్యులు, శ్రీ బి.సి. కృష్ణ ఘంటసాల పాటలను పాడి సభికులను రంజింపచేశారు.

## కొంటెకొశ్చెన్లు-తుంటరి జవాబులు




**వి. మంజురాణి - హైదరాబాద్**

❖ నా మొగుడొట్టి సత్యకాలపు వాడు అని అనుకునే ఆడదెవరు?

✦ రుక్మిణీదేవి

**నిశాపతి- హైదరాబాద్**

❖ ఆచార్య తిరుమల పద్యాలు రాయగలరా?

✦ ఎందుకు రాయరు? జాగ్రత్తగా చూడండి ఆయన పేరులోనే యతి ఉంది.

**ఎస్కే రావు-అరకు**

❖ పాత తెలుగు సినిమాలు చూసే వ్యక్తిని ఏదైనా ప్రశ్నిస్తే ఎలాటి సమాధానం వస్తుంది?

✦ అన్నిటికీ ఆ కాలమే సమాధానం చెబుతుంది.

## డబుల్‌రోల్



ఆ 'పార' పట్టుకున్న వాడికి 'అపారమైన' తెలివి తేటలున్నాయి

- బి.వి.రావు, హైద్రాబాద్

'అమల' చెప్పిన విషయాలన్నీ 'అమలవుతాయో' లేదో వేచి చూడాలి

-కొండల్రావు, అరకు

పవన్‌కళ్యాణ్ 'జానీ' కోసం 'ప్రజానీకం' ఎదురుచూస్తోంది.

- బేబీ మంజూష, కూకట్‌పల్లి



## చిలిపి లిపి



E.Co.D నత = ఈ కోడి ఎంత

Company-Shadow = తోడు-నీడ

Word Que = మాట వరస

- బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి

## ఈ రూటే వేరు




ఏజెంటు : ఒక మగవాడు

టీచర్లు : టీ లో తిరిగేవారు

-చైతుప్రకాష్, చందానగర్

డీటెయిల్డ్‌గా : తోక లేకుండా

-డి.పద్మినీ ప్రసాద్, విశాఖపట్నం

## చిలిపి కవిత



**శాంతి కాముకులు**

అన్ని వ్యవహారాల్లోనూ
అణ్వస్త్ర దేశాల్లా
దెబ్బలాడుకునే మేం
డబుల్‌కాట్ అనే
శిఖరాగ్ర చర్చల్లో మాత్రం
శాంతి కాముక దేశాల్లా
ఒక అంగీకారానికొచ్చేస్తాం.

-జోరాశర్మ, రాజమండ్రి

## పేరు -రిపేరు



పోలీస్ సిస్టర్స్-ఖైదీబ్రదర్స్-దొంగలు

-పేండ్రు సత్యనారాయణ, ఆర్.సి.పురం

హోయ్-శ్రీమతీ వెళ్ళొస్తా-క్షేమంగా వెళ్ళి లాభంగా రండి

- బి.శ్రీరాం, రుద్రారం

ఇడియట్-ఖడ్గం-నీకోసం-రా

-కె.యస్.వి.యస్.ప్రకాష్, సోమేశ్వరం

## పేరడీ పేరేడ్



గారెలు ఘుమఘుమలాడే
నా నోటిలో నీరేవూరే ॥గారెలు॥

వలదన్న వినదీ నోరు జిడ్డైన దాన్నేకోరు
ఉల్లిగారెలో రుచివుందిలే
అది తెలియనివారేలేరు ॥గారెలు

పెరుగ్గారె చేసిన వేళ దూరాను వంటింట్లోన
పెరుగున్నదే పులిసున్నచో తినలేము ఒక్కటి కూడా ॥గారెలు॥

(బందిపోటు సినిమాలో 'ఊహలు గుసగుసలాడే' పాటకు పేరడీగా)

**తెలికిచర్ల రామకృష్ణ**
**విజయనగరం**

# సద్దాం ఆంటీ ఇంటి కథ

సీరియల్ 22

-మల్లాది వెంకట కృష్ణమూర్తి




## జరిగిన కథ

అనన్య బామ్మ గారికి, గ్రామం అనే ఆయనకు ఆవిడ ఇల్లు గురించి కుదిరిన ఒప్పందం ప్రకారం బామ్మ బతికున్నంతకాలం ప్రతీనెలా గ్రామం డబ్బుఇవ్వాలి. బామ్మపోయాక ఇల్లు అతని స్వంతం అవుతుంది. కాలక్రమేణా గ్రామం, అతని కొడుకు [illegible] పోతారు కానీ బామ్మ ఆరోగ్యంగా ఉంటుంది. బామ్మ చస్తే ఇల్లు తన స్వంతమవుతుందని గ్రామం మనుషులలో ఒకడైన లింగమయ్య రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసే సుబ్బారావు హరకేశం అనే కిరాయి హంతకుడిద్వారా బామ్మను చంపడానికి ప్లాను వేస్తారు. హరకేశం ఓ పామును తీసుకొని రాత్రివేళ వెళుతుంటే దారిలో అతన్ని దొంగలు కట్టుబట్టలతో సహా దోచుకుంటారు. అయినా బామ్మ ఇల్లు చేరతాడు. పోలీసులు అలికిడివిని పాము కట్టిన గోనె సంచిని చెత్తకుండీలో పడేస్తాడు. దిసమొలతో ఉన్న అతన్ని పోలీసులు తీసుకుపోతే లింగమయ్య విడిపిస్తాడు.



ఆ డస్ట్ బిన్‌లో లేదా గోనెసంచీ. వెంటనే హరకేశం మొహం వాడిపోయింది.

"ఇందులోనే ఉంచాను. లేదు." చెప్పాడు పొడి గొంతుతో చుట్టూ చూసి అరిచాడు లింగమయ్య దూరంగా మూటతో వెళ్ళే చెత్తబ్బాయ్‌ని చూపిస్తూ.

"అడుగో"

ఇద్దరూ లింగమయ్య స్కూటర్ మీద వెళ్ళి సందు మలుపు తిరిగిన అతన్ని అందుకున్నారు. అతనికి అడ్డంగా స్కూటర్ ఆపి అడిగాడు లింగమయ్య.

"అక్కడ చెత్త డబ్బాలోవి ఇప్పుడు ఏరుకున్నది నువ్వేనా బాబు?

"ఔనుసార్"

"అందులో ఓ గోనెసంచి ఉండాలి. అది కానీ నువ్వు తీసావా?"

"గన్నీ బేగా సార్? తీసా సార్"

"అది మాది"

"అందులో ఏంవుంది సార్?"

"విప్పిచూళ్ళేదా?"

"ఇంకాలేదు సార్"

"శుభం. ఏదీ చూపించు. అదీ మాదో కాదో చూద్దాం" వాడు తన భుజాన వేలాడే తెల్లటి మాసిన పొడవైన సంచీలోంచి ఆ బేగ్‌ని బయటికి తీయగానే దాన్ని చూసిన హరకేశం చెప్పాడు.

"కర్నూలు అని ఎర్ర అక్షరాల్లో ఉంటుంది... అదిగో... కదులుతోంది కూడా. మనదే సార్ అది"

దాన్ని అతని చేతిలోంచి అందుకున్నాడు హరకేశం. చెత్త కాగితాలు ఏరుకునే అతను దాన్ని మళ్ళీ లాక్కుని చెప్పాడు.

"నీది కాదు. ఇది నాది"

"నీది కాదు. నాది" మళ్ళీ దాన్ని అందుకున్నాడు హరకేశం.

లింగమయ్య వాళ్ళని వారిస్తూ చెప్పాడు, జేబులోంచి ఓ వంద రూపాయల కాగితం తీసి.

"ఇందు"

చెత్తబ్బాయ్ ఆ వంద కాగితం వంక, ఆ గన్నీబేగ్ వంక మార్చి మార్చి చూసి, మారు మాట్లాడకుండా గబుక్కున గన్నీబేగ్‌ని మళ్ళీ అందుకుని చటుక్కున వాడి సంచిలో వేసుకున్నాడు.

"ఆ బేగ్ ఖరీదు వంద కూడా చేయదు" చెప్పాడు లింగమయ్య చిరాగ్గా.

"లోపల ఏముందోకాని న్యాయంగా చూసి ఇవ్వండి సార్" చెప్పాడు చెత్త కాగితాలమ్ముకునేవాడు.

"ఇంకో పది తీసుకో"

"కుదరదు"

"పోనీ ఇరవై"

"ఊహూ"

"పోనీండి. రాత్రిలోగా మా గ్రామం వెళ్ళి ఇంకోటి తెచ్చుకుంటాలెండి" చెప్పాడు హరకేశం.

రెండు వంద కాగితాలు చూపించి చెప్పాడు లింగమయ్య.

"ఇస్తే ఇవి తీసుకుని ఇవ్వు. లేదా ఎవరిదారి వాళ్ళది"

వాళ్ళ మాటల్లోని స్థిరత్వం గమనించాక చెత్త కాగితాలవాడు వెనక్కి తిరిగాడు వెళ్తున్నట్లు నటిస్తూ. పదడుగులు వేసినా వాళ్ళనుంచి పిలుపు రాకపోవడంతో ఆగి వెనక్కి తిరిగిచూసాడు.

**ఫోర్జరీ బాక్‌గ్రౌండ్‌తో క్రైం సీరియల్ రాసిన రచయితకి పారితోషికంగా పంపిన పాతిక వేల రూపాయల చెక్ పాతిక లక్షలుగా ప్రజెంట్ అయిందిట. అలాగే కోటి రూపాయల బంగ్లా కోసం జరిగే సరదా కుతంత్రం ఏమిటో ఈ సీరియల్‌లో చదవండి**

అప్పటికే స్కూటర్‌ని వెనక్కి తిప్పేసాడు లింగమయ్య. హరకేశం వెనక ఎక్కుతున్నాడు.

"సరే, తీస్కపోండి దొర" అరిచాడు వాడు.

డబ్బు, సంచీలు చేతులు మారాక హరకేశం స్కూటర్ వెనక ఎక్కగానే చెప్పాడు లింగమయ్య.

"ఆ సంచీని కాస్తంత దూరంగా జరిపి పట్టుకో, నీకు పుణ్యం వుంటుంది"

హరకేశాన్ని అతనింటి దగ్గర దింపాడు లింగమయ్య.

* * *

లింగమయ్య చెప్పేదంతా ఎంతో అసహనంగా, అసంతృప్తిగా విన్నాడు సుబ్బారావు. మొత్తం విన్నాక చెప్పాడు.

"నాకీ వైఫల్యం నచ్చలేదు. ఓటమన్నది ఇలాంటి విషయంలో రాకూడదు."

"వైఫల్యం అంటే ఓటమి కాదు సార్, జాప్యం మాత్రమే. ఈ రాత్రికి పనవుతుంది. మీరు నిశ్చింతగా వుండండి" సర్దిచెప్పాడు లింగమయ్య.

"ఇంతకీ బామ్మ ఇంకా బ్రతికే వుందన్నమాట?"

"అవును సార్"

"ఛ! బాడ్‌లక్, సమయానికి ఆ దొంగలు వచ్చి హరకేశాన్ని అటకాయించాలా?"

"చాలా బాడ్‌లక్ సర్"

"నువ్వు పెట్టిన 'సద్దాం ఆంటీ' పేరు ఊరికే పోనిచ్చుకోలేదావిడ. నిన్న రాత్రి చావు తప్పించుకుని సార్థక నామ ధేయురాలైంది."

"బాగా సర్"

"హరకేశం ఈ రాత్రికైనా పని అవుతుందన్నాడా?"

"ఖచ్చితంగా అవుతుందని చెప్పాడు సర్"

"సరే. ఎలాగోలా ఈ రాత్రికి ఆవిడని పైకి పంపేయమను... పోలీసులేం అనుమానించ లేదుగా?"

"లేదు సార్, నేను స్వయంగా ఆ ఇన్‌స్పెక్టర్‌తో మాట్లాడాను. అర్ధరాత్రి దుస్తులు లేకుండా పబ్లిక్ రోడ్డు మీద తిరుగుతున్నందుకు పట్టుకున్నాడు. లక్కీగా ఆ పాము వాళ్ళ నోటీస్‌కి రాలేదు. వచ్చివుంటే ప్రాబ్లం అయేది"

"వెరీగుడ్"

"హరకేశాన్ని పోలీస్ కస్టడి నించి విడిపించడానికి అయిన మొత్తం మనం వాడికివ్వాల్సిందాంట్లో జమచేసుకుందాం సర్"

"అలాగే"

"కొత్త టైపిస్ట్ సమర్థవంతంగా పనిచేయడం లేదు సర్. మొన్న చీఫ్ మినిస్టర్‌కి రాసిన లెటర్‌లో



స్పెల్లింగ్ తప్పు కొట్టింది సర్, -చీఫ్ మినిస్టర్. అని నేను చూసుకోకపోతే అదలా వెళ్ళుంటే, మనకి ఇక సి.యం. నించి ఎలాంటి ఫేవర్లూ వచ్చి వుండేవి కావు సార్."

"అరెరె! అలాగా?"

"ఆ అమ్మాయిని తీసేసి కొత్త టైపిస్టుని అపాయింట్ చేద్దాం సర్. ఇరవై ఏడేళ్ళ అనుభవం గల మిస్ సీతాదేవి ఒక్క అక్షరం తప్పు లేకుండా టైపు చేస్తుంది సార్"

"ఒద్దొద్దు... ఈ అమ్మాయినే ఉండనీ"

"సర్"

"ఆమె టైప్ చేసిన ప్రతీ లెటర్ పర్సనల్‌గా నువ్వే తప్పొప్పులు చూస్తుండు"

"సర్"

"మిస్ సీతాదేవి వద్దు"

"సర్"

"ఈ అమ్మాయినే వుండనిద్దాం"

"యస్ సర్"

'గ్రామర్ కన్నా గ్లామరే గొప్ప' అనుకున్నాడు లింగమయ్య మనసులో నవ్వుకుంటూ.

* * *

ఆ తెల్లవారు ఝామున వాసవి భర్త క్యాంపు నుంచి వచ్చాడు. అతన్ని చూసి సంతోషించింది వాసవి. పదిహేను రోజుల విరహాన్ని తీర్చుకుంది.

ఉదయం రాజుని స్కూల్‌కి పంపడానికి తయారు చేసింది. రాజుని ఎక్కించుకుని స్కూల్‌కి వెళ్ళిన రామ్మూర్తి రాజుతో మళ్ళీ వెనక్కి తిరిగి వచ్చేసాడు.

స్కూటర్ దిగి లోపలకి వచ్చిన రాజు తల్లితో ఆనందంగా చెప్పాడు.

"ఇవాళ మాకు స్కూలు లేదోచ్"

"ఏం?"

"నే చెప్పలా మా ఆయా నిన్న చస్తుందని. ఆమె నిన్న రాత్రి నిజంగా చచ్చిందోచ్. దాంతో మాకు స్కూల్‌కి సెలవిచ్చారోచ్"

"ఏమిటి? మరియమ్మ పోయిందా?"

"అవును. అకస్మాత్తుగా నిన్న అర్ధరాత్రి ఛాతిలో నొప్పి వస్తే, హాస్పిటల్‌కి తీసుకెళ్ళారుట. రెండు గంటలు ఐ.సి.యూ.లో ఉన్నాక పోయింది. హార్ట్‌అటాక్. డాక్టర్లు విశ్వప్రయత్నం చేసారుట" చెప్పాడు రామ్మూర్తి.

వెంటనే వాసవి మొహం పాలిపోయింది. ఆమె పెదవులు వణకసాగాయి. భయంగా భర్త చేతిని పట్టుకుని చెప్పింది.

**డే టైం ఆక్సిజన్ పీలుస్తాం. మరి నైట్ టైం?**
**నైట్రోజన్**
**నిజం కాకపోయినా తర్కానికిది నిలుస్తుంది. అలాగే నిజం కాకపోయినా తర్కానికి నిలిచే కామెడి ఇతివృత్తం గల 'సద్దాం ఆంటీ ఇంటి కథ' ఈ ఇన్‌స్టాల్‌మెంట్ చదవండి. క్లైమాక్స్ వైపు పరుగెడుతోంది మరి!**

"రాజు ఈ సంగతి ముందే చెప్పాడు. అది నిజంగా నిజమైంది"

"ఏమిటి నువ్వనేది?"

"ఫోన్‌లో మీకు చెప్పలా? రాత్రి సాయిబాబా కల్లో కనబడి రాజుకి ఏం చెప్తే, అది తు.చ. తప్పకుండా ఇంతదాకా జరుగుతోంది. మొన్న రాత్రి మరియమ్మ పోతుందని చెప్పాడని నిన్న రాజు చెప్పాడు."

అతను మాట్లాడలేదు.

"ఎందుకిలా అవుతోందసలు?"

"నాన్సెన్స్. ఇదంతా కాకతాళీయంగా, ఏక్సిడెంటల్‌గా జరిగింది. అంతే తప్ప మరేం కాదు."

"ఓ మనిషి చావు, ఓ బల్లి చావు ముందే అంత ఏక్సిడెంటల్‌గా ఎలా చెప్పగలిగాడు?"

"వాడేం గొప్ప సాయిభక్తుడు కాదుగా, పోనీ నిజంగా సాయిబాబా చెప్తున్నాడంటే ........."

ఆ విషయం మీద భార్యాభర్తలిద్దరూ చాలాసేపు చర్చించుకున్నారు. రామ్మూర్తికి నిశ్చింతగావుంది కాని వాసవికి గుండెలో భయం గూడుకట్టుకుంది.

* * *

బామ్మ సన్నగా ఈల వేసుకుంటూ, ఆరోజు ఏ ఛానల్‌లో ఏటైంలో ఏ సినిమా వస్తుందో చూడడానికి దినపత్రికల్లోని టి.వి.గైడ్ సెక్షన్‌ని తిరగేసింది. ఒక్కో సినిమా పేరు బయటికి చదువుతూ కామెంట్ చేయసాగింది.

"రాంబంటు... ప్చ్ అందుకే తగలేసాడు... జూలీ

"థియేటర్లు ఖాళీ.... పాడుతా తీయగా.... చూడలేం హాయిగా...

"ఆటో డ్రైవర్... ఒన్‌నాట్ ఎయిట్ ఫేవర్... మావిడాకులు... పూజకి పనికిరావు.... దేవుడు.... బాబోయ్ శపిస్తాడు నిప్పురవ్వ... చెయ్యికాల్తుంది..."

"ఏమిటిబామ్మా, ప్రతి సినిమాకి ఏదోవంక పెడుతున్నావు? ఫ్రీగా వచ్చేవేగా, చూడచ్చుగా" అడిగింది అనన్య బాంక్‌కి బయలుదేరుతూ.

అనన్యతో చెప్పింది బామ్మ ముసిముసి నవ్వు నవ్వుతూ.

"నీకో జోస్యం చెప్పనా?"

"ఏమిటి బామ్మా?"

"ఇవాళ మీ కొలీగ్... ఆ కుర్రాడి పేరేంటన్నావ్? ఆఁ... నిరుపమ్ నీతో 'ఐ లవ్ యూ' అంటాడు"

"నీకెలా తెలుసు బామ్మ"

"ఇవాళ ఆఖరి కవర్ అతనికి అందుతుంది కాబట్టి"

"ఆఖరి కవరా?"

"అవును. కొన్ని వారాలుగా నీ ఫోటో ముక్కలని ఒకటొకటిగా 'ఐ లవ్ యు' అన్న కాగితంతో అతనికి పోస్ట్ చేస్తున్నాను. ఇవాళ అందే ముక్కతో నువ్వేనని గుర్తు పడతాడు"

"బామ్మా!?"

"బామ్మ అంటూ ఏమిటా గావుకేక? నీకేం తక్కువని ఇంతదాకా నిన్నెవరూ ప్రేమించడం లేదు? ఏ రాజశేఖరమో నీ మీద మనసు పారేసుకున్నాడని చెప్తావని ఎంతకాలం నుంచి ఎదురుచూస్తున్నానో తెలుసా? నా అచ్చట, ముచ్చట తీరాలంటే నేనే ఏదైనా చెయ్యాలనిపించి ఇది చేసాను"

"నువ్వుత్త ఇడియట్‌వి బామ్మా"

"నేను కాదు మీ బాంక్‌లోని మగ కొలీగ్స్. మగ



కస్టమర్స్. ఒక్కరంటే ఒక్కరు నీతో 'ఐ లవ్‌యు' అన్నారా, ఇడియట్స్ కాకపోతే?''

"ఛా! అవి నిజంగా నేనే పంపించాననుకుంటాడు నిరుపమ్''

"అనుకోవాలోయ్ పిచ్చిమొహమా. నీ పెళ్ళి నాకళ్ళారా చూస్తే చాలు. హాయిగా హరీ మంటాను''

"బామ్మా! నిన్నింకెలా తిట్టాలో నాకర్థం కావడం లేదు''

"పిచ్చిమొహమా, నీ సంగతి నాకు తెలీదా? నీ అంతట నువ్వు ఎవర్నీ ప్రేమించే ధైర్యం లేదు. ఆ పని ఎవరైనా చేస్తే ఓకే అనాలి నీలాంటి వాళ్ళు. ఆ నిరుపమ్‌కి ఏం తక్కువ? కాబోయే భర్తలో ఏఏ లక్షణాలు, సదుపాయాలు ఉండాలో అవన్నీ అతనిలో వున్నాయి. మనిషి కూడా బావుంటాడు. నువ్వు చెప్పిందాన్ని బట్టి నువ్వంటే, అంతో ఇంతో ఇది కూడా ఉంది కూడా. నింపాదిగా, పాజిటివ్‌గా ఆలోచించి చూడు. పోనీ ఇది నేను నీకు కుదిర్చిన సంబంధం అనుకో''

అనన్య ఇంట్లోంచి బయటకి వచ్చి ఓ ఆటో ఎక్కి బాంక్‌కి చేరుకుంది.

* * *

బాంక్‌కి వెళ్ళేదారిలో లింగమయ్య ఇంటికి వెళ్ళాడు నిరుపమ్.

''ఏమయిందా పెద్దన్నా?'' అడిగాడు ఉత్సాహంగా.

"లేదురా'' నీరసంగా చెప్పాడు లింగమయ్య.

"అదేం?''

"నిన్న ఏదో అపశకునం జరిగింది. ఇవాళ రాత్రికి ఆ పనైపోతుంది. జస్ట్ ట్వంటీఫోర్ అవర్స్ లేటు. అంతే''

"ఇవాళ రాత్రికి ఖచ్చితంగా అవుతుందా?''

"అవుతుంది''

వదిన ఇచ్చిన కాఫీ తాగి బాంక్‌కి బయలుదేరాడు. తనకా ఇంటి అమ్మకం ద్వారా లక్షలు వస్తే, ఎంచక్కా అనన్య తనని ప్రేమిస్తుంది అనుకోసాగాడు.

* * *

ఆటోలో వెళ్తున్న అనన్య బామ్మ చేసిన హితబోధ గురించి కొద్దిసేపు ఆలోచించింది. నిజమే తనంతట తానుగా ఎవర్నీ ప్రేమించలేదు. నిరుపమ్ బామ్మకు చెప్పినట్లుగా పాజిటివ్‌గా ఆలోచించి చూడాలనుకుంది.

మంచి ఉద్యోగం, మంచి జీతం, మంచి పర్సనాలిటీ, పైపెచ్చు తనంటే ఇష్టం. అదీ తనకి డైరెక్ట్‌గా చెప్పలేని మెతకతనం. ఆస్తిపాస్తుల గురించి మాత్రం తెలీదు.

ఇంతకాలం తనకో కోటి రూపాయలు ఖరీదు చేసే ఇల్లుంది అనుకుంటోంది. కాని బామ్మ దాన్ని 'ఫుల్‌స్టాప్ తీసేసిన జి.రామం' అయిన గ్రామానికి వింత పద్ధతిలో ఎప్పుడో అమ్మేసింది.

కాబట్టి తనిప్పుడు వెనక ఆస్తిపాస్తులు లేని కేవలం బాంక్ ఉద్యోగిని మాత్రమే. తనకింతకంటే, మంచి సంబంధం వస్తుందా? అప్పు చేసి తప్ప కట్నం ఎక్కడ నించి తెచ్చివ్వగలదు? అనన్య మొదటిసారిగా తన భవిష్యత్తు గురించి సీరియస్‌గా

**కాకినాడలో కొత్తగా నగల దుకాణాన్ని తెరిచిన కనకారావుని పోలీసులు ఎందుకు అరెస్టు చేసారు?**
**అర్థరాత్రి గునపంతో తెరిచాడు కాబట్టి.**
**ఈ ప్రశ్నకి జవాబు చెప్పండి. హైద్రాబాద్ పోలీసులు హరకేశాన్ని ఎందుకు అరెస్టు చేసారు.**
**సరదా సమాధానం కోసం ఈ సీరియల్ చదవండి.**

ఆలోచించిందారోజు.

అనన్య బాంక్ ముందు ఆటో దిగి డబ్బు ఇస్తూండగా స్కూటర్ మీద వచ్చిన నిరుపమ్ తారసపడ్డాడు.

''హలో గుడ్‌మార్నింగ్'' చిరునవ్వుతో చెప్పాడతను అనన్యని చూసి.

"హలో గుడ్ మార్నింగ్" బదులు చెప్పింది అనన్య కూడా నవ్వుతూ

"మీకో సంగతి చెప్పనే లేదు నేనింతదాకా'' చెప్పాడు నిరుపమ్.

"ఏమిటి?''

"నాకో నెల, రెండు నెలల్లో పాతిక లక్షల దాకా క్యాష్ రాబోతోంది''

"రియల్లీ? కానీ గోల్డెన్ షేక్‌హ్యాండ్‌కి మీకింకా ఎలిజిబిలిటీ రాలేదు కదా? అదీకాక మన బాంక్‌కా స్కీమ్ లేదే''

"మాకో పెద్ద బంగ్లా ఉందని మీకు చాలా సార్లు చెప్పాను. గుర్తుందా?'' అడిగాడు.

"గుర్తుంది''

"దాన్ని ఓ బిల్డర్‌కి అమ్మేస్తున్నాం. నా వాటా పాతిక లక్షలకి తగ్గదు. దాన్ని ఇంట్రెస్టుకి వేసుకుంటే, ఏడాదికి రెండు లక్షలకి తక్కువ రాదు. వెంటనే ఓ ఫ్లాట్ కొని ఆ వడ్డీని దాని ఇన్‌స్టాల్‌మెంట్స్‌కి చెల్లించాలని నా ప్లాన్. అందువల్ల ఫ్లాట్‌మీద ఏడాదికో లక్ష దాకా అద్దె వస్తుంది. అప్పు తీరాక ఫ్లాట్ స్వంతమౌతుంది. అద్దె ఏడాదికి లక్ష వస్తుందా, పైగా ఆ రెండు లక్షల వడ్డీ కూడా కలిస్తే ఏడాదికి మూడు లక్షలు అదనపు ఆదాయం. అంటే నెలకి పాతిక వేలన్నమాట. అంటే నాకు ఇంకో జీతం అంత వస్తుందన్నమాట. దానిమీద మీ సలహా ఏమిటి?''

"ఫైనాన్స్ మేటర్లలో మా బామ్మ చక్కటి సలహా ఇవ్వగలదు తప్ప నేను కాదు''

"అలాగా? అయితే ఓసారి మీరు ఆవిడ దగ్గరికి నన్ను తీసుకెళ్ళరాదూ!''

"తీసుకెళ్తాను. ఎన్నోసార్లు మీరు నన్ను మా ఇంటికి తీసుకెళ్ళమన్నారు. కాని నేనే అశ్రద్ధ చేసాను. రేపు వచ్చే ఆదివారం వద్దురు గాని. ఎడ్రస్ ఇస్తాను.''

"అలాగే. థాంక్స్''

"దీనికి థాంక్సెందుకండి?''

అతని పక్కన బాంక్‌లోకి నడుస్తూంటే, అనన్యకి అనిపించింది, ఇద్దరి ఒడ్డు పొడుగు సరిగ్గా సూట్ అయ్యాయని...

**(ఇంకావుంది)**



# వినికిడి శక్తి కోల్పోయినా వీనుల విందైన సంగీతాన్నిచ్చిన బెథోవెన్

"చక్రవర్తులెందరో ఉన్నారు గానీ బెథోవెన్ మాత్రం ఒక్కడే" అని,"తనకు లేరెవ్వరూ సాటి" అని మేధావులతో వ్యాఖ్యానింపజేసుకున్న విశ్వవిఖ్యాత సంగీత వేత్త బెథోవెన్. బెథోవెన్ అనగానే సంగీతాభిమానులకు ముందుగా గుర్తొచ్చేది ఆయన కూర్చిన సింఫోనీలు. వాటిలో ప్రధానంగా 9వ సింఫోనీ.

B బెథోవెన్ పూర్తి పేరు "లుడ్విగ్‌వాన్ బెథోవెన్". ఆయన తాత బాన్ (జర్మనీ) లోని కోలాన్ రాజదర్బారులో ఆస్థాన విద్వాంసుడు. వీరి పూర్వులు జర్మనీ, ఫ్రాన్స్ సరిహద్దుల్లో ఒకనాడు చిన్న స్వతంత్ర రాజ్యంగా ఉన్న ఫ్లాండర్స్ నుండి వలస వచ్చి బాన్‌లో స్థిరపడ్డారు. బెథోవెన్ తండ్రి జాన్‌వాల్ బెథోవెన్ గొప్ప వయొలెనిస్టు. ఆయన 1767లో ఒక వితంతువును పెళ్ళాడారు. వారి తొలి సంతానంగా మన బెథోవెన్ 1770 డిసెంబర్ 17న జన్మించారు. బాల్యంలో తాతగారి దగ్గరే చనువు పెరిగి ఆయన వద్దనే తొలి సంగీత పాఠాలు నేర్చుకున్నారు. తాగుబోతుగా మారిన తండ్రికి దూరంగా మసలే వారు. అయితే సంగీతం విషయంలో మాత్రం ఆయనకు తండ్రి తాతలే ఆదర్శం. తాతగారి సహచరుడైన "క్రిస్ చయన్ నీఫే" వద్ద శిష్యరికం చేశారు. ఫలితంగా 11వ ఏటనే రాజా స్థానంలో సహాయ సంగీతకారునిగా నియమితులైనారు.

B సంగీత పరంగా బెథోవెన్ జీవితాన్ని మూడు దశలుగా విభజించవచ్చు. మొదటిది తన వెనుకటి తరం వారైన 'మొజార్ట్', 'హైడెన్' వంటి వారి సంగీత ప్రభావాలకు లోను కావడం (1802 దాకా). రెండవది (1802-1812) క్రమంగా తాను వినికిడి శక్తిని కోల్పోయి చెవిటివాడవటం. అయితే ఈ కాలంలోనే తన సంగీతానికి విస్తృత రూపమిచ్చి గొప్ప గొప్ప కంపోజింగ్స్ చేశాడాయన. ఇక మూడవది (1813-1827) తన సంగీతశైలిని పూర్తిగా మార్చి తొమ్మిదవ సింఫోనీని సృష్టించి ప్రపంచ సంగీత చరిత్రలో సంచలనానికి కారకుడవడం.



Music becomes a higher revolution than Philosophy
- Beethoven

## వియన్నా పయనం

B సంగీత శిక్షణ కోసం 1787లో ఆస్ట్రియా రాజధాని వియన్నా చేరడంతో బెథోవెన్ జీవితం మలుపు తిరిగినట్లయింది. ఒక రకంగా చెప్పాలంటే అప్పటినుండి వియన్నాయే ఆయన శాశ్వత చిరునామా అయింది. వియన్నాలో "మొజార్ట్" దగ్గర ఏడాదికి పైగా శిష్యరికం చేశారు. 1789లో తల్లి మరణంతో జర్మనీకి తిరిగివచ్చిన ఆయన అయిదేళ్ళ పాటు ఇంట్లోనే సంగీత సాధనచేసి తనకు తాను మెరుగులు దిద్దుకున్నారు. 1792లో తండ్రి మరణించే నాటికి బెథోవెన్ వియన్నాలో స్థిరపడిపోయారు. మొజార్ట్ మరణం తరువాత వియన్నాలో ప్రజలు ఆయనను మరిచేలాగా, సంగీత సృజన చేశారు. అలా పుట్టినవే 'క్లామెంటీ', 'క్రామర్' అనే సంగీత రూపకాలు. మరో వైపు 1792-94ల మధ్య హైడెన్ వద్ద శిక్షణ పొందారు కూడా. ఇవన్నీ క్రమంగా బెథోవెన్ పురోభివృద్ధికి తోడ్పడినవి. 1796లో ప్రాగ్, డ్రెస్‌డెన్, బెర్లిన్, ప్రెస్‌బర్గ్, లెపిజిగ్ నగరాలలో సంగీత కచేరీలు చేసి ఒక్కసారిగా ఎదిగిపోయారు.

B తనలోని భావోద్వేగాలను అభివ్యక్తీకరించడానికి పియానోపై పలికించే స్వరాలనే మాధ్యమంగా చేసుకున్న బెథోవెన్ వస్తుగుణాత్మకమైన లయభరిత రీతిలో సంగీత సృజన చేసేవారు. 1801 నాటికి ఆయన మొజార్ట్, హైడెన్‌లను మరిపించే స్థాయికి ఎదిగారు. వియన్నాలో స్థిరపడిన రెండో దశాబ్దం నాటికి గొప్ప పియోనిస్టుగా, కంపోజర్‌గా గుర్తింపు నొందారు. అప్పటికాయన వయసు ముప్పై ఏళ్ళే.

B ఉన్నత స్థితికి చేరుకున్న ఈ తరుణంలోనే బెథోవెన్ క్రమంగా తన వినికిడి శక్తిని కోల్పోనారంభించారు. వైద్య చికిత్స పొందినా ప్రయోజనం లేకపోయింది. దాంతో 1802 నాటికి పూర్తిగా బధిరుడై పోయాడాయన. సంగీతమంటే ప్రాణమిచ్చే ఓ కళాకారుడికి ఇంతకన్నా దురదృష్టకరమైన స్థితి మరొకటి ఉండదు. వినికిడికి దూరమవుతున్న తొలిదశలోనే (1800)లోనే తొలి సింఫోనీని వెలువరించగా మంచిస్పందన లభించింది. బధిరత్వం వల్ల కలిగిన మనోవేదనతో నలుగురి మధ్యకు వెళ్లడం మాని ఒంటరిగా కూర్చొని సంగీతమే ప్రపంచంగా తన జీవితాన్ని మలుచుకున్నారు. అంతవరకు వియన్నా నగరం నడిబొడ్డున నివసించే బెథోవెన్ శివారు ప్రాంతమైన హెలిజెన్ స్టాడ్‌కు మకాం మార్చారు.

## సింఫోనీ సృష్టికర్తగా....

B శబ్ద ప్రపంచానికి దూరమవడం బెథోవెన్‌కు ఒక రకంగా వరమే అయింది. సంగీతంపై అంతర్గత ఆలోచనలకు పదును పెట్టారు. బాహ్య ప్రపంచాన్ని దూరం చేసుకుని తనను తాను మరిచిపోయి మనో ప్రపంచంలో స్వేచ్ఛగా విహరించారు. తన కళాలోకంలో హృదయ ప్రకంపనలు చేసే వినూత్న స్వరసమ్మేళనాలను కనుగొన్నారు. 1801-1816 మధ్యకాలం బెథోవెన్ సంగీత చరిత్రలోనే అత్యున్నత దశ. 1802లో రెండవ సింఫోనీని రూపొందించారు. అది సంగీత ప్రపంచంలో ఒక వినూత్న ఒరవడికి శ్రీకారం చుట్టింది. ఆ వెంటనే మూడవ సింఫోనీ కూర్చి నెపోలియన్‌కు అంకితమివ్వగా దాన్ని ఆయన తిరస్కరించారు. ఈ మూడవ సింఫోనీ నిజానికి హైడెన్‌ను డామినేట్ చేసే గొప్ప సంగీత సృష్టి. నెపోలియన్ తిరస్కరించినా, దీనిని మిలిటరీ ఉత్సవాల్లో అంత్యక్రియలకు వాయించినా, ఎందరో ఈ సింఫోనీని అనుసరించి మరిన్ని కొత్త కంపోజింగ్స్‌ని కనుగొని పేరు తెచ్చుకున్నారు. ఆ తరువాత

నాలుగు, అయిదు, ఆరు, ఏడు, ఎనిమిది సింఫోనీలను కంపోజ్ చేశారాయన. వీటిలో 1811-12 కాలంలో రూపొందిన ఏడు, ఎనిమిది సింఫోనీలను "బాటిల్ సింఫోనీ"గా పిలిచేవారు. పలు రకాలైన సంగీత సాధనాల మధ్య అంటే ఆర్కెస్ట్రాకు సింఫోనీకి మధ్య అద్భుతమైన సమన్వయాన్ని సాధించారు. ఈ రెండు సింఫోనీలతో బెథోవెన్ వియన్నా కాంగ్రెస్‌లో గొప్ప పాపులారిటీని సంపాదించుకున్నారు. ఇక్కడ ఆయన ఆరవ సింఫోనీ గురించి కూడా కాస్త చెప్పుకోవాలి. ఇది మానవుల్లోని సహజమైన క్రూరాత్మక భావాలను సైతం మరిపించే విధంగా వర్డ్స్ వర్త్ కవుల ప్రేరణతో గ్రామీణ సంగీత శైలికి దర్పణం పట్టింది.

B అయితే ఇంతలో "రాస్సిని" అనే కొత్త సంగీతకారుడు వియన్నా రావడంతో బెథోవెన్ పాపులారిటీ కొంత తగ్గింది. ఈ కాలంలోనే భార్యకు విడాకులివ్వడం, సంగీత కచేరీలు తగ్గుముఖం పట్టడంతో మానసికంగా ఆయన కొంత కృంగిపోయారు. అయినా An die ferne Geliebte Piano Sonata వంటి పాటలను కూర్చగా మరికొన్ని అసంపూర్తిగా మిగిలి పోయాయి. అయితే 1820 నాటికి మళ్లీ పూర్వ వైభవాన్ని పొంది తిరిగి గొప్ప కంపోజింగ్స్‌తో వెలుగులోకి వచ్చాడు. కానీ దురదృష్టవశాత్తు మళ్లీ మానసిక బలహీనతకు లోనై మంచానికే పరిమితమై పోయారు. తన ఒంటిపై గుడ్డలను కట్టుకోలేని స్థితిలో తాగుడుకు బానిసైపోయారు. అయినప్పటికీ అసంపూర్ణమైన వాటిని పూర్తిచేశారు.

## ముగింపు విషాదం

బెథోవెన్ 1823లో డయాబెల్ల వైవిధ్యాన్ని ఆధారం చేసుకుని మిస్సాసోల్ మిన్స్ అనే శైలితో Bీన సంగీత సమ్మేళనాన్ని సాధించారు. అదే ఆయన 9వ, చివరి సింఫోనీ. దీంతో బెథోవెన్ ఆ శతాబ్దపు సంగీత చక్రవర్తిగా నిలిచిపోయారు. విచిత్రమైన వైరుధ్యపూరితమైన వ్యక్తిత్వం ఆయనది. ఆనందం ఆవరించినా, బాధలో కూరుకుపోయినా పట్టలేకపోయేవారు. వినికిడిశక్తి లోపించకముందు చక్కటి దుస్తులు ధరించి వియన్నావీధుల్లో హుందాగా పోతూ అందరికీ ఆకర్షణీయంగా కనిపించిన వ్యక్తే చెవుడొచ్చాక తనను తాను గదికే పరిమితం చేసుకుని ఒక రకంగా బందీగా మారారు. గదిలో దేన్నీ ఎవరినీ ముట్టుకోనిచ్చే వారు కాదు. పియానాలోకి ఒలికిన సిరా, కుర్చీలనిండా చిందరవందర కాగితాలు, వాటి కింద తినివదిలేసిన ఆహార పదార్థాల ప్లేట్లు. ఇలా అస్తవ్యస్తంగా ఉండే అతడి గదిలోకి వెళ్ళేందుకు అంతా భయపడేవారు. ఒకే సూట్‌ని రోజుల తరబడి వేసుకునే వారు. చిరిగి పీలికలైనా పట్టించుకునే వారు కారు. స్నేహితులే అతడు రాత్రి పూట నిద్రిస్తున్న సమయంలో చిరిగిన దుస్తులను తొలగించి వాటి స్థానంలో కొత్తవి ఉంచేవారు. ఒక రకంగా మౌనమునిగా గడిపిన బెథోవెన్ చివరి రోజుల్లో ఒక మామూలు వైద్యుడితో చికిత్స పొందారు. ఇంత అనారోగ్య పరి స్థితుల్లో కూడా 1826లో పియానోతో విచిత్రమైన, విభిన్నమైన, భయోత్పాత, చమత్కార సంగీతాన్ని కూర్చారు. ఆ తరువాత మరే



సంగీతాన్నీ చేపట్టని బెథోవెన్ 1827 మార్చి 26న సాయం వేళ అంతిమశ్వాస విడిచి అనంత సంగీత ప్రపంచంలోకి ఆత్మగా వెళ్లారు. అతడికి అంజలి ఘటించేందుకు వచ్చిన అభిమానులతో వియన్నా వీధులు నిండి పోయాయని, అంత్యక్రియల్లో పది వేలకు పైగా పాల్గొన్నారని గ్రేట్ ఫార్జర్ అనే కవి రాశాడు. వాస్తవానికి కూడా ఆయనకు ముందు, తరువాత తరాల్లో అంతగొప్ప సంగీతకారులు లేరు. తను చేసిన కంపోజింగ్స్ గురించిన నోట్సు, స్క్రిప్టులు, స్కెచ్‌లు ఒక క్రమంలో ఉంచక పోవడం వల్ల తరువాతి తరాల వారు పరిశోధనలు జరిపేందుకు వీలు లేకుండా పోయింది. అయినప్పటికీ మానవ హృదయాల భాషను అర్థం చేసుకునేందుకు బెథోవెన్ కంపోజింగ్స్ దోహద పడ్డాయి.

-హెచ్.రమేష్‌బాబు

## కార్టూనిస్ట్ 'అబు' ఇక లేరు



ప్రముఖ కార్టూనిస్ట్, పత్రికా రచయిత అబు గత పక్షం డిసెంబరు 1న తన స్వస్థలం తిరువనంతపురంలో మృతిచెందారు. సాదాసీదా వ్యంగ్య చిత్రాలతో అసాధారణ భావప్రకటన చేయగలగడం ఈయన కార్టూన్స్‌లోని ప్రత్యేకత. కేరికేచర్‌గాని, పొలిటికల్ కార్టూన్‌గాని చిన్నపిల్లల వలె ముమ్మూర్తులా గీయగలిగినప్పుడు అవి సూటిగా ప్రజల మనసులను తాకుతాయి అనే అబు తన 3వ ఏటనుండే కార్టూన్స్ గీయడం ప్రారంభించారు.

* 1924 జూన్ 11న కేరళలోని తిరువళ్ల లో జన్మించిన అబు అబ్రహాం సైన్స్‌లో డిగ్రీ సాధించి 1945లో 'బొంబే క్రానికల్' లో రిపోర్టర్‌గా, బ్లిట్జ్ పత్రికలో కొంతకాలం చేసారు.

* 1951 నుండి 1953 వరకు కేవలం కార్టూన్స్‌తో నడిచే 'శంకర్ వీక్లీ'లో స్టాఫ్ కార్టూనిస్ట్‌గా చేసారు.ఆయన కెరీర్ మలుపు తిరిగింది అప్పుడే.

*1956-66 ఇంగ్లండ్‌లోని అబ్జర్వర్ పత్రికలో చేసిన ఆయన తరువాత గార్డియన్‌లో మూడేళ్లు చేసారు.

* ఇక్కడ ఉండగానే 'నో ఆర్క్' అనే యానిమేటెడ్ చిత్రం నిర్మించి లండన్ ఫిలిం ఫెస్టివల్‌లో ఉత్తమచిత్రం అవార్డు సాధించారు.అలాగే అబు నిర్మించిన అబూ ఇన్ బంగ్లాదేశ్, గేమ్స్ ఆఫ్ ఎమర్జన్సీ కూడా ప్రజాదరణ పొందాయి.

* 1969లో భారత్ వచ్చిన అబు ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికలో 'ప్రైవేట్ వ్యూ' శీర్షికతో 'పోకెట్ కార్టూన్స్ వేసేవారు. ఇందిరాగాంధీ ప్రభుత్వంపైన ఎన్నో వ్యంగ్యాస్త్రాలను సంధించారు.

* 1972 నుండి 1978 వరకూ రాజ్యసభ సభ్యునిగా ఉన్నారు.

* వియత్నాం యుద్ధం మీద అంతర్జాతీయ కార్టూన్ ప్రముఖులు వేసిన అద్భుత కార్టూన్ల కదంబాన్ని పుస్తక రూపంలో వెలువరించి తన ప్రత్యేకతను నిలబెట్టుకున్నారు.

## బాల సుబ్రహ్మణ్యశర్మ కన్నుమూత

కర్ణాటక సంగీత విద్వాంసుడు, కేంద్రీయ సంగీత నాటక అకాడమీ అవార్డు గ్రహీత ఎం.ఎస్. బాల సుబ్రహ్మణ్య శర్మ డిసెంబరు 1న ఒంగోలులో కన్నుమూసారు. 1981 నుండి 1989 వరకూ పద్మావతి మహిళా విశ్వ విద్యాలయంలో మ్యూజిక్ అండ్ డాన్స్ విభాగానికి అధిపతిగా పనిచేసిన శ్రీ శర్మ 1998లో అప్పటి రాష్ట్రపతి కె.ఆర్. నారాయణన్ చేతుల మీదుగా సంగీత నాటక అకాడమీ అవార్డు నందుకున్నారు.



# ట్రెండ్ మారింది

**-ఎన్నార్ రవికిరణ్**

పెళ్ళివారి విడిది ఇల్లు. ఓ పక్కగా నలుగురు చతుర్ముఖ పారాయణం చేస్తుంటారు. వారిలో ప్రకాశం, శేఖరం ఉంటారు. ఇటువైపు ప్రకాశం భార్య రూప, శేఖరం భార్య పూజ కూర్చుని పువ్వులు మాల కడుతుంటారు. వారి బంధువు మధ్య వయస్కుడు రామనాథం అటూ ఇటూ తిరుగుతుంటాడు.

ప్రకాశం : (తిరుగుతున్న రామనాథాన్ని చూసి) ఏంటి మామయ్యా? అంత చిరాగ్గా తిరుగుతున్నావ్?

రామ : అబ్బే! ఏం లేదు!

శేఖరం: మరి శోభనం పెళ్ళికొడుకులా ఆ తిరుగుడేంటి?

ప్రకా : ఏం శోభనం పెళ్ళికొడుకులా తిరుగుతుంటాడా?!

శేఖ : తిరగకేం చేస్తాడు... పెళ్ళయి మూడ్రో జులైనా ముహూర్తం లేదని శోభనం పెట్టకపోతే!

(అందరూ నవ్వుతారు... ఇప్పుడు ప్రకాశం లేచి రామనాథం భుజంపై చెయ్యి వేసి)

ప్రకా : అదికాదు మావయ్యా... రెండేళ్ళ కిందట రాంపండు గాడి పెళ్ళిలో నువ్వు విజృంభించి పేకాడి మమ్మల్ని నిలువుదోపిడీ చేసేస్తుంటే సమయానికి అత్తయ్య వచ్చి మా మాన సంరక్షణ కావించింది. అటువంటి లక్కీహ్యాండ్ పెట్టుకొని నువ్వేంటి ఇలా దిగులుగా తిరుగుతున్నావ్?

రామ : చెప్తాను కానీ... మీ అత్తయ్య కనిపించిందా...

ప్రకా : మా అత్తయ్యతో ఇప్పుడు నీకేం పని (అనుమానంగా చూస్తాడు)

రామ : ఆ వెధవ ఎక్స్‌ప్రెషన్ ఆపు... ఛీ... ఛీ... ఈ తెలుగు సినిమాలు చూసి పాడైపోతున్నారు...

(ఇంతో ఆ పెళ్ళి కూతురు తండ్రి సదానందం వస్తాడు)

సదా : కాఫీలు తాగారా... టిఫినీలు తిన్నారా... (అందర్నీ అడుగుతారు)

ప్రకా : కాఫీలు తాగాం... టిఫినీలు తిన్నాం... మళ్ళీ ఇస్తే మళ్ళీ తాగుతాం!

శేఖ : (అసహనంగా) అసలు మగపెళ్ళి వాళ్ళమన్న భయం బొత్తిగా లేదు. ఆడి... ఆడి... అలసిపోయాం... వెళ్ళి అందరికి హార్లిక్స్ పట్టండి!

ప్రకా : నాకు కాఫీ... మిల్క్ ఎక్కువ!

రామ : నాకు టీ... సుగర్ తక్కువ!!

(ఇపుడు రామనాథం భార్య అరుంధతి

ప్రవేశిస్తుంది. అరుంధతిని చూసిన వెంటనే రామనాథం వేగంగా నడుస్తుంటాడు. అరుంధతి రామనాథం దగ్గరికి వచ్చి)

అరు : (కోపంగా) ఏమిటీ కోరికలు పెరిగిపోతున్నాయ్... మిమ్మల్ని టీ తాగొద్దని చెప్పాను మర్చిపోయారా... ఇలా మీరు గ్లాసులకొద్దీ టీలు తాగుతూ ఉండడం వల్లే... కడుపు ఇలా కొండలా పెరిగి పోయింది. ఛీ! ఆ ఉదయ్‌కిరణ్‌ని చూసి బుద్ధి తెచ్చుకోండి!

ప్రకా : ఉదయ్‌కిరణ్ణా...?!

అరు : (ప్రకాశం వైపు తిరిగి) మీరేంటి ఆ వెధవ పేక ఆడుతున్నారా...

ప్రకా : ఇది వెధవ పేక కాదు ఆంటీ... సీకో పేక!

అరు : నా ఉద్దేశం పేక వెధవదని కాదు బాబూ... ఆడేవాళ్ళు వెధవలని! (ప్రకాశం గతుక్కు మంటాడు)

సదా : హార్లిక్సులు వస్తున్నాయ్... (అరుంధతి వైపు తిరిగి) అమ్మా! కాఫీలు తాగారా... టిఫినీలు తిన్నారా...

అరు : కాఫీలు... టిఫిన్లు రోజూ చేస్తున్నవే కానీ... మీరు ఇటువంటివేం పట్టించుకోకండి అన్నయ్యగారూ...

సదా : అన్నయ్యా?! (ఆశ్చర్యపోతాడు) (శేఖరం అరుంధతి వైపు తిరిగి)

శేఖ : మనం మగ పెళ్ళివాళ్ళం ఆ మాత్రం సేవలు చేయించుకోంటూ బెట్టుగా ఉండకపోతే ఆడపెళ్ళివాళ్ళు నెత్తినెక్కేస్తారు.!

అరు : అందుకని పదే పదే కాఫీలు... టిఫిన్లూ అడుగుతామా? అయినా ఆడపెళ్ళి వాళ్లు... మగపెళ్ళివాళ్లు ఏంటి అసహ్యంగా... మనం అబ్బాయి తరపు వాళ్ళం... వాళ్ళు అమ్మాయి తరపువాళ్ళు అంతే! బొత్తిగా మేనర్స్ లేకుండా మాట్లాడుతున్నారు (భర్త వైపు తిరిగి) మీరేంటి వాకింగ్ ఆపేసారు?

రామ : (అప్పటి వరకు నిలబడి ఉన్నవాడు... నడుస్తూ) లేదు... చేస్తున్నాను (తిరుగుతాడు)

ప్రకా : (ఆశ్చర్యంగా) వాకింగా?!

అరు : అవును! ఈమధ్య ఈయన మరీ వయసై పోయినట్లు కనిపిస్తున్నారు! ఆ ఉదయ్‌ని చూడండి ఎంత స్లిమ్‌గా ఉన్నాడో! వాకింగ్ చెయ్యండి మీరు ఆ ఉదయ్‌లా కనిపిస్తారు' అన్చెప్పి... నేను అలా వెళ్ళే సరికి వాకింగ్ ఆపేసి ఆ ముదనష్టపు పేకాట వైపు మాంసం కొట్టు ముందరి

**కమాల్ ప్రశ్న - ఢమాల్ కార్టూన్**



**వేలుకి పెట్టుకోలేని రింగ్ స్టీరింగ్**

గజ్జికుక్కలా నిలబడి చూస్తున్నారు. (పేకాడుతున్న కళ్ళు అటు తిరిగి పోతారు) అయినా మిమ్మల్నని ఏం లాభం... చిన్న వయస్సులో పెళ్ళి చేసి మా వాళ్ళు నా గొంతు కోసేసారు... (అంటూ పేకాడుతున్న వాళ్ళని చూసి) మేనర్స్‌లెస్ బ్రూట్స్! (సదానందం వైపు తిరిగి) మీరింకేం సప్లై చేయకండి! ఎవరైనా ఏమైనా అడిగితే నన్ను పిలవండి!

సదా : మీరు ఇస్తారా...

అరు : ఇప్పటివరకు తాగింది కక్కిస్తాను! ఆఁ! అవతల వాళ్ళు నా కోసం ఎదురు చూస్తుంటారు! (వెళ్ళిపోతుంది).

రామ : హమ్మయ్య! (వాకింగ్ ఆపేస్తాడు)

ప్రకా : (రామనాథంతో) అదికాదు మావయ్యా... మిట్ట మధ్యాహ్నం వాకింగ్ ఏమిటీ...

రామ : (భారంగా నిట్టూర్చి) అదో పెద్ద కథ!

ప్రకా : షార్ట్ చేసి చెప్పలేవా!

రామ : ఎలా షార్టు చేయనూ... ఇది డైలీ సీరియల్!

ప్రకా : హమ్మో! అయితే వద్దులే! (ఇప్పుడు రూప-పూజ చేతిలో పువ్వులతో ప్రవేశించి అక్కడున్న చైర్స్‌లో కూర్చుని మాల కడుతుంటారు)

రూప : అవునూ... కామేశ్వరి జగన్నాధంతో లేచిపోయింది తెలుసా?

పూజ : తెలుసు... కామేశ్వరి అలా చేస్తుందని నేనూహించలేదు!

రూప : ఎవరూహించారు... అసలు పరంధామయ్య గారు చచ్చిపోవడంతోనే వారి కష్టాలు మొదలయ్యాయి.

పూజ : అసలు దీనికంతటికి కారణం ఆ చిన్న కోడలు చింతామణే! పెద్దకోడలు కామేశ్వరి ఎంతో గుట్టుగా సంసారం సాగిస్తూ... జబ్బు పడ్డ మావగారికి సేవ చేసుకుంటూ... ఇటు గుడ్డి అత్తగారి పనులు చేస్తూ... కుంటి తమ్ముడిని చదివించుకొంటూ మరిదిని సొంత కొడుకులా చూసుకునేది!

రూప : కానీ ఏం లాభం... ఆ మరిది ఉద్యోగం మర్చిన వెంటనే చింతామణిని పెళ్ళి చేసుకొన్నాడు... ఆ మహాతల్లి వచ్చిన వారం రోజులకే ఇంటిని విడగొట్టేసింది... పాపం ఆ బాధతోనే ఆ పరంధామయ్య చచ్చిపోయాడు...

(ఇపుడు అరుంధతి వచ్చి వాళ్ళ పక్కన కూర్చుంటుంది.)

పూజ : కానీ ఇపుడా గుడ్డి అత్తగార్ని... కుంటి తమ్ముణ్ణి వదలి కామేశ్వరి జగన్‌తో లేచిపోవడం నాకు అర్థం కాలేదు! అయినా కామేశ్వరి ఈ పనిచేసిందంటే ఏదో బలమైన కారణమే ఉండి ఉంటుంది. ఏవిటి చెప్మా!

రూప : నాకూ అదే ఆందోళనగా ఉంది. ఏ పని చేస్తున్నా... ఇటు గుడ్డి అత్తగారు... అటు కుంటి తమ్ముడే గుర్తొస్తున్నారు. అసలు కామేశ్వరి లేచిపోయిన రోజు నా మెదడు మొద్దుబారిపోయింది. ఆ షాక్ నుంచి తేరుకోలేక ఆ రోజంతా అలానే ఉండిపోయాను... ఆఖరికి అన్నం కూడా వండలేదు. ఆయన హోటల్నుంచి ఏదో తెచ్చి పిల్లలకి పెట్టి తనూ కొంత తిని నిద్రపోయారు.

పూజ : నాకైతే కాళ్ళూ చేతులు ఆడలేదు! కళ్ళు తిరిగి పడిపోవడంతో మా ఆయన నన్ను హాస్పిటల్లో అడ్మిట్ చేసేసాడు. సెలైన్ ఎక్కిస్తున్న నర్సు చేతులు వణకడం చూసి ఏమైందని అడిగాను. మీరైతే హాస్పిటల్‌లో అడ్మిట్ అయ్యారు... మేం ఎక్కడ అడ్మిట్ అవ్వాం... కామేశ్వరి జగన్‌తో లేచిపోవడంతో నేనూ తట్టుకోలేకపోయాను! కానీ డ్యూటీ... తప్పదు కదా అంది!

రూప : అయ్యో పాపం!

పూజ : ఏం చేస్తాం... ఆ రోజంతా నర్సూ, నేనూ... ఒకరినొకరు ఓదార్చుకొంటూ ఉన్నాం హాస్పిటల్లో!

రూప : అటువంటి పరిస్థితుల్లోనే ధైర్యంగా

ఉండాలి... ఆడపుట్టుకే అంత... భగవంతుడు మనల్ని పుట్టించింది... కష్టాలు పడడానికి... కన్నీళ్ళు కార్చడానికే! (ముక్కు చీదుతుంది)

అరు : (రూపతో) ఊరుకో... కామేశ్వరి అంటే మన వెంకటాచలం బాబాయ్ కూతురేనా?

రూప, పూజ: (ఆశ్చర్యంగా చూసి) కాదు!

అరు : మరి మీ పక్కింటి అమ్మాయా?

రూప : కాదు, పూజ: ఊ... హు...

అరు : మరి మీ ఫ్రెండా...

రూప, పూజ : నీకు తెలియదా?

అరు : తెలియకేగా అడుగుతుంటా!

రూప : నేను నమ్మలేకపోతున్నాను... నీకు కామేశ్వరి తెలియదా...

అరు : నిజంగా తెలియదు...

పూజ : నువ్వు టీవి చూడవా?

అరు : వార్తలు చూస్తాను!

రూప : (ఆశ్చర్యపోతూ) అంటే నువ్వు కన్నీటి కాలువ చూడవా?

అరు : నాకు మా ఇంటి ముందున్న మురిక్కాలువే తెలుసు... కన్నీటి కాలువేంటి?

పూజ : కన్నీటి కాలువంటే మురిక్కాలువ కాదు... 'ఆ' టీవీలో వస్తున్న డైలీ సీరియల్.

అరు : నేనడుగుతున్నది కామేశ్వరి గురించి...

పూజ : మేం చెప్పేది కామేశ్వరి గురించే... 'కన్నీటి కాలువ' హీరోయినే కామేశ్వరి.

అరు : అంటే మీరు ఇందాకటి నుండి మాట్లాడేది సీరియల్లోని కారెక్టర్ గురించా (ఆశ్చర్యపోతుంది)

పూజ2రూప : అలా అనకు... కామేశ్వరి మా జీవితంలో ఓ భాగమై పోయింది.

అరు : నోరుముయ్యండి... మీరింకా ఏదో ఫ్రెండ్ గురించో పక్కింటి అమ్మాయి గురించో మాట్లాడుతున్నారనుకొన్నా...

పూజ : కామేశ్వరి నాకు అంతకంటే ఎక్కువ...

రూప : నాకు తోడబుట్టిన చెల్లెలితో సమానం. (అబ్బా! అరుంధతి వినలేక చెవులు మూసుకుంటుంది)

అరు : ఛీ... ఆ దరిద్రపు సీరియళ్ళ వల్ల మీ మైండ్‌లు ఎలా మొద్దుబారిపోయాయో తెలుస్తుంది. మీ మొగుళ్ళు ఆఫీసులకెళ్ళిపోయాక మీరు తలుపులు బిగించుకొని ఆ ఏడుపుగొట్టు సీరియళ్ళు చూస్తూ మీలో మీరే కుళ్ళిపోతూ ఏడుస్తూ ఉంటే మీ మైండ్‌లు ఇలాగే తయారవుతాయి.

పూజ : అదికాదత్తా...

అరు : ఇంకేం మాట్లాడకండి... సాయంత్రం అయిదయిందంటే ఫ్రెష్‌గా తయారై తలలో మల్లెలు తురుముకొని ఆఫీసు నుంచిఅలసిపోయి వచ్చిన భర్తకు చిరునవ్వుతో ఎదురెళ్ళాల్సింది పోయి...

## కమాల్ ప్రశ్న - ఢమాల్ కార్టూన్



**భయపెట్టే నేషన్?**

**ఎగ్జామినేషన్**

జుట్టురేగిపోయి... కళ్ళు ఉబ్బిపోయి... శవంపై పడి ఏడ్చి లేచినట్లు ఎదురెళ్ళడానికి మీకు సిగ్గుగా లేదూ... అసలు మిమ్మల్ని కాదు అనాల్సింది... మీతో కాపురాలు చేస్తున్న మీ భర్తలను చూసి జాలి పడాలి... ఛీ... మీ లాంటి వాళ్ళ వల్లే మన ఆడజాతి పరువు పోతుంది. ఇప్పటికైనా ఆ ఇడియట్ బాక్స్‌ను నూతిలో పడేసి ఓసారి బయటకొచ్చి చూడండి ప్రపంచం ఎంత అందంగా ఉందో... ఎన్నెన్ని రంగులున్నాయో... ఎంత వేగంగా మారిపోతుందో తెలుస్తుంది. చిన్న చిన్న పిల్లలు సైతం ఎంతో డెవలప్ అయిపోయి తమ జీవితంలోని ప్రతి క్షణాన్ని ఆనందమయం చేసుకొంటుంటే... మీరు మాత్రం నూతిలో కప్పల్లా ఉంటున్నారు... ఛీ... ఛీ.... మంచి హేపీ మూడ్‌ని పాడు చేసారు.

(విస విసా లోపలికి వెళ్ళిపోతుంది.)

ప్రకా : అయిందా... జ్ఞానోదయం అయిందా... ఇన్నాళ్ళూ మేం ఎంత మొత్తుకుంటున్నా వినలేదు... ఇప్పుడు ఆవిడ కళ్ళు తెరిపించిందా... వాడు కన్నీటి కాలువ అనేటప్పటికిమీరు ఇంట్లో కన్నీటి సముద్రాలు సృష్టించెయ్యడం మాని ఇకనుంచైనా ఆవిడ చెప్పినట్లు బుద్ధిగా ఉండండి.

రూప : (ప్రకాశంతో) నన్ను క్షమించండి. ఇంకెప్పుడూ అలా చెయ్యను.

పూజ : (శేఖరంతో) ఇంక ఆ దరిద్రపు టీవి చూడడం మానేసి మీ సేవే చేసుకొంటాను!

శేఖ: సర్లె! ఇక బుద్ధిగా ఉండండి! (రూప, పూజ వెళ్ళిపోతారు)

ప్రకా : (రామనాధంతో) చాలా థేంక్స్ మావయ్యా... ఇన్నాళ్ళూ మేం... మీకు అత్తయ్య అంటే భయం అని మీరు ఆవిడ చేతిలో కీలు బొమ్మనీ అనుకొన్నాం కానీ ఇప్పుడు తెలిసింది. ఆవిడ మిమ్మల్ని తన ఉన్నతమైన వ్యక్తిత్వంలో గెలుచు కొందని...

శేఖ: అబ్బాయి తరపున పెళ్ళికి వచ్చి కూడా అమ్మాయి తరపు వాళ్ళని సపోర్టు చేసినపుడే అనుకొన్నాను... ఆంటీ మనసు చాలా గొప్పదని...

ప్రకా : ఇంతకాలంగా వేం కంట్రోల్ చేయలేనిది... ఓ పది నిమిషాలు కడిగి పారేసి, వాళ్ళ కళ్ళు తెరిపించింది.

శేఖ: నువ్వు చాలా అదృష్టవంతుడివి మావయ్యా అత్తయ్య లాంటి భార్య దొరకడం నీ అదృష్టం!

రామ : అదృష్టం; (నవ్వుతాడు) ఏం అదృష్టం... ఆవిడ మాటలు జాగ్రత్తగా విన్నారా... ఏవండో అర్థమైందా?

శేఖ : ఏవండీ... ఆఫీసు నుంచి భర్త వచ్చే టప్పటికి ఫ్రెష్‌గా తయారై చిరునవ్వుతో ఎదురెళ్ళ మంది.

రామ : చిన్న చిన్న పిల్లలు కూడా ఎంతో డెవలప్ అయిపోతున్నారు అంది కదా!

శేఖ, ప్రకా: అవును!

రామ : అక్కడే వచ్చింది చిక్కు!

ప్రకా : చిక్కేవిటీ...

రామ : ఏవిటా.... మీరు ఆఫీసులకి వెళ్ళిపోయిన వెంటనే మీ ఆడాళ్ళు టీవి చూస్తూ ఏడుస్తూ ఇంట్లోనే ఉండిపోతున్నారా...

శేఖ : అవును...

రామ : మా ఆవిడ టీవి చూడదు... నేను ఆఫీసుకి వెళ్ళి పోయిన వెంటనే తను ఇంటికి తాళం వేసి మాట్నీ కెళ్ళిపోతుంది.

ప్రకా : సిన్మాకెళుతుందా?! శేఖ : అంతేకదా!

రామ : సిన్మా అని తేలిగ్గా తీసేయకు... యూత్ ట్రెండ్ పేరుతో ఇపుడొస్తున్న కుర్రకుంక సినిమాలు రోజుకొకటి చూసి ఇంటికి వచ్చిన వెంటనే నాతో యుద్ధం మొదలెడుతుంది.

ప్రకా : సిన్మా చూసి నీతో యుద్ధం ఎందుకు?!

రామ : ఎందుకా... ఆ కుర్రకుంక సిన్మాలు చూసి తనూ ఎవర్నయినా ప్రేమిస్తే బావుణ్ణనీ... తను వయసుల్లో ఉన్నపుడు ఈ సిన్మాలు రానందుకు బాధ పడిపోతూ... వాళ్ళ అమ్మా నాన్నలని తిడుతుంది.

శేఖ : మధ్యలో వాళ్ళేం చేసారు?

రామ : అలా ప్రేమించే ఛాన్సు లేకుండా ఈవిడగార్ని నాకిచ్చి పెళ్ళిచేసి... ఆవిడ గొంతుకోసేసారట...

ప్రకా : ఆఁ!

రామ : అంతేకాదు... తను పద్దెనిమిదేళ్ళ రీమాసేన్‌లా నేను ఇరవై ఏళ్ళ ఉదయ్‌కిరణ్‌లా అయిపోతే బావుండునంటూ నాతో ఇరవై నాలుగు గంటలూ వాకింగ్... ఎక్సర్‌సైజులు చేయిస్తుంది. రోజుకి ఒక్కపూటే భోజనం... అదీ కప్పుతో కొలిచి... సరిపోక మళ్ళీ అడిగితే... తన జీవితం అన్యాయమై పోయిందని... ప్రపంచం వేగంగా మార్పు చెందుతుందని... చిన్న చిన్న పిల్లలు ప్రేమించి పెళ్ళి చేసుకొంటున్నారని గోలెడుతుంది.

శేఖ : అయ్యో పాపం!

రామ : అంతటితో అయిపోలేదు... నాకింక ప్రేమించే వయసు లేదు. కనీసం ప్రేమికులను కలిపైనా వాళ్ళ ప్రేమను నిలబడతానని... మొన్న... ఎనిమిదేళ్ళ మా వీధి గూండా కూతురికి... పదేళ్ళ మా ఊరి యస్.ఐ. కొడుక్కీ పెళ్ళి చేసేసింది.

ప్రకా : వాళ్ళూరుకొన్నారా?!

రామ : ఎందుకూరుకుంటారు... ఆ గూండా నా ఎముకల్లో సున్నం లేకుండా కొడితే... ఆ యస్.ఐ. మా ఇద్దర్నీ అరెస్టు చేసి జైల్లో పెట్టాడు... విడిపించుకు బయటకు రావడానికి తలప్రాణం తోకకి వచ్చింది. ఇప్పుడర్థమైందా మీ అత్తయ్య... ప్రపంచం వేగంగా మారిపోతోంది. మీ బుద్ధులు మారాలనటంలో అర్థం!

ప్రకా, శేఖ : ఆఁ!

(ఇపుడు రూప, పూజ పరిగెత్తుకు వస్తారు)

రూప : ఏవండీ మన పాప కనిపించడం లేదండీ!

పూజ : (శేఖరంతో) హేవండీ మన బాబు కనిపించడం లేదండీ!

ప్రకా, శేఖ : ఆఁ!

(ఇంతలో ఓ చిన్న కుర్రాడు పరుగున వచ్చి రామనాధంతో)

కుర్రాడు: నాన్నా అమ్మ కనిపించడం లేదు!

రామనాధం : హాఁ!

(తెర)

## కమాల్ ప్రశ్న - ఢమాల్ కార్టూన్




**పూజ చేయకుండానే భగవంతుని దగ్గరకు తీసుకెళ్ళే పత్రి?**

**ఆసుపత్రి**




# హాస్యాభిషేకం




'ఆంధ్రుల ఆహ్లాద రచయిత'గా ప్రసిద్ధికెక్కిన మల్లాది వెంకట కృష్ణమూర్తి వెలువరించిన కొత్తపుస్తకం- 'హాస్యాభిషేకం'. క్లుప్తత, సూటిదనం, వైవిధ్యం - వీటిద్వారా ఆయన ఆధునిక పాఠకుడిని ఆకట్టుకోగలిగారు. వివిధ విషయాలపై దేశవిదేశాల నుండి నిరంతరం సమాచారం సేకరిస్తూ తనదైన శైలిలో తెలుగు పాఠకులకు చేరవేయడం వల్ల ఆయన నిత్యనూతనంగా కనిపిస్తారు. 'హాస్యాభిషేకం' అనే జోక్స్ కలెక్షన్ బుక్‌లో ఆయన పలురకాల జోకులు అందించారు. ఆపుస్తకంలో చెణుకుల ద్వారా అందించిన హాస్యానికి మచ్చుతునకలు కొన్ని :-

- ✷ ఎక్కువ పెట్రోల్ ఖర్చువదని హామీ ఇచ్చి అమ్మిన కారు సేల్స్‌మేన్ నిజమే చెప్పాడా?
  -నిజమే చెప్పాడు. సగం దూరం దాన్ని తోసుకెళుతుండాలి.
- ✷ తొలి లవ్ ట్రయాంగిల్ ఏది?
  -సూర్యుడు, దాని చుట్టూ తిరిగే భూమి, భూమి చుట్టూ తిరిగే చంద్రుడు.
- ✷ అట్లాంటిక్ మహాసముద్రం సగం దూరం దాటాలనుకుంటే ఏ ఓడ ఎక్కాలి?
  -టైటానిక్.
- ✷ పసిపాప నాలుగో వారంలో నవ్వడం ఆరంభిస్తుంది. ఎందుకని?
  -అప్పటికి మీ మొహంమీద చూపు నిలపగలదు కాబట్టి.
- ✷ ఓ ఆడది వేసుకోవడానికేం బట్టలు లేవు అంటే అర్థం ఏమిటి?
  -వేసుకోవడానికి 'కొత్త' బట్టలు లేవని అర్థం.
- ✷ ఓ మగాడు వేసుకోవడానికేం బట్టలు లేవు అంటే అర్థం ఏమిటి?
  -వేసుకోవడానికి ఉతికి ఇస్త్రీ చేసిన బట్టలు లేవని అర్థం
- ✷ పెళ్ళంటే...?
  -నూరేళ్ళ వంట!
- ✷ ప్రైమినిష్టర్‌ని ఎవరు షూట్ చేస్తే పోలీసులు అతన్ని నేరస్థుడిగా భావించరు?
  -టి.వి. కెమెరామెన్.
- ✷ పోట్లాడుతున్నప్పుడు భార్యాభర్తల్లో ఎవరు పెద్ద గొంతుతో అరుస్తారు?
  -ఎవరిది తప్పో వారు.
- ✷ మోనోలాగ్ అంటే...?
  -పెళ్ళయిన అయిదేళ్ళ తర్వాత భార్యాభర్తల మధ్య జరిగే పరిణామం.
- ✷ భార్యాభర్తల పోట్లాటలలో ఎప్పుడూ భర్త మాటే భార్య వింటుందా?
  -అవును, 'సర్లే నువ్వు చెప్పినట్టే చేద్దాం' అన్న భర్త మాట భార్య వింటుంది.

# హాస్యవల్లరి సంగీతలహరి

# కిశోర్ జీవనఝరి

- ఎమ్మెస్ స్వాతి



**అక్టోబరు13, 1987.**

కిశోర్ మరణవార్త బొంబాయి అంతా వ్యాపించింది. సినీ ప్రముఖులు ఎంతోమంది అతడికి నివాళి అర్పించడానికి రాసాగారు. ప్రసిద్ధ గాయకుడుగా పేరు తెచ్చుకున్నాడు కాబట్టి అతనితో పాటలు పాడించుకుంటున్న నిర్మాతలు, అతనితో పనిచేసిన సంగీత దర్శకులు, వాద్యకారులు-ఇలా ఎంతోమంది అతని మృతదేహాన్ని చూడడానికి వచ్చారు.

వీరంతా వృత్తిపరంగా చేరువయినవారే కానీ సన్నిహితులు అనడానికి వీలులేదు. కిశోర్‌కి తన కుటుంబం అంటేనే ప్రీతి. స్నేహితులు అతి తక్కువ. ఇఫ్తికర్ (హిందీ సినిమాల్లో ఇన్‌స్పెక్టర్ వేషాలు ఎక్కువగా వేశాడు) లాంటి క్లోజ్‌ఫ్రెండ్స్‌ను వేళ్లమీద లెక్కించవచ్చు. కిశోర్‌కి బాగా ఆత్మీయుడయి ఉండి ఆరోజు అతని శవాన్ని చూడడానికి రాలేకపోయిన వారిలో దేవ్‌ఆనంద్‌ను ప్రత్యేకంగా పేర్కొనాలి.

కిశోర్‌కి దేవ్ ఆనంద్ అంటే ఎంత ఇష్టమంటే తన బెడ్‌రూమ్‌లో అతని ఫోటోను తగిలించి ఉంచేవాడు.



## దేవ్ ఆనంద్‌తో తొలి పరిచయం

దేవ్, కిశోర్ ఇద్దరూ ఇంచుమించుగా ఒకే సమయంలో సినిమా రంగానికి వచ్చారు. అప్పటికి ఇద్దరూ అనామకులే. కొన్నాళ్ల ఇద్దరూ కలిసి లోకల్‌ట్రెయిన్లో వెళ్ళేవారు. తన వైవాహిక సమస్యలను దేవ్ ఒక్కడితోనే చర్చించేవాడట. కిశోర్ తనకు తాను ప్లేబ్యాక్ పాడుకొనేవాడు; దేవ్‌కి పాడేవాడు. అంతే! తక్కిన ఎవ్వరికీ పాడేవాడు కాదు. నటుడిగా బిజీ అయిన రోజుల్లో కూడా దేవ్‌కి ప్లేబ్యాక్ పాడడానికి ఎన్నడూ వెనుకాడలేదు. నిజానికి 'షరారత్' సినిమా నిర్మాణంలో ఓ పాట తనకు తాను పాడుకునే టైములేని కిశోర్‌కు రఫీ ప్లేబ్యాక్ పాడవలసి వచ్చింది. అంత బిజీ స్టార్ అయి ఉండి కూడా దేవ్‌కి ఏ సంకోచం లేకుండా కిశోర్ పాడేవాడంటే దానికి కారణం తొలి రోజుల్లో వాళ్ల మధ్య ఏర్పడ్డ గాఢ అనుబంధమే!

అవి అశోక్‌కుమార్ బాంబే టాకీసు ద్వారా 'జిద్దీ' (1948)తీసే రోజులు. హీరోగా అశోక్, హీరోయిన్‌గా కామినీకౌశల్‌ని అనుకున్నారు. కానీ అశోక్ 'మహల్ (1949) సినిమా నిర్మాణంలో తలమునకలుగా ఉన్నాడు. అతను ఆ సినిమాకు హీరో మాత్రమే కాడు, కథలో, డైరెక్షన్‌లో కూడా పాత్ర వహించాడు. దేవ్ ఆనంద్ అనే కుర్రవాడు అతన్ని అప్రోచ్ అయి సినిమా ఛాన్సు కోసం అడిగినప్పుడు 'జిద్దీ'లో హీరో వేషం అతనికిస్తే పోలా? అనుకున్నాడు అశోక్.

## దేవ్ నేపథ్యం

దేవ్ అప్పటికే ప్రభాత్ స్టూడియో వారి 'హమ్ ఏక్ హై' (1944) దుర్గాఖోటే సరసన నటించాడు. అతని జన్మస్థలం గురుదాస్‌పూర్. పోస్టు గ్రాడ్యుయేషన్ చేసి ఆర్మీలో కొంతకాలం ఉద్యోగం చేసి వేషాలు వెతుక్కుంటూ సినిమా రంగానికి వచ్చాడు. అతని అన్న చేతన్ అంతకు ముందే నటుడిగా 'మీనా'లో నటించి, దర్శకుడిగా 'నీచానగర్' (1946) తీసి చేతులు కాల్చుకుని ఉన్నాడు.

'జిద్దీ' సినిమా షూటింగు ప్రారంభమయింది. దేవ్‌తో తీసిన షాట్స్ చాలా అసంతృప్తికరంగా వచ్చాయి. అశోక్ నిరుత్సాహ పడలేదు. దేవ్‌ను పిలిచి కెమెరాముందు ఎలా నటించాలో నేర్పాడు. అది దేవ్‌కు ధైర్యాన్ని, నైతిక స్థయిర్యాన్ని ఇచ్చింది. సినిమా ముందుకు సాగింది. ఆ సినిమా దర్శకుడు షహీద్ లతీఫ్ సినిమా పూర్తవకుండానే తప్పుకున్నాడు. డైరెక్షన్‌లో అశోక్ మరీ ఎక్కువగా కలగజేసుకుంటున్నాడని అతని అభియోగం. అతను వెళ్లిపోవడంతో అశోక్‌యే దర్శకత్వం వహించి సినిమా పూర్తి చేశాడు.

ఇదే 'జిద్దీ' సినిమాలో కిశోర్‌కు తొలి ఛాన్సు లభించింది. అన్న ఓ చిన్న తోటమాలి వేషం ఇస్తే సంగీత దర్శకుడు పాటపాడే అవకాశం ఇచ్చాడు. ఈ సినిమా నిర్మాణంలోనే దేవ్, కిశోర్‌ల స్నేహం ఏర్పడి వృద్ధి చెందింది. కిశోర్ సెన్స్ ఆఫ్ హ్యూమర్ దేవ్‌కెంతో నచ్చేది. అది వ్యక్తిగతం అయితే వృత్తిపరంగా కూడా కిశోర్ గొంతు తనకు ఎంత బాగా సూటయ్యిందో దేవ్ గమనించాడు. కిశోర్ ప్లేబ్యాక్ పాడిన తన పాట తెరపై చూసుకుంటే అతనికెంతో ముచ్చట వేసింది.

## దేవ్ మార్కు సినిమాలు

కిశోర్ సోదరుల్లాగానే దేవ్ సోదరులు ముగ్గురూ సినిమా ఫీల్డులో ఉన్నారు. దేవ్ అన్న చేతన్, తమ్ముడు విజయ్ డైరెక్టర్లుగా ప్రసిద్ధికెక్కినా వారు చక్కని నటులు కూడా. దేవ్ కూడా 1990 నుండి డైరెక్షన్ మొదలు పెట్టినా ప్రధానంగా నటుడు. అతను నటుడుగా తాను ఎదుగుతున్న కొద్దీ కిశోర్‌కి అవకాశాలు ఇస్తూపోయాడు. వాళ్ళిద్దరి మధ్య బంధం గట్టిపడడానికి ఇంకో లింకు ఉంది-రాజ్‌కపూర్ శంకర్-జైకిషన్‌లకు, దిలీప్‌కుమార్-నౌషద్‌కు ప్రాధాన్యత ఇచ్చినట్లు దేవ్ తన సినిమాలకు సంగీత దర్శకత్వం వహించడానికి సచిన్ దేవ్ బర్మన్‌ను ఎంచుకునేవాడు. బర్మన్‌కి కిశోర్ అంటే అపారమైన వాత్సల్యం కాబట్టి దేవ్‌కి కిశోర్ ప్లేబ్యాక్ పాడడానికి ఎలాటి అవరోధమూ లేదు.

తొలిరోజుల్లో సింగర్‌గా కిశోర్ పేరు తెచ్చుకోగలిగాడంటే దానికి కారణం దేవ్ హీరోగా

ఉన్నత శిఖరాలు అధిరోహించడమే! అప్పట్లో హిందీ సినిమాలు మూడు రకాలుగా ఉండేవి. దేవదాసు టైపు సినిమాలకు దిలీప్ పెట్టింది పేరు. కాస్త సామాజిక చైతన్యం, కాస్త బఫూనరీ, కలిసిన సినిమాలలో రాజ్‌కపూర్‌ది అందె వేసిన చెయ్యి. వీటికి విభిన్నంగా ఉండేవి దేవ్ మార్కు సినిమాలు - సీరియస్ స్టఫ్ లేకుండా, , త్యాగాలూ, కన్నీళ్ల గోల లేకుండా ఓ అందమైన అమ్మాయి వెంటబడే (ఘాటు శృంగార సన్నివేశాలుండవు) స్టైలిష్ రోమియో పాత్ర చుట్టూ తిరుగుతాయి ఇతని లైట్ రొమాంటిక్ సినిమాలు. వాటిలో హీరో అభినయం కంటే అతని స్టయిలూ, పాడే పాటలే ప్రాధాన్యం.

స్వాతంత్ర్య పోరాటం నుండి అప్పుడే బయటపడిన దేశ యువతకు సందేశాలూ, అవీ లేకుండా ఇలా హాయిగా నడిచిపోయే హుషారైన సినిమాలు బాగా నచ్చేవి. అందుకే అయిదు దశాబ్దాలు గడిచినా దేవ్ ఆనంద్ అభిమానులు చెక్కుచెదరలేదు. అతనింకా సినిమాలు తీయగలుగుతున్నాడు.

## దేవ్ - కిశోర్ జోడీ

1950లలో విడుదలయిన నాలుగు సినిమాలు దేవ్‌కి, తద్వారా కిశోర్‌కి మంచి పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టాయి. అవి 'మునీంజీ', 'పేయింగ్ గెస్టు' (ఈ రెండూ ఫిల్మిస్తాన్ వాళ్లు తీశారు.) 'ఫంటూష్', 'నౌదోగ్యారహ్' (నవ్‌కేతన్ వాళ్లవి).

ఈ నాల్గింటికీ ఎస్.డి. బర్మనే సంగీత దర్శకుడు. వీటిలో కిశోర్ పాడిన పాటలు- జీవన్ కే సఫర్ మే రాహీ (మునీంజీ) మానాజనాబ్ నే పుకారా నహీ (పేయింగ్ గెస్ట్) దుఖీమన్ మేరే (ఫంటూష్) 'హమ్ హై రాహీ ప్యార్‌కే'' (నౌ దో గ్యారహ్) ఇప్పటికీ జనాలు మరువలేరు. కెరియర్ తొలిరోజుల్లోనే ఇలాటి హిట్స్ దక్కాయంటే దానికి కారణం దేవ్ స్నేహభావమే. 'ఫంటూష్' 'నౌ ద్యో గారహ్' తీసిన నవకేతన్ దేవ్ స్వంత సంస్థే!

## నవకేతన్

దేవ్ అన్న చేతన్ వామపక్ష భావాలున్న (ఇప్టా) సభ్యుడు. 'నీచానగర్' (1946) అనే సినిమా తీదర్శకుడు (సంగీతం 'సితార్' రవిశంకర్) దానికి కేన్స్ ఫిలిం ఫెస్టివల్‌లో అవార్డు వచ్చిందే కానీ స్వదేశంలో ఫెయిలయింది. దేవ్ నటుడిగా పదివేలు సంపాదించి తెస్తే అన్నదమ్ములిద్దరూ కలిసి నవ్‌కేతన్ సంస్థ మొదలుపెట్టారు. గొగోల్ రష్యన్ కథ ఆధారంగా చేతన్ 'అఫ్సర్' సినిమా తీస్తే అదీ ఫెయిలయింది. కమర్షియల్‌గా సక్సెసయ్యే సినిమా తీయాలనుకొని దేవ్ తన మిత్రుడు గురుదత్ చేత 'బాజీ' (1951) తీయించాడు. గీతాబాలి, దేవ్ నాయికా నాయకులు, సంగీతం-బర్మన్. అదే సమయంలో చేతన్ దేవ్, నిమ్మీలతో 'ఆంధియాఁ' (1952)



దేవ్ కిశోర్‌కు తొలిఛాన్స్ ఇచ్చిన 'బాజీ (1951)లో గీతాబాలి, దేవ్ ఆనంద్

సినిమా తీశాడు. (ఈసారి సంగీత దర్శకుడు ఆలీ అక్బర్‌ఖాన్) 'ఆంధియాఁ' ఓ మాదిరిగా ఆడింది. వెనిస్ ఫిలిం ఫెస్టివల్‌కు వెళ్లింది. కానీ 'బాజీ' సూపర్‌హిట్ అయింది. నవకేతన్ సంస్థ నిలబడింది.

'బాజీ'లో కిశోర్‌కు పాటపాడే అవకాశం కల్పించాడు దేవ్. 'తేరే తీరోఁనే మేఁ ఛుపే ఖజానా హైఁ? మేరే లబోంపే అజ్ భీ తరానేహై' అనే సరదా పాట పాడాడు. సినిమా చూసిన జనాలంతా దేవ్‌యే ఆ పాట పాడాడని అనుకున్నారు. కిశోర్ వాయిస్ అతనికి అంత బాగా నప్పింది.

## తొలిగీతాలు

తర్వాత వచ్చిన 'జాల్' (1952)లో కూడా బర్మన్ ఛాన్సిచ్చాడు. గీతాదత్‌తో 'దేఖీ చుకే హమ్ దిల్' అనే యుగళ గీతం పాడాడు కానీ అది పెద్ద ప్రాచుర్యంలోకి రాలేదు. తరువాత తీసిన 'టాక్సీ డ్రైవర్' (1954)కు దర్శకత్వం వహించమని అన్న గారిని కోరాడు దేవ్. ఆ సినిమా బాగా హిట్ అయిందికానీ చేతన్ విడిగా వెళ్ళి తన 'హిమాలయా ప్రొడక్షన్స్' మొదలు పెట్టి నవకేతన్‌ను దేవ్‌కే వదిలేశాడు.

## కిశోర్ గీతావళి

**చిత్రం: ఫంటూష్ రచన: సాహిర్ లుధియాన్వి సంగీతం: ఎస్.డి.బర్మన్**



**దుఃఖీ మన్ మేరే సున్ మేరా కహనా**
**జహాఁ నహిఁ చైనా వహాఁ నహీఁ రహనా**
**దర్ద్ హమారా కోయీ న జానే, అపనీ గరజ్ కే సబ్ హై దివానే**
**కిస్‌కే ఆగే రోనా రోయేఁ, దేశ్ పరాయా లోగ్ బేగానే**
**దుఃఖీ మన్ మేరే సున్ మేరా కహనా...**
**లాఖ్ యహాఁ ఝోలీ ఫైలా లే, కుఛ్ నహీఁ దేంగే ఇస్ జగ్ వాలే**
**పత్థర్ కే దిల్ మోమ్ న హోంగే, చాహే జిత్‌నా నీర్ బహా లే**
**దుఃఖీ మన్ మేరే సున్ మేరా కహనా...**
**అపనే లియే కబ్ హై యే మేలే, హమ్ హైఁ హర్ ఇక్ మేలే మే అకేలే**
**క్యా పాయేగా ఇస్‌మేఁ రహ్‌కర్, జో దునియా జీవన్ సే ఖేలే**
**దుఃఖీ మన్ మేరే సున్ మేరా కహనా...**

సాహిర్ లుధియావా రాయగా, ఎస్.డి.బర్మన్ సంగీతం సంగీతం సమకూర్చిన ఈ పాట 'ఫంటూష్' (1956) చిత్రంలోనిది. సినిమా కథ చాలా విచిత్రంగా ఉంటుంది. మతి భ్రష్టుడైన హీరో చికిత్స జరుగుతుండగానే పిచ్చాసుపత్రిలో నుండి తప్పించుకుని బయటకు వస్తాడు. లోకం మీద ఏహ్య భావంతో ఆత్మహత్య చేసుకుందామనుకుంటాడు. అప్పుడు విలన్ అతన్ని కలిసి ఆత్మహత్యను వాయిదా వేసుకోమని సలహా యిస్తాడు. ఈ లోపున అతని పేర లక్ష రూపాయలకు ఇన్సూరెన్సు చేయించి, ఆ డబ్బు కొట్టేద్దామని అతని ప్లాను. కానీ హీరోయిన్ పరిచయమయి, అనూహ్య పరిస్థితుల్లో హీరోకు ఆరోగ్యం చక్కబడుతుంది. కానీ ఆత్మహత్య చేసుకోవాలని విలన్ పట్టుబట్టడంతో వారిద్దరి మధ్యా ఘర్షణ జరుగుతుంది. తను కొట్టిన దెబ్బలకి హీరో చచ్చిపోయాడనుకొని విలన్ ఇన్సూరెన్సు డబ్బు తీసుకుంటాడు. తీరా చూస్తే హీరో సురక్షితంగా ఉంటాడు. దాంతో విలన్ మతిభ్రష్టుడయి హీరో బయటకు వచ్చిన పిచ్చాసుపత్రిలోనే చేరతాడు.

హీరో (దేవ్ ఆనంద్) ఆత్మహత్య చేసుకోవడానికి వెళుతుండగా పాడుకునే పాట ఇది. 'నా బాధ ఎవరూ పట్టించుకోరు, ఎవరి స్వార్థం వారిది, నేను ఒంటరివాణ్ని, ఈ లోకంలో ఉండి ఏం లాభం' అన్న అర్థంలోని ఈ పాట బెంగాలీ కీర్తన పద్ధతిలో స్వరపరిచాడు బర్మన్.



దేవ్-చేతన్ కాంబినేషన్‌లో హిట్ 'టాక్సీడ్రైవర్' దేవ్, షీలారమణి

'టాక్సీడ్రైవర్‌లో ఓ కోరస్ కామెడీసాంగ్ ఉంది. 'చాహేకోయీ ఖుశ్‌హో గాలియాఁ హజారే దేఁ, మస్తరామ్‌బన్‌కే జిందగీ కే దిన్ గుజార్ దేఁ' అని దేవ్, జనీవాకర్ ఇతరులు కలిసి పాడతారు. దీంట్లో కిశోర్ గొంతుమార్చి నౌటంకీ స్టయిల్లో పాడడం వల్ల అతని వాయిస్ ఎక్కువ మంది గుర్తుపట్ట లేకపోయారు.

'టాక్సీ డ్రైవర్' హిట్ కావడంతో దేవ్‌కు ఫిల్మిస్తాన్ వంటి పెద్ద సంస్థ నుండి "మునీంజీ" ఆఫర్ వచ్చింది. దేవ్‌కు ధైర్యం వచ్చింది. కిశోర్‌కు మెయిన్‌సాంగ్ ఇద్దామని ప్రపోజ్ చేశాడు. "మునీంజీ" సంగీతదర్శకుడు బర్మన్ కావడం వల్ల ఆయన కూడా సై అన్నాడు. అప్పటిదాకా కిశోర్ పాడినవి చిన్న తరహా పాటలే కానీ థీమ్ సాంగ్ కాదు. కానీ "మునీంజీ"లో సాహిర్ రాసిన "జీవన్ కే సఫర్ మేం రాహీ, మిల్‌తే హై బిఛడ్ జానే కో" పాట పాడే అవకాశం వచ్చింది. ఆ పాట లతా కూడా పాడినా కిశోర్ వెర్షన్‌కే మార్కులు పడ్డాయి. అది ఇప్పటికీ పెద్ద హిట్టే! కిశోర్ దశ తిరిగింది ఈ పాటతోననే చెప్పాలి.

మళ్లీ అటువంటి అవకాశం వెనువెంటనే "ఫంటూష్" (1956)లో వచ్చింది. నవకేతన్ బ్యానర్‌లో దేవ్ తీసిన ఈ సినిమాకు అతని అన్న చేతన్ దర్శకుడు, తమ్ముడు విజయ్ సహాయ దర్శకుడు. సాహిత్యం సాహిర్, సంగీతం బర్మన్. పాటల్లో చాలాభాగం కిశోర్ పాడినవే! ముఖ్యంగా "దుఖీ మన్ మేరే, సున్ మేరా కహ్‌నా" అనే అత్యంత విషాదభరితమైన గీతాన్ని కిశోర్ చాలా గొప్పగా పాడాడు.

ఇక్కడో చిన్న తమాషా జరిగింది. "ఫంటూష్" తీసే రోజుల్లో సంగీతదర్శకుడి తొమ్మిదేళ్ల కొడుకు (అతన్ని పంచమ్ అనేవారు) ఓ హాస్యగీతానికి ట్యూన్ కట్టి వినిపించాడు. ఆ పాట "హేయ్ మేరీ టోపీ పలట్‌కే ఆ". అందరికీ ఆ ట్యూన్ నచ్చింది. తండ్రి ఓకే చేశాడు. కిశోర్ పాడాడు. టైటిల్స్‌లో మాత్రం తండ్రి పేరే వేశారు కానీ ఆ చైల్డ్ ప్రాడిజీ పేరు వేయలేదనుకోండి. పెద్దయ్యాక అతని సంగీతదర్శకత్వంలో కిశోర్ ఎన్నో అద్భుతమైన పాటలు పాడాడు. అతడే రాహుల్ దేవ్ బర్మన్!

## నటుడిగా కిశోర్ తొలి అడుగులు

ఈ సమయంలో నటుడిగా కిశోర్ ఏం చేస్తున్నాడో తెలుసుకుంటే అతడికి దేవ్ ఆనంద్ చేసిన ఉపకారం ఏమిటో తెలుస్తుంది. "జిద్దీ" (1948) తర్వాత అతనికి శివ్‌రాజ్, సుష్మా, మంజా లతో బాటు "ఆందోళన్" (1951) లో ఛాన్సు దొరికింది -అశోక్ తమ్ముడు కదాని! ఫణిమజుందార్ దర్శకత్వం, పన్నాలాల్ ఘోష్ సంగీతదర్శకత్వం. అయినా సినిమా ఆడలేదు.

మళ్లీ అశోక్ తన బాంబే టాకీసు వాళ్లు తీసిన "తమాషా" (1952) లో చిన్న పాత్ర ఇప్పించాడు. ఫణిమజుందార్ దర్శకుడు. సంగీతం ఖేమ్‌చంద్ ప్రకాష్. అశోక్‌కుమార్, దేవ్ ఆనంద్, మీనా కుమారి ముఖ్యపాత్రధారులు. ఆ తర్వాత పెద్దపాత్రలు లభించిన చిత్రాలు - 'చమ్ చమా చమ్' (1952), (దర్శకుడు సంతోషి సంగీతం ఓపి నయ్యర్),

1953లో 'లడ్కీ', 'లెహరే' రిలీజయ్యాయి. ఎమ్.వి.రామన్ దర్శకత్వంలో ఎ.వి.ఎమ్. తీసిన "లడ్కీ" దేశసమైక్యతను బోధించే సినిమా. కిశోర్ పంజాబీ అబ్బాయిగా, అతని సరసన వైజయంతీమాల దక్షిణాది అమ్మాయిగా వేశారు. ఓ పాటలో వీరిద్దరూ దేశంలో అన్ని ప్రాంతాలవారి దుస్తులూ ధరిస్తారు. "లెహరే"కు దర్శకత్వం ఎచ్.ఎస్.రవైల్. హీరోయిన్ శ్యామా, సంగీతం సి.రామచంద్ర. ఈ సినిమాలో కిశోర్‌కు కాస్త గుర్తింపు వచ్చింది.

1954లో వచ్చిన సినిమాలు - ధోబీ డాక్టర్, ఇల్‌జామ్, మిస్ ఇండియా, అధికార్, నౌకరీ, పెహ్‌లీ ఝులక్. 'పెహలీ ఝులక్' ఎం.వి.రామన్ దర్శకత్వంలో, సి.రామచంద్ర సంగీతంతో వైజయంతీమాల హీరోయిన్‌గా తయారయిన సినిమా. పెద్దగా ఆడలేదు. 'అధికార్'కు దర్శకుడు మోహన్ సెహగల్. అవినాశ్ వ్యాస్ సంగీతం. భార్యను పోగొట్టుకున్న యువకుడి పాత్ర కిశోర్‌ది. ఆ సీరియస్ వేషం అతనికి నప్పలేదు. సినిమా ఫెయిలయింది.

ఇంతలో కిశోర్ అదృష్టం కొద్దీ అతను నిర్మాత, దర్శకుడు బిమల్‌రాయ్ కంటబడ్డాడు. తన "నౌకరీ"లో షీలారమణి సరసన కిశోర్‌కు నాయకపాత్ర ఇచ్చాడు. కిశోర్ బాగా నటించాడు కూడా. "ఏక్ ఛోటోసీ నౌకరీ కా తలబ్‌దార్ హూ మై", "కామతా హూ బహుత్ కుఛ్, కమాయీ డూబ్ జాతీ హై'. అనే కిశోర్ పాటలు దానిలోవే! ఇవి సీరియస్ వయితే "శాదీ, శాదీ" (తెలుగులో పిఠాపురం "పెళ్లి, పెళ్లి" అని 'సంఘం'లో పాడిన పాటకు మూలం) అనే యోడలింగ్ పాట బాగా హిట్ అయింది. సంగీతం సలిల్ చౌధురి.

## బాప్ రే బాప్ - తొలి హిట్!

ఈ సీరియస్ పాత్రలు కిశోర్‌కు అంతబాగా నప్పలేదనే చెప్పాలి. కన్వెన్షనల్ హీరో కాదతను! కామెడీ హీరోగా అయితేనే అతను రాణించగలడు. ఆ విషయం పసిగట్టిన మేటి నిర్మాత దర్శకుడు ఎ.ఆర్. కర్దార్ 'బాప్ రే బాప్' (1954) అనే తన హాస్యచిత్రంలో హీరో పాత్ర ఇచ్చాడు. హీరోయిన్ చాంద్ ఉస్మానీ. సంగీతం ఓపినయ్యర్. ఇది హిట్ కావడంతో కిశోర్‌కు 'ఫ్లాప్ హీరో' అన్న అపప్రథ పోయింది. దీనిలో ఆశా భోంస్లేతో కలిసి పాడిన యుగళగీతం "పియా పియా పియా, మేరా జియా పుకారే " సూపర్ హిట్. ఇప్పటికీ బాగా వినపడుతూంటుంది.



నటుడిగా కిశోర్‌ను నిలబెట్టిన చిత్రం 'బాప్‌రే బాప్'

1955 లో మళ్లీ కొన్ని ఫ్లాపులు వచ్చాయి. 'చార్ పైసే" (నిమ్మి హీరోయిన్, ఎన్.కె.జీరీ దర్శకుడు, వి.డి.వర్మన్ సంగీతం), "మద్‌భరే నైన్ (బీనారాయ్ హీరోయిన్, హేమ్ చందర్ డైరక్షన్. బర్మన్ మ్యూజిక్.) "రుక్సానా" (మీనాకుమారి హీరోయిన్, ఆర్.సి.తల్వార్ దర్శకుడు, సజ్జాద్ సంగీతం)

యాక్టర్‌గా కిశోర్ ఇలా ఊగులాడుతున్న సమయంలో తనకు ప్లేబ్యాక్ పాడే అవకాశాలను కల్పిస్తూ దేవ్ ఆనంద్ ఇచ్చిన మానసిక స్థైర్యం చాలా గొప్పది. అందుకే కిశోర్, తనకూ తప్ప దేవ్‌కు తప్ప వేరెవరికీ పాడేవాడు కాడు. (ఆ రూల్ బ్రేక్ చేసుకున్నది "ఆరాధనా"తోనే! ఇక్కడో చిత్రమైన సంగతి ఉంది - రాజేష్‌ఖన్నా శక్తి సామంతాను అడిగాడట - 'నాకు రెండు పాత్రలు ఇచ్చారు కదా, ఒకటి నాలాగే వేస్తాను. రెండోది ఏం చేయమంటారు?' అని. శక్తి సామంతా వెంటనే "ఆ ఇంకో పాత్ర దేవ్ ఆనంద్‌ను ఇమిటేట్ చేసెదేయ్" అన్నాట్ట. బహుశా అందుకనే కాబోలు శక్తి సామంతా రాజేష్‌ఖన్నాకు కిశోర్ చేత ప్లేబ్యాక్ పాడించాడు!)

## రఫీయా ? కిశోరా ?

"ఫంటూష్" హిట్ కావడంతో దేవ్‌కు ధైర్యం వచ్చి తమ్ముడు విజయ్‌కు స్వంతంగా డైరక్షన్ చేసే అవకాశం కల్పించాడు. కథ కూడా అతనిదే! ఆ సినిమా - "నౌ దో గ్యారహ్" (1957). విజయ్‌కు కూడా బర్మన్ అంటేనే ఇష్టం. ఆయననే సంగీత

దర్శకుడిగా పెట్టుకున్నాడు. కానీ దేవ్‌కు పాటలు ఎవరిచేత పాడించాలి అన్న ప్రశ్న వచ్చింది. అప్పటికే రఫీ తలత్ స్థానాన్ని ఆక్రమించి టాప్ సింగర్‌గా అవుతున్నాడు. అతని చేత హీరోకు పాడిస్తే సెలబిలిటీ బాగా ఉంటుంది. దేవ్‌కు రఫీ, కిశోర్ ఇద్దరి గొంతులూ బాగా నప్పుతాయి. అయినా రఫీ చేత పాడిస్తే తన తొలిసినిమా హిట్ అవుతుందని విజయ్ ఆనంద్ ఉద్దేశ్యం.

సచిన్ దేవ్ బర్మన్‌తో ఈ విషయం చర్చించాడు. "కిశోర్ చేత పాడిద్దాంలే. దేవ్ స్టయిలూ, మేనరిజమ్స్‌కి సరిపోయేట్టు కిశోర్ చేత పాడించే పూచీ నాది" అన్నాడు బర్మన్. కానీ విజయ్‌కు రఫీచేత పాడించాలని ఉంది. కిశోర్ చేత పాడించి రిస్కు తీసుకో దలచలేదు. అలా అని బర్మన్‌కు ఎదురు చెప్పే సాహసమూ లేదు. దేవ్ నడిగితే ఏమంటాడో అనుకుంటూ అడిగాడు. "కిశోర్ చేత పాడిద్దాం" అన్నాడు అతను కూడా. విజయ్‌కి ఏమీ పాలుపోలేదు. చివరికి తలవూపాల్సి వచ్చింది.

ఎప్పటిలాగానే బర్మన్ అంచనా తప్పలేదు. రెండు బ్రహ్మాండమైన హిట్స్ ఇచ్చాడు కిశోర్.


దేవ్ ఆనంద్ అభినయం, కిశోర్ గాత్రం బ్రహ్మాండంగా జతపడిన చిత్రాలు 'జ్యుయల్‌తీఫ్', 'జానీమేరానామ్'

'హమ్ హై రాహీ ప్యార్ కే, హమ్ సే కుఛ్ న బోలియే'' ఇంకోటి లతాతో ప్రశ్నోత్తరాల డ్యూయెట్ - "ఆఖోం మే క్యాజీ, రుపహెలా బాదల్"! రేడియో సిలోన్‌లో ఎంతో మంది శ్రోతలు ఈ పాటలను కోరేవారు. సినిమా కూడా హిట్ అయింది. విజయ్ ఆనంద్ నాలుక కరుచుకోవలసివచ్చింది.

ఇంతటి ప్రగాఢ మైత్రి ఉన్న దేవ్ ఆ రోజు రాలేకపోవడం దురదృష్టకరం కాదూ!

(ఇంకా ఉంది)

## కొంటె చేష్టల కిశోర్



కిశోర్ కుమార్ కు పరిచయస్తుడయిన ఒక వ్యక్తి ఓసారి రోడ్డుమీద తారసిల్లాడు. అతను కిశోర్‌ను గుర్తు పట్టనట్లు నటించాడు. ఒక సినీనటుడికి అంతకంటె అవమానం ఏముంటుంది? కానీ అలాటిఅవమానం దిగమింగుకుని కూచుంటే అతను కిశోర్ ఎందుకవుతాడు? అతన్ని చూసి 'దొంగ, దొంగ' అని అరుస్తూ వెంటపరిగెట్టాడు. అందరూ వెంటబడ్డారు. పోలీసులు వచ్చారు. అరెస్టు చేయబోయారు. అప్పుడా పెద్దమనిషి "ఏమిటి కిశోర్! నేనెవర్నో నీకు తెలియదూ? నేను దొంగనా?" అన్నాడు దీనంగా. "కిశోర్ అని ఇప్పుడు పిలుస్తున్నావే! ఆ బుద్ధి అప్పుడే ఉండి పలకరించివుంటే నీకీ తిప్పలు వుండేవి కావుగా!" అన్నాడు కిశోర్ వెక్కిరిస్తూ.

ఓసారి కిశోర్ ఆహ్వానంపై కొందరు అతని ఇంటికి వచ్చారు. కానీ కిశోర్ ఇంట్లో లేడని తెలియడంతో వెయిటింగ్ హాల్లో కూలబడి కబుర్లు చెప్పకోసాగారు. గంటలు గడిచినా అతని జాడలేకపోవడంతో కాస్త తిట్టుకుని ఇక వెళ్లిపోదామని లేస్తుంటే వాళ్ళ సోఫా కింద నుండి పాక్కుంటూ బయటికొచ్చాడు కిశోర్. పైగా "కైసే లగీ మేరా ఎంట్రీ" అన్న వాకబు ఒకటి!

నిజానికి వాళ్లు వచ్చినప్పటినుంచీ అతను అక్కడే దాక్కుని వాళ్ళు తనని తిట్టుకుంటూన్నదంతా వింటూ కూర్చున్నాడు. ఇది అతని ఫేవరేట్ హాబీ! వెయింటింగ్‌హాల్లో ఒక్కణ్ణే కూచోబెట్టి తను ఓ కన్నంలో నుండి చూస్తూ కూచునేవాడు. తననెవరూ చూడడంలేదనుకుని మనిషి చేసే చేష్టలు, ముఖవికారాలు గమనించడం అతని సరదా!

---

## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక




మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి **బాలూ** గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.

1. ఒనగూడు(పాండురంగ మహత్యం....తరంతరం)
ఎ) ఓడిపోవు బి)ముందుకుదూకు
సి) జయించు డి) ప్రాప్తించు

2. సఖా (పాండురంగ మహత్యం...నీవని నేనని)
ఎ) స్త్రీ బి) సగము
సి) మిత్రమా డి)సహాయకుడా

3. పెనిమిటి(పాండురంగమహత్యం....వన్నెలచిన్నెల)
ఎ) పెద్దవాడు బి) భర్త
సి) పేదవాడు డి) వీరుడు

4. నెరు(పాండురంగమహత్యం....వన్నెల చిన్నెల)
ఎ) అగ్ని బి)-చిమ్మునది
సి) ప్రియుడు డి) నేర్పరి

5. రోయు (పాండురంగ మహత్యం....అమ్మా అని)
ఎ) కోపించు బి)అసహ్యించుకొను
సి) ఆలోచించు డి) త్రోయు

6. ఊడిగము(పాండురంగ మహత్యం....అమ్మాఅని)
ఎ) ప్రేమ బి) ఊగులాట
సి) వ్రేలాడే వేరు డి) సేవ

7. మాకు (పాండురంగ మహత్యం...హే కృష్ణా ముకుందా)
ఎ) చెట్టు బి) ఫలము
సి) స్తంభము డి) పెద్దమేకు

8. ఫణ(పాండురంగ మహత్యం...హే కృష్ణా ముకుందా)
ఎ)పాము పడగ బి) పాముతోక
సి) సరస్సు డి)తల

9. మధురిమ(మన్మథుడు...నామనసునే)
ఎ)సారాలు బి)తీపిదనము
సి)వలపు డి)పాండిత్యము

10. సవ్వడి(ఒకే ఒక్కడు...మగధీర)
ఎ)మెరుపు బి)వేగము
సి)జాడ డి)పదును

### జవాబులు

1) d 2) c 3) b
4) d 5) b 6) d
7) a 8) a 9) b
10) c

బాలు

అలనాటి ఆణిముత్యాల
గురించి నేటి తరానికి అనువైన
శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల

## దరిద్ర సాహిత్యం

అడగకుండా అమ్మయినా అన్నం పెట్టదనే సామెత అందరికీ వర్తిస్తుంది. కాబట్టి, అడగటం జన్మహక్కు. అయితే అడగడం వేరు, అడుక్కోవటం వేరు. అడుక్కోవటం అంటే యాచనావృత్తి, ముష్టెత్తుకోవటం, తిరిపె మెత్తటం, భిక్షమడగటం. దీని నుండి కూడా ఎవ్వరికీ మినహాయింపు లేదు. వీధిలో ముష్టాడు మొదలు దేశనాయకుడి వరకు అందరూ ఏదో స్థాయిలో అడుక్కునే ముష్టి బతుకులు, ముష్టి ప్రభుత్వాలే! ఆ మాటకొస్తే, ప్రజల్లో కంటే ప్రభుత్వాల్లోనే దరిద్రం ఎక్కువగా వుంది. అష్టకష్టాల్లో - అడుక్కోవటం, పేదరికం కూడా వున్నాయి. మానవులే కాదు దేవతలు కూడా అడుక్కుంటారు. ఒక విధంగా వాళ్లూ ముష్టివాళ్లే. శివుడు ఆదిభిక్షువు. విష్ణువు వామనుడై బలి చక్రవర్తిని మూడు అడుగులు అడిగి బిచ్చగాడయ్యాడు. ఆ విషయాన్ని చిలకమర్తివారు తమ గయోపాఖ్యానం నాటకంలో అర్జునుని నోట-

**అదితి కశ్యపులకు గుజ్జు వగుచు బుట్టి**
**యడుగుకొనలేదె ధరను మూడడుగులీవు**
**బిచ్చమెత్తుట సరిక్రొత్త విద్యకాదు**
**నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష!!**




అంటూ చమత్కరించారు. అనాది సిద్ధమైన యీ కలిమి లేముల పోరాటంలో ఉన్నవారిదే యెప్పుడూ పైచేయి అంటానికి వీల్లేదు, లేమిని తృణప్రాయంగా భావించి కలిమికి కలిమిగా నిలిచిన కవులెంతో మందున్నారు. పోతన, ధూర్జటి, త్యాగరాజు వంటి వారు పెన్నిధుల్లాంటి ప్రభువుల్ని యెలా తృణీకరించారో అందరికీ తెలుసు. అయితే, అందరికీ యీ స్థితి లేదు, వుండదు. కేవలం జ్ఞానులు తప్ప యెవ్వరూ అర్థ ప్రపంచాన్ని దాటలేరు. రామాయణంలో

**ధనమార్జయ కాకుత్థ్స! ధనమూల మిదం జగత్**
**అంతరం నాభిజానామి! నిర్ధనస్య మృతస్య చ!!**

అంటాడు రామునితో లక్ష్మణుడు. ధనమే మూలం అన్నిటికీ - దాన్ని ఆర్జించాలి. అది లేనివాడికి చచ్చినవాడికీ తేడా లేదని భావం.

ధనం లేకపోవటం దరిద్రం. "అదాన దోషేణ భవేద్దరిద్రః" అని పూర్వజన్మలో దానధర్మాలు చేయని వాడు దరిద్రుడుగా పుడుతున్నాడు. కాబట్టి, శ్రీమంతులు ఈ జన్మలో దానాలు చేసి లేని వాళ్లని ఆదుకోవటం వాళ్లకే మంచిది. ఈ విషయాన్ని "దానం చెయ్యండి బాబూ!" అనకుండా "ధర్మం చెయ్యండి బాబూ!" అంటూ ప్రతిముష్టివాడూ హెచ్చరిస్తున్నాడు. ఇలా ముష్టెత్తుకోటానికి ధర్మం చేయటమనే పేరొచ్చింది.

అసలు, బిచ్చగాడికి 12 గుణాలుంటాయని -

**ఉచ్చై రధ్యయనం పురాతన కథా స్త్రీభిస్సహాలాపనం**
**తాసామర్భక లాలనం పతినుతిః తత్పాక మిథ్యాస్తుతిః**
**ఆదేశస్య కరావలంబన విధిః పాండిత్య లేఖ క్రియా**
**హోరా గారుడ మంత్ర తంత్ర భిక్షోర్గుణాః ద్వాదశః!!**

అనే శ్లోకం తెలియజేస్తూవుంది. గొంతెత్తి పెద్దగా చదవటం, పాత కథలు చెప్పటం, ఆడవాళ్లతో ముచ్చట్లాడటం, వాళ్ల పిల్లల్ని ఆడించటం, వాళ్ల భర్తల్ని పొగట్టం, వాళ్ల వంటలు వుత్తినే మెచ్చుకోవటం, చెప్పిన పని వెంటనే చేస్తున్నట్టు నటించటం, పండితుడిలా రాస్తూ వుండటం, జ్యోతిషం చెప్పటం, మంత్ర తంత్రాలు చేయటం - ఈ దరిద్రగుణాలు. భావ దరిద్రమే అసలైన దరిద్రం కదా! ఇలాంటి పనులు చేయటం వల్ల మనసు పేదవడిపోయి మనిషి దీనుడైపోతాడు, ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయి నీచుడైపోతాడు. దాంతో చాలా చిక్కుల్లోపడిపోతాడు. ఈ విషయాన్ని పుష్పగిరి తిమ్మన అనే కవి-

**దారిద్ర్యంబు ఘటంచి తద్ వ్యథలచే దైన్యంబు గల్పించి, సం**
**సారభ్రాంతి ధన ప్రమత్తుల నుతింపంజేసి యాశాగతుల్**
**మీరం జిక్కులు వెట్టెదేమిటికి స్వామీ! నన్కన న్వాక్సుధా**
**ధారాయూధ! యనాథనాథ! రఘునాథా! సాధుమేధానిధీ!!**

అంటూ తన సాధుమేధానిధీ శతకంలో వెల్లడించాడు. గమ్మత్తేమిటంటే- బీదవాడుగా కనబడుతూ పిసినారి ధనవంతుడవుతున్నాడు, ధన వంతుడులా కనిపించాలని వున్నది ఖర్చుపెట్టేసేవాడు దరిద్రుడవుతున్నాడు. అందుకే ఓ మేధావి -

**దేహీతి వచనం కష్టం - నాస్తీతి వచనం తతః**

**దేహీ నాస్తి వచో ద్వంద్వం - మాభూః జన్మని జన్మని!!**

అంటూ 'దేహి' అని అడుక్కోవటం గానీ, 'నాస్తి' అని లేదని చెప్పటంగానీ జన్మజన్మలకి వద్దని కోరుకున్నాడు. కోరుకున్నవన్నీ తీరవు. ఐశ్వర్యం కోరే మీరు ఆరు దోషాలకి దూరంగా వుండాలి. ఆమాట భారతంలో విదురుడు :-

**షడ్దోషాః పురుషేణ హ హాతవ్యా భూతి మిచ్ఛతా**

**నిద్రా తంద్రా భయం క్రోధం ఆలస్యం దీర్ఘసూత్రతా!!**

అనే శ్లోకం ద్వారా తెలియజేశాడు. అంటే నిద్ర, బద్ధకం, భయం, కోపం, ఆలస్యం చేయటం, ప్రతిదానికీ తెగ ఆలోచించటం- అనే ఆరు దోషాలున్నవాడు శ్రీమంతుడు కాలేడు. కాబట్టి డబ్బు బాగా కావాలనుకునే వారు వీటి జోలికి పోకూడదు. గమ్మత్తేమిటంటే - యింత చెప్పిన విదురుడు ఆనాడు కటికపేద. అయితే, ఆయన కేవల జ్ఞాని కాబట్టి ఐశ్వర్యాలెప్పుడూ కోరుకోలేదు. కొన్ని విపరీత లక్షణాలిలాగే వుంటాయి. ఈ కలికాలంలో మరీనూ -

**దాతా దరిద్రః కృపణో ధనాఢ్యః పాపీ చిరాయుః సుకృతిర్గతాయుః**

**రాజా కులీనః సుకులీ చ భృత్యః కలియుగే షడ్గుణ మాశ్రయంతి!!**

కలిలో దాత దరిద్రుడుగాను, పిసినారి ధనవంతుడుగాను, పాపి చిరంజీవిగాను, పుణ్యాత్ముడు అల్పాయుష్కుడుగాను, చెడ్డకులంలో వాడు రాజుగాను, మంచి కులస్థుడు సేవకుడుగాను వుంటారని భావం. "కృపణో ధనాఢ్యః" - పిసినారి శ్రీమంతుడెలా అవుతున్నాడంటే- ఓ కవి - "నీచ ప్రణవతా లక్ష్మీ జలజా యాస్తవోచితా" అని చమత్కరించాడు. లక్ష్మి నీటి నుండి పుట్టింది. (సముద్ర తనయు) కాబట్టి నీరు పల్లానికే పోయినట్టు లక్ష్మి నీచుల దగ్గరకే పోతుందట! నీరు - లక్ష్మి ఉన్నతంగాను, ఉన్నతుల దగ్గర వుండవని అభిప్రాయం. "ధైర్యే సాహసే లక్ష్మి" అంటారు గానీ అది రాజులకు రాజ్యలక్ష్మికై చెప్పిన మాట. అందరికీ వర్తించదు. ఎందుకంటే దాని విధానం వేరుగావుంది.

**"ఏ ధైర్య సాహసాలు ప్రదర్శించాడని**

**హరికి సిరి పాదదాసి అయ్యింది**

**తనను పట్టించుకోని వారి వెంట పడటం**

**సిరికి పుట్టుకతో అలవాట య్యింది!"**

అని నేను నా 'విద్యుల్లత' కావ్యంలో రాశాను. అవును కదూ! కాబట్టి ధర్మార్థాల్లో ధర్మం వెంట ధనం వుంటుందని మర్చిపోకూడదు.

ఇప్పుడు కొన్ని రకాల దరిద్రుల్ని, ముష్టివాళ్లని పరిచయం చేస్తాను. కాటయ వేమున్ని ఉద్దేశించి ఓ కవి :-

**వెలయాలు శిశువు నల్లుడు**

**నిలయేలిక యాచకుండు నేగురు ధరలో**

**కలిమియు లేమియు దలపరు**

**కలియుగమున, కీర్తికామ! కాటయ వేమా!!**

అంటాడు. అంటే, అవతలి వాళ్ల దగ్గర వుందా లేదా అని ఆలోచించకుండా వేశ్య, శిశువు, అల్లుడు, ప్రభు(త్వం)వు. ముష్టాడు -ఏదోటి అడుక్కుంటూనే వుంటారని భావం. ఇలాంటిదే మరోటి :-

**మత్కుణా మశకా రాత్రౌ - మక్షికా యాచకా దివా**

**పిపీలికా చ భార్యా చ - దివా రాత్రౌ చ బాధతే!!**




నల్లి, దోమ - రాత్రిళ్లు, ఈగ, యాచకుడు - పగలు, చీమ, భార్య - రాత్రింబవళ్లూ బాధ పెడుతుంటారంటాడో భార్యా బాధిత కవి. దరిద్రుడందరికీ చుల్కనే. ఎంత చుల్కనంటే గడ్డి పరకని, దూదిని ఎగరేసుకుపోయే గాలి కూడా తననేమైనా అడుగుతాడేమో నని

ముష్టివాడి జోలికి పోదట! చూడండా శ్లోకం :-

**తృణాల్లఘు తర స్తూలః -**
**తూలా దపిచ యాచకః**
**వాయునా కిం ననీతోఅసౌ-**
**మామయం యాచయే దితి!!**

అంటే యాచకుడు గడ్డి పరక కంటె తేలికైన దూది కంటే తేలికని అర్ధం. కొందరు కొవ్వెక్కి యాచకుల్ని చుల్కనగా చూడటమే కాదు తిడుతుంటారు. అదీ పట్టించుకోకుండా ఓ ధీర దరిద్ర కవి యిలా అంటున్నాడు.

**న ద్వేష్మి నిందంత పిద్విషంతం**
**నిందన్ సంతుష్టిం నితరాం లభేత**
**దానేన సంతోషయితుం నశక్తః**
**పరాన్న పీథం పరితోష యేయం !!**

వాడు నన్ను తిట్టాడని నాకు ద్వేషంలేదు పైగా సంతోషంగా వుంది. వాడికే దైనా దానం చేసి సంతోష పెట్టటానికి నాకు శక్తి లేదు - నన్ను తిట్టటం ద్వారా వాడు సంతోషపడుతున్నాడంతే చాలు. అలావాణ్ని సంతోషపెడుతున్నాగదా! అని భావం. ఇంత ఉదారస్వభావమే యాచకుణ్ని చేస్తుంది. అలాంటి వాడొకడిలా అంటున్నాడు. ఆ కవి చమత్కారం చూడండి:-

**దరిద్రాయ నమస్తుభ్యం - సిద్ధో హం త్వత్ ప్రసాదతః**
**సర్వం పశ్యామి దేవేశ! నమాం పశ్యతి కశ్చన!!**

ఓ దరిద్రదేవా! నీ కరుణ వల్ల సిద్ధుడి నయ్యాను. ఇప్పుడు నేనంతా చూస్తున్నాను. నన్నెవ్వరూ చూడటం లేదని అర్థం. అంటే తన నెవ్వరూ పట్టించుకోవటంలేదని మొఱపెట్టుకుంటున్నాడు.శాలివాహన గాథాసప్తశతిలో ఓ ముష్టి శృంగార పద్యం చూడండి :-

**భిక్షుకుండు నాభి నీక్షించుచుండగా**
**నదియు వాని మోము నరయు చుండె**
**అతని చేతి చిప్ప నామె చేతుల తట్ట**
**కాకు లేరి తినుచు గాకు చేసె!!**

ఓ ముష్టాడు తన చిప్పలో అన్నం పెట్టే ఒకామె బొడ్డుని చూస్తూండగా, ఆమె కూడా వాడి ముఖం చూస్తూ అలాగే వుండిపోగా, రాలి పడిన మెతుకుల్ని కాకుల ఏరుకు తింటున్నాయట! ఇంతకీ - వాడేమి అడగటానికి వచ్చేడో, యీవిడ గారేమిస్తూవుందో కాకులకేం తెలుస్తుంది చెప్పండి? వీధిలో మరీ అంత మైమరుపా!?!

ఇలాగే - ఓ బిచ్చగాడు ఓ యింటికెళ్లి అన్నం పెట్టమంటే ఆమె "తర్వాత రా అయ్యగారింట్లోలే" రనగానే వాడు లోపలికి చూసి "అదేవిటి తల్లీ! దొడ్లో ఆయన బట్టలుతుకుతుంటే లేరంటావేమి'' టనగానే ఆమె నవ్వి, పక్కింటావిడని ప్రేమగా పిలిచి "ఏవండీ! వంటయ్యిందా?'' అని అడిగి అయ్యిందని విని వచ్చి ముష్టాడితో- "పక్కింట్లో వంటయ్యిందట. అక్కడికి వెళ్లు'' అని చెప్పిందట!

కనకాభిషేకం చేయించుకున్న శ్రీనాథ మహాకవి సాంపరాయని కస్తూరి భిక్ష పెట్టమన్నాడు.

**అక్షయంబుగ సాంపరాయని తెలుంగాధీశ! కస్తూరి కా**
**భిక్షాదానము సేయరా! సుకవి రాట్ బృందారక స్వామికిన్**
**ద్రాక్షారామ చణుక్య భీమవర గంధర్వప్సరో భామినీ**
**వక్షో జద్వయ కుంభి కుంభములపై వాసించు తద్వాసనల్!!**

ఈ యాచనా వృత్తికి, దరిద్రానికి సంబంధించినంత వరకు శ్రీశ్రీ "భిక్షువర్షీయసీ'' కవితను, "మాదాకబళం'' అంటూ 1950లో పిలకా గణపతి శాస్త్రిగారు రాసిన కవితను, 1940లో కరువు వచ్చినప్పుడు కాగడా పత్రికలో ఆరుద్ర రాసిన-

**కట్ట బట్ట లేక కడుపుకన్నము లేక**
**నిలువ నీడ లేక నీరు లేక**
**మనువు లేక మరల మరణించగా లేక**
**బ్రతుకు వాని బ్రదుకు బ్రతుకు అగునె?**

అనే పద్యాన్నీ మరిచిపోలేను. నేటికీ యీ స్థితి మారలేదు. ఎప్పుడు మారుతుందో! లోపం ఎక్కడుందో, దాన్ని నినాదాలతో కాకుండా ఎవరు పట్టుకుని చక్కదిద్దగలరో అర్థంకావటం లేదు. కృషితో నాస్తి దుర్భిక్షం - అమలు కావటం లేదు. స్వార్థం విలయ తాండవం చేస్తూ వుంది. దరిద్రమే హింసకు, అశాంతికి కారణం. దాన్ని దహించి అంతం చేసేవాడు లేడంటారు మహాకవి కాళిదాసు -

**దగ్ధం ఖాండవ మర్జునేనచ వృధా కల్పద్రుమై ర్భూషితం**
**దగ్ధావాయుసుతేన హేమరచితా లంకా వృధా స్వర్ణభూః**
**దగ్ధ స్సర్వ సుఖాస్పదశ్చ మదనో హాహా! వృధా శంభునా**
**దారిద్ర్యం ఘనతాపదం భువిన్నృణాం కేనాపినో దహ్యతే!!**

కల్ప వృక్షాలు గల ఖాండవ వనాన్ని అర్జునుడు, స్వర్ణభూమియైన లంకను ఆంజనేయుడు, అందరికీ సుఖాన్నిచ్చే మన్మథుణ్ని శివుడు వృథాగా కాల్చివేశారు గానీ అందరికీ యింత క్షోభ, కష్టం, తాపం కల్గిస్తున్న దరిద్రాన్నెవరూ కాల్చి పారేయలేకున్నారనీ, ఆ పని నీవైనా చెయ్యమని భోజునితో అంటాడు. భోజుడు జీవన భృతులు కల్పిస్తాడు.

ఇదంతా దరిద్ర సాహిత్యం. అంటే దరిద్రుడి సాహిత్యంకాదు దరిద్రం మీద సృష్టింపబడిన సాహిత్యం ఇదిలాగే వుంటుంది. ఉన్నవారంటే మంచి మనసున్న వారనీ, లేని వారంటే దయలేని వారనీ అన్నానొకసారి నేను. అందరూ భూత దయ 'కలవారు' కావాలని కోరుకొంటున్నాను.





# బాపు విశ్వరూపం

పోర్ట్రయిట్లు వేసేవాళ్లు మనిషి పోలికలు అచ్చుగుద్దేట్లా వేయగలిగితే మెచ్చుకోవలసినదే. కానీ ఆ పని ఫోటో స్టూడియోలో కెమెరా కూడా చేస్తుంది. సినిమా కెమెరా అయితే అతని వ్యక్తిత్వాన్ని, గుణగణాలను ప్రదర్శించడానికి కొన్ని యాంగిల్స్‌ను వెతుక్కుంటుంది. అదీ చాలక లైటింగ్, నేపథ్య సంగీతం వంటి ఇతర ప్రక్రియల సహాయం తీసుకుంటుంది. కానీ బాపు కొన్ని లైన్లలోనే ఆ డైమన్షన్‌లన్నీ చూపగలరు. అలా చేయగలగాలంటే ఆ వ్యక్తి గురించి అధ్యయనం చేయాలి. చేయగల శ్రద్ధ, ఆసక్తి ఆయనకున్నాయి కాబట్టే ఎంతటి మహామహులైనా బాపుగారిచేత తన పోర్ట్రయిట్ వేయించుకోవాలని తహతహ లాడతారు.

దిగువన కొన్నిరేఖా చిత్రాలు ఇస్తున్నాం. ఆయా వ్యక్తుల గురించి తెలియని వారిని ఈ వ్యక్తులెలాటివారో ఊహించమనండి. వారి అంచనాలు ఎందుకు నిజమవుతున్నాయో మీరూహించండి. అప్పుడు అర్థమవుతుంది-బాపు రేఖలలోని మహత్మ్యం!



పట్టుదల, ధైర్యం, సాహసం ఉన్న మహిళ అని ఈవిడని వర్ణిస్తారు. ఏదో ఒక లక్ష్యం వైపు చూపు సారించడం, ఒక భుజం పైకి లేచి వుండడం, ముఖంలో దృఢత్వం! అవును, ఈవిడ దుర్గాబాయ్ దేశ్‌ముఖే! ఏభై ఏళ్ల క్రితమే మహిళాభివృద్ధికి ఎంతో కృషి చేశారు. ఆమె ఎన్నో ప్రతికూల పరిస్థితుల నెదుర్కొని స్త్రీల చదువు కోసం, స్వావలంబన కోసం ఆంధ్ర మహిళాసభ స్థాపించారు. స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు.



రొమాంటిక్ పొయెట్ అనేస్తారు ఈయన్ని చూడగానే. నున్నటి ముఖం. సన్నటి కళ్లజోడు ఫ్రేము. కోమలత్వం, కుదురుగా దువ్వుకున్న జుట్టు. "అమృతం కురిసిన రాత్రి" ఫేమ్ బాలగంగాధర్ తిలక్ వచనరచనల్లో కూడా వెన్నెల్లో ఆడుకునే అందమైన కన్నెపిల్లలంత లాలిత్యం ఉంటుంది కదా!



ఈయనెవరో ధీరోదాత్తుడైన కథా నాయకుడిలా ఉన్నాడంటారు. ఆ బలమైన భుజాలు... కండలు, మగటిమి, ముఖంలో ఆత్మీయత చూసి ఉట్టిపడే చిరునవ్వు. ఎన్.టి.రామారావు నిజ జీవితంలో కూడా హీరో అనిపించుకున్న ధీరుడు. జన సామాన్యానికి చేరువయిన ప్రజా నాయకుడు.



తాత్వికుడైన రచయిత అనిపిస్తా రీయన. నిశితంగా విశ్లేషిస్తున్నట్టున్న ఆ దృష్టి, ఆ కళ్లజోడు, ఆ సైడు ఫోజు అవునంటాయి. తన రచనల్లో మామూలు కథ కంటే తత్వ విచారానికి, మనో విశ్లేషణకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చిన గోపీచంద్ (అసమర్థుని జీవితయాత్ర) బొమ్మ ఇది.



వేదాంతంలోకి వెళ్ళిన మేధావి అని ఈయన్ని ఊహిస్తారు. ఆ ఊర్ధ్వదృష్టి స్వామిజీలకు ఉండవచ్చు. కానీ కొద్దిపాటి గడ్డం, బనియన్ ఆయన మామూలు సంసారి అని తెలియబరుస్తాయి. జీవితాన్ని మథించిన ఆలోచనా సరళి ఆయన ముఖ కవళికల్లో కనిపిస్తుంది. తన రచనల ద్వారా స్త్రీ లోకాన్ని మేల్కొలిపి, వారి మస్తిష్కాన్ని ఆవిష్కరించిన చలం జీవిత చరమాంకంలో రమణమహర్షి శిష్యులయి తిరువణ్ణామలైలో స్థిరపడ్డారు.



స్వయంకృషితో ఎదిగిన కథా నాయకుడు అని వర్ణిస్తారు ఈ బొమ్మ చూడగానే. నిటారుగా నిలబడ్డ తీరు, శిఖరాన్ని చేరి లోకాన్ని పరిశీలిస్తున్నట్టు చూసే ఆ చూపు అటువంటి అభిప్రాయాన్నే కలిగిస్తాయి. పట్టుదలతో తానెక్కలేని ఎత్తులు లేవని నిరూపించుకున్న అక్కినేని నాగేశ్వరరావు 'కథానాయకుని కథ'కు ఇంతకు మించిన రూపచిత్రణ దొరుకుతుందా?




వివిధ రంగాలకు చెందిన అత్యుత్తమ చిత్రాలను నిర్మించిన ఎన్.ఎ.టి. సంస్థ తెలుగు చలన చిత్ర చరిత్రలో ఓ ప్రతిష్టాత్మక సంస్థగా ప్రజల హృదయాలలో నిలిచిపోయింది. ఎన్.టి.ఆర్, ఆయన సోదరుడు త్రివిక్రమరావు మూలస్థంభాలుగా రూపుదిద్దుకున్న ఈ సంస్థలో రచయిత సీనియర్ సముద్రాల, సంగీత దర్శకుడు టి.వి.రాజు వంటి ప్రముఖ వ్యక్తుల కృషి కూడా ఉంది. సీనియర్ సముద్రాల (రాఘవాచార్య)కు ఆయన కుమారుడు సముద్రాల జూనియర్(రామానుజాచార్య) చేదోడువాదోడుగా ఉండేవారు. తరువాత సముద్రాల జూనియర్ ఎన్నో చిత్రాలకు స్వతంత్రంగా రచన చేసినా ఎన్ఎటి సంస్థకు ఆయన రాసినవి ప్రత్యేకంగా ఉండేవి. అందులో ఎన్నదగినది,మిన్నయైనది అయిన చిత్రం 1957లో వచ్చిన

# పాండురంగమహాత్మ్యం

ఈ చిత్రానికి మాటలు-పాటలు సముద్రాల జూనియర్ రాశారు. ఇక టి.వి.రాజు సంగీతం గురించి చెప్పనే అక్కరలేదు. ప్రతిపాటా పదిమందీ మెచ్చుకునే విధంగా స్వరపరిచారు. అన్నీ మంచి పాటలే గల ఈ చిత్రంలో ప్రజలు అత్యధికంగా మెచ్చుకున్న పాటలలో కొన్ని...

తరం తరం నిరంతరం యీ అందం
ఓహో ఆనందం అందం ఆనందం ॥తరంతరం॥

ఆనంద లీలే గోవింద రూపం
ఈమాట అంటే పెద్దలకు కోపం ॥తరంతరం॥

మోజులే రేపు చిరునవ్వా చిందులూ
జాజి చెక్కిళ్ళ సోయగాల విందులూ ॥మోజు॥
వరద పొంగేనులే వయసు సింగారమూ
అనుభవించీ సుఖించీ తరించరా... హోయ్ ॥తరంతరం॥

మోహమూరించు పరువాల గోలకు
ముతక తెరచాటు అలవాటులేలనే
నేడు వెనకాడినా రేపు ఒనగూడునా
అనుభవించీ సుఖించీ తరించరా... హోయ్ ॥తరంతరం॥





ఈ పాటను ఘంటసాల పాడగా తెరపై ఎన్.టి.రామారావు ప్రధాన పాత్రధారిగా అభినయించారు. బి.సరోజాదేవి, మరికొందరు ఉపపాత్రధారులు సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. 'హ' కారాన్ని పాటలలో పెట్టి అనిర్వచనీయమైన ఆనందాన్ని, మత్తుని కలగచేసిన ఒరవడి ఘంటసాలదే... తెలుగు సినీ సంగీతానికి సంబంధించినంత వరకు ఆ ప్రక్రియలో ఎవరు పాడవలసి వచ్చినా ఆయనను అనుకరించక తప్పదు. లేదా కనీసం గుర్తు చేసే విధంగానైనా పాడక తప్పదు. ఈ పాటలో 'అహహహహా' అని ఘంటసాల అంటున్నపుడు ఆయన కంఠంలో తొణికిసలాడిన జిలుగులు, సొగసులు కేవలం అవి తమ వీనుల ద్వారా అందుకోగలిగిన వారికే తెలుస్తుందది. సాహిత్యపరంగా చూసుకుంటే రెండవ చరణంలోని-'మోహమూరించు పరువాల గోలకు ముతక తెరచాటు అలవాటులేలనే నేడు వెనకాడినా రేపు ఒనగూడునా' అనే వాక్యాలను వివరణాత్మకంగా విశ్లేషించవలసి వస్తే శృంగారపరంగా ఎంతో డెప్త్‌కి వెళ్ళి చెప్పవలసి వుంటుంది. ఒక్కొక్కసారి అది ఘాటుగా కూడా ఉంటుంది. అంచేత ఆ వాక్యాలను ఉపరితలం మీదనుంచే స్పర్శించి ఇందులో డెప్త్ ఉంది అని చిన్నగా ఆలోచనను రేకెత్తించగలిస్తే చాలు. ఆ తరువాత ఎవరి సంస్కారాన్ని బట్టి వారు తర్కించుకుంటారు.

ఆమె: నీవని నేనని తలచితిరా
నీవే నేనని తెలిసితిరా ॥నీవని॥
నిజమిది
అతడు: ఋజువేది
ఆమె: ఊహు హు హూ...
అతడు: ఆహాహాహా ॥నీవని॥
ఆమె: కలయగ జూచితి నీ కొరకై నే ॥కలయగ॥
కనుపాపలలో కనుగొన్నారా ॥కనుపాప॥
అతడు: ఔనో కాదో నే చూడనా
నీవని నేనని తలచితినే
నీవే నేనని తెలిసితినే
అతడు: కలవరపాటున కల అనుకొందు ॥కలవర॥
కాదనుకొందు కళా నీ ముందు ॥కాదను॥
ఆమె: కాదు సఖా కల నిజమేలే ॥నీవని॥



'నీవని నేనని తలచితిరా' పాటను ఘంటసాల, సుశీల పాడారు. తెరపై ఎన్.టి.ఆర్, బి. సరోజాదేవి అభినయించారు. 'నటభైరవి' రాగాన్ని ప్రధానరాగంగా తీసుకుని ఈ పాటని అల్లుకున్నారు. 'ని' అన్న స్వరాన్ని మరోసారి వేస్తే ఈ రాగం కీరవాణి రాగమైపోతుంది. అలా రెండు 'ని' లని (కైశిక నిషాదం, కాకలి నిషాదం) ప్రయోగిస్తూ కీరవాణి రాగంలా ధ్వనించకుండా ఎంతో జాగ్రత్తగా మలచారు టి.వి.రాజు. కథ ప్రకారం వేశ్య వ్యామోహంలో చిక్కుకున్న కథానాయకుడు ఆమెతో కలిసి పాడిన పాట ఇది. ఆ రోజుల్లో కథా చర్చల్లో సంగీత దర్శకుని పాత్ర కూడా ప్రముఖంగా వుండేది కనుక ఈ పాట ప్రాధాన్యత తెలిసిన టి.వి.రాజు పాటలో ఓరకమైన వశీకరణ శక్తిని నింపి మరీ ట్యూన్ చేశారనిపిస్తుంది. దానికి నిదర్శనం -ఇంటర్‌లూడ్స్ అన్నీ అరబిక్ సంగీత రీతుల్లో ఉండటమే. ఈ రకమైన పర్షియన్, అరబిక్ సంగీతానికి వశీకరణ సామర్థ్యం వుంటుందని లోగడ 'విప్రనారాయణ' చిత్రంలో 'ఎందుకోయీ తోటమాలి' పాటకు సంబంధించిన విశ్లేషణతో వివరించటం జరిగింది. మరికాస్త లోతుల్లోకి వెళితే, 'పాండురంగ మహత్మ్యం' గాని ఆళ్వారులకు సంబంధించిన 'విప్రనారాయణ' గాని, పౌరాణిక నేపథ్యంలో రూపుదిద్దుకున్నవే. ఆ చిత్రాల్లోని పాటలకు సనాతన సంప్రదాయపు పోకడలతో కూడిన వరసలు కాకుండా అరబిక్, పర్షియన్ సంగీత రీతుల్ని ఆశ్రయించటం ఎంతవరకు సబబు - అన్న ఆలోచన కూడా రానీయనంత ఉన్నతంగా, సహజంగా ఇమిడ్చి పాట అందాలను ఇనుమడింప చేసిన టి.వి.రాజుని (విప్రనారాయణ సంగీత దర్శకుడైన ఎస్.రాజేశ్వరరావుతోపాటు) అభినందించకుండా ఉండలేం.

ఆమె: వన్నెల చిన్నెల నెరా
కన్నెల వేటల దొరా
అతడు: జాణవు నా హృది రాణివి నీవె
కూరిమి చేరగ రావే చెలీ
ఆమె: వన్నెల చిన్నెల నెరా
కన్నెల వేటల దొరా
ఆమె: కనివిని ఎరుగము గదా
ఇది ఎంతో వింత సుమా
కనివిని ఎరుగము గదా
ఇది ఎంతో వింత సుమా
చాలులే సతికి కన్నులే గీటు
చతురులే పెనిమిటైనా
వన్నెల చిన్నెల నెరా
కన్నెల వేటల దొరా
అతడు: అలక లేలనే చెలీ
అలవాటున పొరపాటదీ
అలక లేలనే చెలీ
అలవాటున పొరపాటదీ
మురిసిపోవాలి చల్లనీ రేయి
పరిమళించాలి హాయీ
ఆమె: వన్నెల చిన్నెల నెరా
కన్నెల వేటల దొరా
అతడు: జాణవు నా హృది రాణివి నీవె
కూరిమి చేరగ రావే చెలీ



ఈ సందర్భంగా మరో విషయాన్ని కూడా చెప్పుకోవాలి... కర్ణాటక సంగీతానికి సంబంధించి శాస్త్రీయపరమైన స్వరజ్ఞానం కావలసినంత ఉన్నాసరే - అటు పాశ్చాత్య సంగీతమన్నా ఇటు హిందుస్థానీ సంగీతమన్నా టి.వి.రాజుగారికి పంచప్రాణాలు. అందుకే ఆయన పాటల్లో ఈ మూడు ధోరణులు ఎలా కావాలంటే అలా ఆక్రమించుకుంటూ ఉంటాయి. ఒక్కోసారి కేవలం తొంగిచూస్తూ మాత్రమే ఉంటాయి. కావాలంటే 'హన్నెల చిన్నెల నెరా' పాట పల్లవిలోని సాహిత్యాన్ని పక్కనపెట్టేసి లైట్‌గా ఆలపించుకొని చూడండి. అందులో స్వదేశీయత తక్కువగా ఉన్నట్టనిపిస్తుంది. ఇదిలా ఉండగా పాట మొత్తం హవాయిన్ గిటార్ ఉపయోగించిన తీరు గమనిస్తే హృదయానికి దగ్గరగా ఉండే నాళాలని తంత్రులుగా చేసుకొని మీటేరా అన్నంత జలదరింపు కలుగుతూ ఉంటుంది. ఈ పాటల్లో మరో ప్రత్యేకత కూడా ఉంది. అది ఘంటసాల, లీల కంఠస్వరాలలోని మాధుర్యాన్ని చిక్కగా చేసి పిండుకున్న పద్ధతి. చరణం తర్వాత వచ్చే పల్లవిలో 'హన్నెల చిన్నెల నెరా కన్నెల వేటల దొరా' అని లీల అంటుంటే అదే ట్యూన్‌లో ఘంటసాల 'అహహ అహహ అహో' అని సమాంతరంగా అనటం, ఆ తర్వాత వచ్చే అనుపల్లవిలో 'జాణవు నా హృది నా రాణివి నీవే' అని ఘంటసాల అంటుంటే పి.లీల అదే వరసని హమ్ చేయటం ఇవన్నీ పాటని ఊహించని ఎత్తులకి తీసుకు వెళ్తాయి. ఈ పాటని ఎన్.టి.ఆర్. అంజలీదేవిపై చిత్రీకరించారు.

పూర్వపు రోజుల్లో మాటలు - పాటలు ఒకరే రాయటం వల్ల కథలో ఇమిడే పాటలు, కథతో సంబంధం వుండే పాటలు వచ్చేవనడానికి ఈ చిత్రం లోని పాటల్ని కూడా చెప్పుకోవచ్చు. 'నీవని నేనని' పాటలో 'కాదనుకొందు కళా నీ ముందు' (పాత్ర పేరు కళావతి) ఒక ఉదాహరణ అయితే 'హన్నెల చిన్నెల నెరా' పాట మొత్తం అంతా మరో ఉదాహరణ. స్త్రీ వ్యామోహపరుడైన కథానాయకుడు తన భార్యకు (కూడా) ఒక సన్ని వేశంలో కన్నుగీటుతాడు. ఆ తర్వాత వచ్చే ఈ పాటలో ఆ చర్యకి ఆశ్చర్యపోయిన కథానాయిక మనోభావాలు మొదటి చరణంతో ప్రతిఫలిస్తూ ఉంటాయి. 'ఇవన్నీ మనకు మామూలే' అంటూ చాలా తేలికగా తీసుకునే కథానాయకుని వ్యసన మనస్తత్వం రెండో చరణంలో ప్రతిబింబిస్తూ ఉంటుంది. అందుకే ఈ పాటలు వింటుంటే ఈనాటికీ మనకు మొత్తం కథ గుర్తుకొచ్చేస్తూ ఉంటుంది. నిజానికి పాటల ప్రయోజనం కూడా చాలా వరకు అదే.

ఆనందమూ... ఓ
ఆనందమిదేనోయి సఖా
ఆగదు కాలం
మనేది కొద్దికాలం
క్షణాల యింద్రజాలం ॥ఆనందమూ॥
ఉన్నది నేడు
మరి రేపనుమానం... ఓ ॥ఉన్నది॥
పనిలేనిపని పరాలని
తలచువిధానం
ఈ జీవిత బహుమానం
సుఖసారపు పానం ॥ఆనందమూ॥
ముచ్చటగొన్నా
చెలి నీజతనున్నా... ఓ ॥ముచ్చట॥
మురిపాల సరాగాల
సుఖలీలలకన్నా
ఆనందపు పరమావధి
వేరే యిక సున్నా ॥ఆనందమూ॥



ఈ పాటను పి.సుశీల పాడగా బి.సరోజాదేవి అభినయించారు. కథా పరంగా కథా నాయకుని మత్తులో ముంచే సన్నివేశం కనుక ఎన్.టి.రామారావు కూడా పాటంతా కనిపిస్తారు. ఈ పాటలో ముఖ్యంగా చెప్పుకోవలసింది సుశీల కంఠం గురించి! ఆ రోజుల్లో ఆమె కంఠం ఎంత వాడిగా ఉండేదో తెలియచేసే పాటలలో ఇదొకటి! ఇక సాహిత్యం గురించి చెప్పాలంటే-భాషతో ఆకట్టుకునే జూనియర్ సముద్రాల మార్కు అక్షరేంద్ర జాలం పాటంతా పరుచుకుని మరీ కనిపిస్తుంది.

అమ్మా... నాన్నా
అమ్మా... అమ్మా అని అరచినా ఆలకించ వేమమ్మా
ఆవేదన తీరు రోజు ఈ జన్మకు లేదా ॥అమ్మా॥
పదినెలలు నను మోసి పాలిచ్చి పెంచి
మదిరోయక నా కెన్నో ఊడిగాలు చేసిన
ఓతల్లీ నిను నలుగురిలో నగుబాటు చేసితీ
తలచకమ్మా తనయుని
తప్పులు క్షమియించవమ్మా...అమ్మా... అమ్మా...
దేహము విజ్ఞానము బ్రహ్మోపదేశమిచ్చి
ఇహపరాలు సాధించే హితమిచ్చిన తండ్రిని
కనుగానని కామమున ఇలువెడల నడిపితీ
కనిపిస్తే కన్నీళ్ళతొ కాళ్ళు కడుగుతా నాన్నా...నాన్నా... నాన్నా...
మారిపోతినమ్మా నాగతి ఎరిగితినమ్మా
మీ మాట దాటనమ్మా ఒకమారు కనరమ్మా
మాతాపిత పాదసేవె మాధవ సేవేయని
మరువనమ్మ ॥మాతా॥
నన్ను మన్నించగ రారమ్మా... అమ్మ...అమ్మా ॥అమ్మా అని॥



ఏపాదసీమ కాశీ ప్రయాగాది ప
విత్ర భూములకన్న విమలతరము
ఏపాదపూజ రమాపతి చరణాబ్జ
పూజలకన్నను పుణ్యతమము
ఏపాదతీర్థము పాప సంతాపాగ్ని
ఆర్పగా జాలిన అమృతఝరము
ఏపాదస్మరణ నాగేంద్రశయనుధ్యా
నమ్ము కన్నను మహానందకరము
అట్టి పితరుల పదసేవ ఆత్మ మరచి
ఇహ పరమ్ముల కెడమై తపించువారి
కావగలవారు లేరు యీజగాన వేరే
నన్ను మన్నించి బ్రోవుమో అమ్మా...నాన్నా



'అమ్మా అని అరచినా' పాట సింధుభైరవి రాగంలో కూర్చబడింది. విస్తృతమైన పరిధిగల ఈ రాగాన్ని హిందుస్థాని సంప్రదాయంలో 'భైరవి' అని అంటారు. హనుమత్తోడి రాగానికి జన్యరాగమైన ఈ సింధుభైరవి రాగాన్ని అన్ని రకాల అనుభూతుల్ని ఆవిష్కరించటానికి ఉపయోగించుకున్నారు మన సంగీత దర్శకులు. అయితే భక్తి, విషాదం ఈ రాగంలో బాగా పండుతాయని 'అమ్మా అని అరచినా' పాట ద్వారా అనిపిస్తుంది. కథానాయకుని మనస్తత్వం విషాదయోగం నుండి భక్తి మార్గానికి పయనించనున్నదన్న కథా క్రమాన్ని సూచ్యప్రాయంగానే కాకుండా సన్నివేశ పరంగా కూడా బలంగా హత్తుకోవటానికి ఈ రాగం ఎంతగా దోహదం చేసిందో పాటవిన్న వారికి బాగా అనుభవమవుతుంది. సాధారణంగా బాధతో గుండె బరువెక్కినపుడు కంఠం రుద్ధమైపోతుంది. అప్పుడు పాటే కాదు మాట కూడా స్పష్టతను కోల్పోతుంది. కానీ శోకరసానికి జీవం పోస్తూ, విన్నవారి హృదయాలలో సానుభూతి, రసానుభూతి కలిగేలా గాద్గదిక గళంతో అనితరసాధ్యంగా ఘంటసాల పాడే పద్ధతికి ఆ తర్కం తలపుల్లోంచి పారిపోతుంది. మనసంతా ఘంటసాల స్వరమాధుర్యంతో మార్మోగిపోతుంది. ఇక సాహిత్యపరంగా చెప్పాలంటే - సముద్రాల (జూనియర్) లోతుల కెళ్ళి రాశారనిపిస్తుందీ పాటని. రెండో చరణంలో ఉన్న 'దేహము విజ్ఞానము బ్రహ్మోపదేశమిచ్చి ఇహపరాలు సాధించే హితమిచ్చిన తండ్రిని' అన్న వాక్యాలే అందుకు ఉదాహరణ. శరీరానికి ప్రాణాధారమైన బీజోత్పత్తికి కారకుడు తండ్రి. అహం బీజఃప్రధః పితా (తండ్రిగా నేనే బీజమునై ఉన్నాను) అంటూ భగవద్గీతలో చెప్పినదీ అదే. ఇహలోకానికి సంబంధించిన శరీరంతో పరలోకానికి సంబంధించిన విజ్ఞానాన్ని సాధించటానికి కావలసిన హితవే బ్రహ్మోపదేశం. అందుకే ఉపనయనంలో గాయత్రి మంత్రాన్ని వటువు చెవిలో తండ్రి చేత చెప్పిస్తారు. తండ్రి యొక్క ప్రాధాన్యతని, ప్రాముఖ్యతని చెప్పటానికి సముద్రాల ఎన్నుకున్న వస్తువు ఎంత ప్రశస్థంగా ఉందో తెలియచేయటానికి ఇంతకన్నా వేరే ఉదాహరణ ఏముంది? తెలిసిన మంచి విషయాన్ని ప్రజలకు ఉపయోగ పడేరీతిలో చెప్పడంలోనే కవి జన్మకు సార్ధకత చేకూరుతుంది. ఆ రీతిలో ఈ గీతాన్ని రాసిన సముద్రాల (జూనియర్), ఆయనలోని కవితాత్మకు 'అహం బీజః ప్రధః పిత' అన్నట్టుగా ప్రేరకుడైన సముద్రాల సీనియర్ ఈ సందర్భంగా అభినందనీయులు. ఈ పాట తరువాత వచ్చే పద్యం 'సింహేంద్ర మధ్యమం' రాగంలో స్వరపరచబడింది. పద్యం తెలుగు వాడి సొత్తు. సినిమాలకు సంబంధించినంత వరకు పాటలకే కాక పద్యాలకు కూడ అపూర్వమైన గౌరవాన్ని కట్టబెట్టిన మహా కళాకారుడు ఘంటసాల. ఆ విషయం ఈ పద్యంలో మరింత తేటతెల్లమవుతుంది. కవి ఎంత చందోబద్ధంగా రాసినా అనుభూతి కోసం ఛందస్సును కూడా అతిక్రమించి ఘంటసాల పాడతారని చెప్పటానికి కూడా ఈ పద్యం ఉపకరిస్తుంది. కావాలంటే ఈ పద్యాన్ని దగ్గర పెట్టుకుని ఆడియో ద్వారా వినిచూడండి. 'కావగలవారు లేరు... లేరు ఈ జగాన వేరే' అంటూ ఘంటసాల 'లేరు' అనే పదాన్ని రెండుసార్లు పలకటాన్ని గమనించవచ్చు.

హే...కృష్ణా...ముకుందా...మురారీ...
జయ కృష్ణా ముకుందా మురారీ ॥జయ॥
జయ గోవింద బృందావిహారీ ॥కృష్ణా॥
దేవకి పంట వసుదేవు వెంట ॥2॥
యమునను నడిరేయి దాటితివంట
వెలసితివంట నందుని ఇంట ॥2॥
వ్రేపల్లె ఇల్లాయె నంటా ॥కృష్ణా॥



నీపలుగాకి పనులకు గోపెమ్మ ॥2॥
కోపించి నిను రోట బంధించెనంట
ఊపున బోయి మాకుల గూలిచి
శాపాలు బాపితివంట ॥కృష్ణా॥



అమ్మా తమ్ముడు మన్ను తినేనూ
చూడమ్మా అని రామన్న తెలుపగా
అన్నా అని చెవి నులిమి యశోద
ఏదన్నా నీ నోరు చూపుమనగా...
చూపితివట నీనోటను
బాపురే పదునాల్గు భువన భాండమ్ముల
ఆ రూపము గనిన యశోదకు
తాపము నశియించి
జన్మధన్యత గాంచెన్ ॥జయకృష్ణా॥



కాళీయ ఫణి ఫణ జాలాన ఝుణ ఝుణ
కేళీఘటించిన గోప కిశోరా
కంసాది దానవ గర్వాపహార ॥కంసాది॥
హింసా విదూరా పాప విదారా ॥కృష్ణా॥



కస్తూరీ తిలకం లలాట ఫలకే
వక్షస్థలే కౌస్తుభం నాసాగ్రే నవమౌక్తికం
కరతలే వేణుం కరే కంకణం
సర్వాంగే హరిచందనంచ కలయం కంఠేచ ముక్తావళీమ్
గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాల చూడామణీ
విజయతే గోపాల చూడామణీ
లలిత లలిత మురళీస్వరాళీ ॥లలిత॥
పులకిత వనపాలీ గోపాలీ... పులకిత వనపాలీ
విరళీకృత నవరాసకేళీ ॥2॥
వనమాలీ శిఖిపింఛమౌళి ॥2॥
కృష్ణాముకుందా మురారీ







శ్రీ కామినీ కామితాకార
సాకార కారుణ్యధారా నవాంకూర
సంసార సంతాప నిర్వాపణా -
పాప నిర్వాపణోపాయనామ ప్రశంసానుభావా
భవా భావా హే వాసుదేవా -
సదా నంద గోవింద సేవించు మావిందవై
డెందమానంద మొందింప ఎందున్
విచారంబు లేమిన్ - వచోగోచరా గోచరత్వంబు లూహింప లేమైతిమో
దేవా-నీపాద సేవాదరంబున్ మదిన్ గోరుచున్ వేదవాదుల్ శమాదుల్
కదుంజాల నార్జించి భోగేచ్ఛ వర్జించి నానాతపశ్చర్య తాత్పర్య పర్యాకు



లత్వంబునన్ గైకొనన్ మాకునే యత్నముల్ లేకయే నీకృపాలోక సంసిద్ధి
సిద్ధించుటల్ బుద్ధి తర్కింప నత్యంత చిత్రంబుగాదే? జగన్నాథా హే జగన్నాథ
ఈరీతి చెన్నార మున్నే రుషుల్ నిను గన్నార కన్నారు - నా
కన్నులెన్నంగ యే పుణ్యముల్ జేసెనో నిన్ను దర్శింపగా - భవ్య
యోగీంద్ర సాంద్రాదరా - కాంక్షితైకాంత సంసేవనా - భావనాతీత -
కల్యాణ నానా గుణ శ్రీ సముద్భాసితాంగా - దయాపూర
రంగత్త రంగాంతరంగా నమో రుక్మిణీసంగా
హే పాండురంగా..... హే పాండురంగ
నమస్తే - నమస్తే - నమః.

'కృష్ణాముకుందామురారీ' పాట ఓమనోహర రాగమాలిక. పల్లవికి, మొదటి చరణానికి మోహనరాగాన్ని ఉపయోగించారు. 'వెలసితివంట' దగ్గర ఆ రాగంలో పడకూడని మధ్యమం ('మ' అన్న స్వరం)తో కూడిన అది కూడా అందాన్ని పెంచేదిగానే ఉంది. 'నీపలుగాకి' చరణానికి కళ్యాణి రాగాన్ని వాడుకున్నారు. పద్యాల అలాపనకు అనువైన ఆరభి రాగాన్ని 'అమ్మా తమ్ముడు మన్ను తినేను' అన్న పద్యానికి ఉపయోగించారు. 'కాళీయ ఫణి ఫణి' చరణాన్ని మాండ్ రాగంలో మలచారు. లీలాశుకుడు రాసిన 'శ్రీకృష్ణ కర్ణామృతం' లోని 'కస్తూరి తిలకం' శ్లోకానికి ఈ పాటలో సముచిత స్థానం కల్పించటం ఔచిత్యానికి నిలువెత్తు నిదర్శనం. హిందోళరాగంలో స్వరపరచిన ఈ శ్లోకం తరువాత వచ్చే 'మ' (మధ్యమం) స్వరాన్ని స (షడ్జమం) స్వరంగా చేసుకొని 'లలిత లలిత మురళీ స్వరాళి' అనే చరణాన్ని స్వరపరచారు. ఇలా చేయటాన్ని గ్రహభేదం అంటారు. ఆ రకంగా చేయించటం వల్ల పాట చివర్న 'హే కృష్ణా' అంటూ తారస్థాయిలో ఆలపించి శ్రోతల హృదయాలకు ఓ జలదరింపు, కనులకు ఓ చెమరింపు చేకూర్చగలిగారు ఘంటసాల. 'లలిత లలిత మురళీ స్వరాళి' అనే చరణాన్ని యమన్ రాగాన్ని ఆధారంగా చేసుకుని స్వరపరచారు. ఇంకాస్త తరచి చూస్తే 1936లో వచ్చి, పాటల పరంగా ప్రజాదరణకు నోచుకున్న 'సంత్ తుకారం' చిత్రంలోని 'ఆదీ బీజయీకళే, ద్విజ అంకురాళే, రూపవాఢలే' అనే మరాఠీ గీత ఛాయలు కనిపిస్తాయి. తరువాత 1973లో తెలుగులో వచ్చిన 'భక్త తుకారం' చిత్రంలో వినిపించిన అభంగాలలోని 'నీవే ఆది దైవము' అనే చరణానికి ఈ ట్యూన్‌ని యధాతథంగా సంగీత దర్శకుడు ఆది నారాయణరావు వాడేరు. 'పాండురంగ మహత్మ్యం'కి సంగీతాన్ని ఇచ్చిన టి.వి.రాజు ఒకప్పుడు ఆదినారాయణరావుగారి దగ్గిర శిష్యరికం చేసినవారే కనుక, అప్పటికే ఆదినారాయణరావుగారికి మరాఠీ సంగీతం మీద కూడా అవగాహన ఉండటం వల్ల 'లలిత లలిత' చరణానికి ఆ మరాఠీ గీత సువాసనలు అబ్బటంలో ఆశ్చర్యం లేదు. 'కృష్ణాముకుందామురారీ'లో పాటకు చేసిన స్వర రచన అంతా ఒక ఎత్తు. 'లలిత లలిత మురళీ స్వరాళీ' చరణం తర్వాత సుమారు రెండున్నర నిముషాలపాటు వచ్చే వాద్య సంగీతం ఒక్కటీ ఒక ఎత్తు. వేణువాద్యంలో నైపుణ్యం సంపాదించాలనుకునేవారెవరైనా సరే ఈ వాద్య సమ్మేళనాన్ని ఒకసారి గనుక వినటం తటస్థిస్తే సాధన చేయకుండా ఉండటం కష్టం.

ఈ చిత్రం దర్శక నటి విజయనిర్మల తొలిచిత్రం కావటం, ఆమె శ్రీకృష్ణునిగా కనిపించటం, తర్వాతి రోజుల్లో ఆమె పాపులర్ అయ్యాక ఈ గీతానికి చేకూరిన మరో ప్రత్యేకత. పాట తరువాత వచ్చే దండకం ఆరభి రాగంలో స్వరపరచబడింది. ఇటువంటి దండకాలను, శ్లోకాలను సాధన చేయడం వాక్శుద్ధిని కోల్పోతున్న ఈనాటి ఔత్సాహిక గాయకులకు అత్యంత అవసరం. ■



*This feature for this issue is sponsored by*
***Shri Bhamidipati Venkateshwara Rao**,*
*(an ardent fan of **Haasam**)*
*as a mark of respect to his departed parents*
***Sri Subba Rao & Smt. Subbalakshmi***

# 'ఇక బయలుదేరండి'

ఇలా జరిగితే మీరు మీ బంధువుల ఇంట్లో చాలాకాలంగా తిష్ట వేసినట్టు లెక్క!

సత్యమూర్తి.బి



మీకు అర్జంటైన టైమ్‌లో బాత్రూమ్‌కి తాళం వేసి ఉంచితే...



వాళ్ళ కుటుంబంతో సహా రాత్రిళ్ళు హోటల్‌కి తీసుకెళ్ళమని మిమ్మల్ని బలవంతపెట్టి రోజూ తినేస్తూంటే...



"నేను రాసిన నవలని ఫెయిర్ కాపీ చెయ్యి బాబు" అని అంటే...



భోజనంలో, టిఫిన్‌లో బాగా రాళ్ళు తుక్కు వేసి పెడ్తూంటే...



"నిన్న బియ్యంలో రాళ్ళు బాగా తీసేవ్. ఈవేళ ఆ బస్తా బియ్యం కూడా చెరుగు నాయనా" అని అంటే...



సాయంకాలానికే తెచ్చేస్తాడనుకుని మీ బట్టలన్నీ వేసిన కొంతసేపయ్యాక 'ఈ చాకలి 3 నెలలు దాకా తేడు' అని అంటే...

డిసెంబర్ 23న ఈమని శంకర శాస్త్రి 16వ వర్ధంతి

# వీణమీటి ఆమని పలికించిన "ఈమని"



**భా**రత దేశం లోనే కాంటాక్ట్ మైక్ని (పికప్) మొదటగా వీణకు వాడి వీణానాదంలోనూ, మీటు లోనూ నాజూకులూ, నయాగారాలూ తెచ్చిన తొలి వైణికులు "ఈమని శంకర శాస్త్రి". ఒక నాడు గాత్ర సంగీత కచేరీల్లో సహ వాయిద్యంగా ఏ మూలకో పరిమితమైన వీణ ధ్వని వయొలిన్, వేణువుల నడుమ వినపడకుండా పోయేది. ఒక రకంగా శ్రోతలకు వీణనాదం ఆ కచేరీలో ఉందన్న స్పృహకూడా వచ్చేదికాదు. అలాంటి వెనుక బడిన స్థితి నుండి కర్ణాటక సంగీత సభా వేదికలపై సోలో వాద్యకచేరీల్లో గాత్ర కచేరి తరువాత వీణ వాదనను చేర్చి అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన వారు ఈమని శంకర శాస్త్రి.

**తూ**ర్పు గోదావరి జిల్లా ద్రాక్షారామంలో 1922 అక్టోబర్ 22న ప్రసిద్ధ వీణా విద్వాంసుడు అచ్యుత రామశాస్త్రి ఇంట జన్మించారు ఈమని. తండ్రి వద్దనే వీణా వాదనలో శిక్షణ పొందా రాయన. పదిహేనేళ్ల నాటికే వీణా వాదనలో సిద్ధహస్తుడైన ఈమనివారు కాకినాడ లోని పిఠాపురం మహారాజు కళాశాలలో బి.ఏ. చదివారు. 1938లో కాకినాడ 'సరస్వతీసభ' వారు దసరా సందర్భంగా ఏర్పాటు చేసిన సంగీత ఉత్సవాలలో తొలిసారిగా వీణాకచేరి చేసి సభకుల్లోని సంగీత విద్వాంసులను సైతం ముగ్ధులను చేశారు.

**వీ**ణపై వేదమంత్రాలు పలికించడంలోనే గాక పలు పాశ్చాత్య స్వరాలను వాయించడం లోనూ ప్రావీణ్యం గడించిన ఈమని నాటి మద్రాసు రాష్ట్రమంతటా ప్రదర్శనలిచ్చి పేరు పొందారు. 1940 ప్రాంతంలో అనేక తెలుగు, తమిళ హిందీ చిత్రాల్లో సంగీత దర్శకత్వ నిర్వహణలో పాలు పంచుకున్నారు. ఇదంతా జెమిని స్టూడియోలో పనిచేసినపుడు జరిగింది.

**అ**నంతరం ఆకాశవాణి ఢిల్లీ కేంద్రంలో శాస్త్రీయ సంగీతానికి డైరెక్టర్‌గా నియుక్తులైన శాస్త్రిగారు ఆతర్వాత కర్ణాటక సంగీత విభాగానికి చీఫ్ ప్రొడ్యూసర్ అయ్యారు. 1960లో ఫిలింస్ డివిజన్ వారు రూపొందించిన "జుగల్ బందీ" డాక్యు మెంటరీలో కర్ణాటక సంగీతానికి ఈమనివారు వీణలో, హిందుస్థానీకి సితారుతో నేటి భారతరత్న పండిట్ రవిశంకర్ ప్రాతినిధ్యం వహించారు. ఈ సందర్భంగా ఈమనివారు భరతుడి నాట్య శాస్త్రం నుండి, సంగీత రత్నాకరం నుండి గమకాలను గురించిన శ్లోకాలతో వివరిస్తూ వీణపై పలికించిన శైలి అనితర సామాన్యం.

**వీ**ణా వాదనలో గాత్ర ధర్మం, వాద్య ధర్మం అనే రెండుశైలులున్నాయి. వీటిలో ఈమని వారిది గాత్ర ధర్మం. వీణపై ఆయన మానవ కంఠ స్వరాలను పలికించేవారు. 'ముఖ్యంగా స్త్రీ స్వరాన్ని,' ఏ రాగాన్ని వాయించినా దాని కనుగుణ మైన గమకాలతో, శాస్త్రీయతకు ఎలాంటి భంగం వాటిల్లకుండా రాగహృదయాన్ని ఆవిష్కరించే వారు. ముఖ్యంగా తోడి, శంకరాభరణం రాగాలను వాయించడంలో ఆయనది అందె వేసిన చేయి. హిందుస్తానీ సంగీతంతో బాటు పాశ్చాత్య సంగీతాన్ని సైతం ఆకళింపు చేసుకుని తనదైన ఒక వినూత్న వైణికశైలిని ఆయన సమకూర్చుకున్నారు.

**వీ**ణావాదనలో ఎంత వైవిధ్యాన్ని తేవాలో అంత వైవిధ్యాన్ని సృజించిన వారు ఈమని. వీణ ను ఒక్కోసారి సితారగా, మరోసారి సరోద్‌గా,



కూతురు కళ్యాణితో...

ఇంకో సారి గిటారుగా, ఒక్కొక్కసారి గోటు వాద్యంగా ఇంకా చెప్పాలంటే తంత్రీ వాద్యాల వ్యక్తిత్వాల నన్నిటినీ తన వీణలో ప్రతిబింబించిన ప్రతిభా సంపన్నులు ఆయన. మరొక విశేషమేమిటంటే ఎవరికీ సాధ్యంకాని లౌకిక సంఘటనలను వీణానాదంలోకి అనువదించారు. టెన్సింగ్ నార్కె ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించా డనే వార్తకు స్పందించి "ఆదర్శశిఖరారోహణ" అనే కంపొజింగ్స్‌ని తయారు చేసి ప్రశంస లందుకున్నారు. ఇలాంటిదే వీరు రూపొందించిన "భ్రమరగీతం" అనే సంగీత రచనం. ఇలా శాస్త్రిగారు తమ జీవితంలో వందలాది ప్రయోగాలు చేసారు. అవన్నీ వీణా వాదన సంప్రదాయంలో అనుసరణీయాలుగా నిలిచి పోయినవి.

**భా**రతీయ సంగీతంలో, ముఖ్యంగా కర్ణాటక సంగీతంలో గమకాలను స్పష్టంగా నిర్వహించిన వైణికుడు ఈమని. శాస్త్రగ్రంథాల్లో పేర్కొన్న 'పంచదశ గమకాలు", దశవిధ గమకాల స్వరూప స్వభావాలను నిశితంగా అధ్యయనం చేశారు. కచేరీలలో, ప్రసంగాలలో ఆయన అధ్యయన తత్పరత వ్యక్తమయ్యేది. 1954లో సుప్రసిద్ధ సితార్ విద్వాంసులు పండిట్ రవిశంకర్‌తో కలసి చేసిన జుగల్‌బంది ఆయన సంగీత జీవితంలో ఒక మైలురాయి వంటిది.

**శం**కరశాస్త్రి శిష్యరికంలో ఎందరో వీణా వాదనలో నిష్ణాతులై విద్వాంసులైనారు. వీరిలో ముఖ్యులు చిట్టిబాబు. ఈతడు గురువును మించిన శిష్యుడిగా ఎదిగాడు. చివరిరోజుల్లో చిట్టిబాబు ప్రభృతులు ఈమని వారికి గుంటూరు లో కనకాభిషేకంచేసారు. శాస్త్రిగారు దేశదేశాల్లో కచేరీలు చేసారు. వయొలిన్‌మేస్ట్రో యాహుది మెనుహిన్‌చే ప్రశంసలందుకున్నారు. శంకరాభరణ రాగానికి జగద్విఖ్యాతి తెచ్చి పెట్టారు. ఒకానొక సందర్భంలో "సి.మేజర్"తో సమానుడని పించుకున్న ఆయన "ప్రిన్స్ ఇటాలియా ఇంటర్నేషనల్" అవార్డును అందుకున్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం కళాప్రపూర్ణతో సన్మా నించగా, భారత ప్రభుత్వం "పద్మశ్రీ" తో గౌరవించింది. ఢిల్లీ అఖిలభారత గాంధర్వ మండలివారు "మహామహోపాధ్యాయ" బిరుదుతో సత్కరించారు. ఈ బిరుదాన్ని పొందిన దక్షిణ భారతీయుల్లో ఈయనే ప్రథములు.

**ఈ**మనివారు చివరిసారిగా గుంటూరులో నాలుగున్నర గంటలపాటు వీణకచేరి చేసి సర్కార్ ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసు ప్రయాణమై రైలులోనే నిద్రలో అంతిమశ్వాస విడిచారు. ఆరోజు 23 డిసెంబర్ 1986. సంగీత కచేరీ వేదికలపై ఎక్కడోమూలన ఉన్న వీణను సోలో వాద్య పరికరంగా సెంటర్‌ఫ్ స్టేజికి తీసుకువచ్చిన వైణిక స్వర వైతాళికుడు ఈమని శంకరశాస్త్రి.

**- హెచ్.పి.ఆర్.**

డిసెంబర్ 19న ఓంప్రకాష్ జయంతి సందర్భంగా...







# నవ్వకనే నవ్వించిన... కమెడియన్ ఓంప్రకాష్

- 'మిస్సమ్మ'లో రేలంగిది పూర్తి హాస్యపాత్ర. దాన్ని 'మిస్‌మేరీ'గా హిందీలో తీసినపుడు ఆ పాత్ర వేసినది-ఓంప్రకాష్.
- 'పండంటికాపురం'లో ఎస్వీ రంగారావుది సెంటిమెంటు పాత్ర. దీన్ని 'సున్హేరా సంసార్'గా హిందీలో తీసినపుడు ఆ పాత్ర వేసినది-ఓంప్రకాష్.
- 'కథానాయకుడు'లో నాగభూషణంది కామెడీవిలన్. దాన్ని 'అప్నాదేశ్'గా హిందీలో తీసినపుడు ఆ పాత్ర వేసినది-ఓంప్రకాష్.
- గ్యాలరీలకై ఓవర్‌యాక్షన్ చేయగల ఓంప్రకాష్ హృషికేశ్ ముఖర్జీ సినిమాలలో 'అండర్‌ప్లే' కూడా చేయగలడు.
- 'చుప్‌కేచుప్‌కే'లో సున్నితమైన హాస్యానికైనా సరే! 'ఆలాప్'లో మెలోడ్రామాకైనా సరే, అతనికతనే సాటి!
- నటనలో ఇంత వైవిధ్యం చూపగల ఇతడు నిర్మాత, దర్శకుడు కూడా!

O హిందీ చిత్ర సీమలో తొలితరం కమెడియన్లలో ఓంప్రకాష్ ఒకడు. పెదవులను బిగపట్టి మాటలను జారవిడుస్తూ వెటకారంగా ఆయన మాట్లాడే తీరు ప్రేక్షకులకు ఇప్పటికీ గుర్తుండే ఉంటుంది. శరీరాన్ని కదిలిస్తూ గాక మాటలను నవ్వుల కోసం వలగా విసురుతూ భావాన్ని మొహంలో


'మిస్ మేరీ' చిత్రంలో మీనాకుమారి, జెమిని గణేష్‌లతో ఓంప్రకాష్

పలికించడం ఓంప్రకాష్‌లోని ప్రత్యేకత.

O టాకీలు వచ్చిన 1931లోనే సినిమా రంగంలోకి ప్రవేశించిన ఓంప్రకాష్ 1919 డిసెంబర్ 19న లాహోర్‌లో పుట్టాడు. మదన్ థియేటర్స్ వారి "షరీఫ్ బద్మాష్" (1937)లో ఒక చిన్న వేషం వేసి సినీ రంగానికి పరిచయమైన ఓంప్రకాష్ ఝూంఝుర్, ధువా, దాసి, ధమ్కీ వంటి చిత్రాల్లో నటించి కమెడియన్‌గా స్థిరపడ్డారు.

O అయితే తనను కమెడియన్‌గా పరిశ్రమ గుర్తించడం ఇష్టంలేని ఓంప్రకాష్ ప్రధాన పాత్రల్లో నటించాలనుకున్నారు. ఫలితంగా తనను తాను నిరూపించుకోవాలని నిర్మాతగా, దర్శకునిగా మారాడు. అరుదైన పాత్రలు వస్తే కళ్లకద్దుకుని నటించాడు.

ఓంప్రకాష్ దర్శకత్వం వహించిన తొలి సినిమా "దునియా గోల్‌హై"(1955). తరువాత "గేట్‌వే ఆఫ్ ఇండియా" (1957), చాచా జిందాబాద్ (1959)" చిత్రాలను 'లైట్ అండ్ షేడ్' పతాకం క్రింద నిర్మించి, దర్శకత్వం నెరిపాడు. స్వతహాగా మంచి సంగీత ప్రియుడైన ఓం తన సినిమాలకు రాజేంద్రకిషన్‌చే పాటలు, మదన్‌మోహన్‌చే సంగీతం చేయించాడు. 1967లో తన సినీ జీవిత రజతోత్సవాల్లో లత తను పాడిన పాటల్లోని టాప్ టెన్‌లో "చాచా జిందాబాద్"లోని బైరన్ నీంద్ న ఆయే మొహె"ను చేర్చడం గమనార్హం.

O ఈ నేపథ్యంలో ఓం ప్రకాష్ కమెడియన్‌గా, కారెక్టర్ ఆర్టిస్టుగా ఆంధీ(1975), గోపి (1970), గరంగరం (1957), మిస్టర్ చక్రం (1956), షరాబి (1984), ఖాందాన్, జోరూకా గులామ్ (1972), ప్యార్‌కి యేజాయ్ (1968), పడొసన్ (1968), ప్రేమ్‌రోగ్, రామ్‌తేరీ గంగామైలీ వంటి 300 చిత్రాల్లో నటించాడు. అమితాబ్ హీరోగా నటించిన "నమక్ హలాల్"లో అతని తాత "దద్దూ"గా ఓంప్రకాష్ ఈతరం వారిని సైతం అలరించాడు.

O ఓంప్రకాష్ సినీ నట జీవితంలో ఒక విశేషముంది. అతను మద్రాసు-బొంబాయి సినిమా రంగాలకు వారధిలా ఉండేవాడు. మద్రాసు నిర్మాతలు తీసే చాలా హిందీ చిత్రాల్లో ఈయన నటించాడు. ముఖ్యంగా ఎ.వి.ఎం, జెమిని వారి చిత్రాల్లో నటించాడు. బహార్, లడ్కీ, ఆజాద్, మిస్‌మేరీ, శారదా, మన్‌మౌజీ, ఖాందాన్ వంటివి మద్రాస్ నిర్మాతలు తీసినవే. "దస్‌లాఖ్" చిత్రానికి బెస్ట్ కమెడియన్‌గా ఫిలింఫేర్ అవార్డు వచ్చిందాయనకు. ప్యార్‌కియే జాయ్‌లో మొహమూద్ తండ్రిగా అతడితో కలిసి నటించిన ఒక సీను ఇప్పటికీ వందలసార్లు టీవీ ఛానల్స్‌లో ప్రసారమై ఉంటుంది. సినిమా పిచ్చితో మొహమూద్ తాను తీయబోయే దెయ్యాల కథ చెప్పి ఓంప్రకాష్‌ను జడిపించే సీను వారిద్దరి హాస్యనటనకు పరాకాష్ఠ. తెలుగులో ప్రేమించి చూడులో ఈ దృశ్యాలను రేలంగి చలంపై తీశారు.

O పంజాబీయాసలో విభిన్నంగా డైలాగ్‌లు పలికే ఓంప్రకాష్ ఫతే-దిన్ పేరుతో రేడియోలో పలు నాటకాల్లో పాల్గొన్నాడు. నటనలో ఎంతగా హాస్యాన్ని ఒలికిస్తాడో నిజ జీవితంలో ఆయన అంత సీరియస్‌గా కనిపిస్తాడు. అందుకే కామెడిని ఎంత గొప్పగా పండించగలడో అంతే గొప్పగా తాతగా, తండ్రిగా ఆర్ద్రతతో కూడిన కారెక్టర్ పాత్రలను జీవింపజేస్తాడు. "దిల్ ఎక్ మందిర్"లో చావు కోసం ఎదురు చూసే రోగి అయి ఉండి నలుగురినీ నవ్విస్తూ తిరిగే పాత్రనెలా మెప్పిస్తాడో "గోపీ" చిత్రంలో దిలీప్‌కుమార్‌కు పేద వాడైన అన్నగా నటిస్తూ అంతే గొప్పగా ప్రేక్షకుల సానుభూతినీ పొందిన నటుడు ఓంప్రకాష్.


"ఆంధీ"లో పొలిటీషియన్‌గా...

O ఆరున్నర దశాబ్దాల నట జీవితాన్ని గడిపిన ఓంప్రకాష్ 1998 ఫిబ్రవరి 21న ల్యుకేమియా వ్యాధితో బాధపడుతూ మృతిచెందాడు. తనదైన విలక్షణ నటనతో హాస్యం పండించి నవ్వులు పూయించిన ఓంప్రకాష్ మనకెప్పటికీ గుర్తుండిపోతాడు.

**- పద్మజారాయ్**

డిసెంబరు 18 మాధవపెద్ది సత్యం వర్ధంతి సందర్భంగా...

# సరిగమలు-గలగలలు

## మాధవపెద్ది సురేష్

(సినీ సంగీత దర్శకుడు)





బాబాయ్ చనిపోవటానికి 9 నెలల ముందు తీసినది

మా మామ్మ సుందరమ్మ గారికీ, తాతగారు లక్ష్మీ నరసమ్మగారికీ బహుసంతానం. కొంతమంది చనిపోగా మిగిలిన 5మంది అన్నదమ్ముల్లో మధ్యముడు సత్యనారాయణ. ఆయనే మాధవపెద్ది సత్యం. మా తాత లక్ష్మీ నరసయ్యగారికి 'పేక' అంటే చాలా ఇష్టం. పే అంటే పేకాట. కా అంటే కాంగ్రెస్. ఆయన చాలా నీతీ, నిజాయితీ ఉన్న సీనియర్ కాంగ్రెస్ రాజకీయవాది. సుమారు 20 ఎకరాల ఆస్తిమొత్తం కాంగ్రెస్‌కి సమర్పించారు. గాంధేయవాది. మా మామ్మగారి విలువైన బట్టలన్నీ అగ్నికి ఆహుతి చేసి జీవితాంతం ఖద్దరు బట్టల్నే కట్టిన ఆజంట నిజమైన కాంగ్రెస్ వాదులు. కొంత ఆస్తి పేకాటకి సమర్పించారు. అనుభవం సంపాయించారు.

మా నాన్నగారు నాగేశ్వరరావుగారు అగ్రజుడు. తరువాత గోఖలేగారు, తరువాత సత్యంగారు, గాంధీగారు, ప్రసాద్‌గారు. సత్యం గారికి చదువు పెద్దగా అబ్బలేదు. థర్డ్‌ఫామ్ వరకూ చదివాడు. ఆరోగ్యంమీద బాగా శ్రద్ధ. మంచి తిండి పుష్టి కలవాడు. చిన్నప్పుడు పందాల్లో 3 దెబ్బల్లో కొబ్బరి కాయని చేతుల్తో పగలగొట్టేవాడట. మా ఇంటికి భోజనానికి వస్తే ఒక కొబ్బరికాయ కు వచ్చే పచ్చడి మొత్తం ఆయనొక్కడే తినేవాడు. మా తాతగారింట్లో ఎక్కువ పని సహాయం ఆయనే చేసేవాడుట. ఎక్కువగా హాస్యప్రియుడు.

మా తాతగారి తల్లి గేదెలకీ, ఆవులకీ పాలు పిండేది. ఒక రోజు ఆవిడ ఊరెళ్లింది. ఎవ్వరికీ అవి పాలివ్వటంలేదు. సత్యం బాబాయ్ తెల్లచీర కట్టుకుని ఆవిడలాగా తయారై పాలు పిండి



'మాయాబజారు'లో దారుకుడు వేషం వేసినప్పుడు సెట్లో గోఖలే బాబాయ్ తీసినది

ఇచ్చాడట. నాటకాలు వేసేవాడు. మా తాతగారికి వరసకి తమ్ముడైన వెంకట్రామయ్యగారు గొప్ప స్టేజీ నటులు. సత్యం బాబాయ్‌కి ఆయన ఇన్స్పిరేషన్ ఎక్కువ. మల్లాదిగారి డ్రామాట్రూప్‌లో నక్షత్రకుడుగా మంచిపేరు సంపాయించాడు.

చింతామణిలో బిల్వమంగళుడు, తారా శశాంకంలో బృహస్పతి, కురుక్షేత్రంలో దుర్యోధనుడు ఇలా ఎన్నో వందల నాటకాల్లో నటించి పేరు ప్రఖ్యాతులు సంపాయించాడు. మహామహులు పీసపాటి నరసింహరాజు, ఈలపాట రఘురామయ్య, అబ్బూరి, వేమూరి గగ్గయ్య, మాధవపెద్ది వెంకట్రామయ్య, అద్దంకి శ్రీ రామమూర్తి ఇలా ఎంతో మంది గొప్ప అనుభవజ్ఞులందరితోనూ నటించాడు, నటనకి పదును పెట్టుకున్నాడు. మిమిక్రీ చాలా బాగా చేసేవాడు. సూరిబాబుగారినీ, రఘురామయ్య గారినీ, అబ్బూరి సోదరులనీ, ఇలా ఎంతోమందిని అమోఘంగా ఇమిటేట్ చేసేవాడు.

నటుడిగా మాధవపెద్ది వెంకట్రామయ్యగారు గురువయితే, ప్రఖ్యాత సంగీత దర్శకుడూ, హార్మోనిస్టు అయిన పసుపులేటి మునుస్వామిగారు ఇంకోరకంగా గురువు. బాబాయ్‌కి మంచిరాగ జ్ఞానం ఏర్పడటానికి, పద్యాలు భావయుక్తంగా, శృతి శుద్ధంగా పాడటానికి మునుస్వామిగారే ముఖ్యకారకుడు.

సినిమాల్లో కూడా అడపా తడపా మంచి వేషాలు వేసేవాడు. షావుకారులో పిచ్చన్న తాత, మాయాబజార్‌లో దారుకుడు, దక్షయజ్ఞం, సంపూర్ణ రామాయణంలో వాల్మీకి ఇలా ఎన్నో మంచి వేషాలు, గుర్తుపెట్టుకొనే వేషాలు వేశాడు.

నేనూ, అన్నయ్య రమేష్ విజయవాడలో భావనా కళా సమితి ద్వారా ఎన్నో లైట్ మ్యూజిక్ ప్రోగ్రామ్స్ లో పాల్గొనే వాళ్లం. మాకు మొట్టమొదటగా 'సినిమా గ్లామర్' అనేది మా బాబాయ్ ద్వారానే తెలిసింది. బాబాయ్, పిఠాపురంతో కచేరీలలో పాల్గొనేవాళ్లం. నాకు 25/-, అన్నయ్యకి 50/- ఇచ్చేవాళ్లు. మొదట్లో బాబాయ్, పిఠాపురం స్టేజి ఎక్కారంటే ఎంతో హుషారు. వాళ్ల కచేరీలలో వాయిస్తుండేప్పుడు నాకు శ్రీఅప్పలరాజుగారు (సంగీత దర్శకుడు ఎ.ఎ.రాజు) నిత్యానందంగారు (ప్రముఖ సంగీత దర్శకులూ, హార్మోనిస్టూ) షోలాపూర్ రామారావుగారు, వైలెన్ రామ్మూర్తి గారు డ్రమ్స్ ఆనందన్ (ప్రఖ్యాత డ్రమ్మర్ శివ మణి నాన్నగారు) లాంటి ప్రముఖులు పరిచయమయ్యారు.

మాయాబజార్ 1957లో విడుదలయింది. నాకప్పుడు 6ఏళ్లు. మనసులో బాగా ముద్రపడిన సినిమా అది. అప్పటి నుండి ఆల్మోస్ట్ ప్రతి సంవత్సరం మద్రాసు వెళ్లేవాళ్లం. మానాన్నగారికి



విశాఖపట్నంలో (2000 సం॥)నేనూ, బాబాయ్ పేకాట పాట పాడుతున్నప్పుడు



సత్యం బాబాయ్, గోఖలే బాబాయ్, మా నాన్నగారు
**(1960 ప్రాంతాలలో బ్రాహ్మణ కోడూరులో తీసినది)**

పేకాటంటే చాలాయిష్టం. సత్యం బాబాయ్, గోఖలే బాబాయ్ వాళ్ల ఇళ్లల్లో రెగ్యులర్‌గా పేకాట ఆడేవాళ్లు. నేనూ, అన్నయ్య వచ్చేవాళ్లందర్నీ చూస్తుండే వాళ్లం. పాలగుమ్మి పద్మరాజుగారు, ఆర్ట్ డైరెక్టర్ కృష్ణారావుగారు, సీనిక్ ఎఫెక్ట్స్ ఆర్.జయరామరెడ్డిగారు లాంటి ప్రముఖులు వచ్చే వారు.

బాబాయ్ ఇంట్లో హెచ్.ఎమ్.వి. గ్రామఫోన్ వుండేది. పెద్దమనుషులులో 'నాన్నాపులీ' అనేపాట, మాయాబజార్ పాటలు, ప్రైవేట్ రికార్డ్స్... ఇలా ఎన్నోపాటలు రోజూ అందంగా సరదాగా వింటూ ఉండేవాళ్లం.

సత్యం బాబాయ్‌కి ఏనాడూ ఫాల్స్ ప్రేస్టేజి ఉండేది కాదు. ఆయన హయాంలో టెలిఫోన్ లేదు, కారులేదు. బాబాయ్ ఎప్పుడూ సైకిల్ మీదే వెళ్లేవాడు.

రికార్డింగ్‌కి మాత్రం కంపెనీ నుండి కారు పంపించేవారు. ముఖ్యంగా బాబాయ్‌లో నాకు

## సత్యం బాబాయ్ చెప్పిన కొన్ని పేకాట జోక్స్

మాధవపెద్ది, పిఠాపురం జంట గాయకులు. ఇద్దరూ కలిసి ఎన్ని హిట్ సాంగ్స్ పాడారో అందరికీ తెలుసు. నావరకూ ఇద్దరూ ఒకటే! మాధవపెద్ది నాగేశ్వరరావు లేదా పిఠాపురం సత్యం. ఇద్దరూ ఒకళ్లమీద ఒకళ్లు తెగ జోక్స్ వేసుకొనేవాళ్లు.

ఘంటసాలగారు, ఎస్.వి. రంగారావుగారు, రేలంగిగారు చనిపోయినప్పుడు బాబాయ్ ఎంత బాధ అనుభవించాడో ఆ దేవునికెరుక. అలాగే పిఠాపురం బాబాయ్ పోయినప్పుడు కూడా. 2000 సంవత్సరం నవంబర్‌లో నాకు ఢిల్లీలో ఓ ప్రోగ్రామ్ వుండి వెళ్లేప్పుడు బాబాయ్ కాళ్లకి నమస్కారం చేసి ఆశీర్వాదం తీసుకున్నాను. 'ఒరేయ్! ప్రోగ్రాం బ్రహ్మాండంగా చెయ్యి, మంచిపేరు సంపాదించి, క్షేమంగావెళ్లి లాభంగారా!' అని దీవించి పంపాడు. ఇవే నాతో మాట్లాడిన ఆఖరుమాటలు! డిసెంబర్ 18 (2000) బాబాయ్ చనిపోయాడు.










నేనూ, అన్నయ్యా ఎవరికైనా ముక్క తీ సిచ్చేవాళ్లం. అది జోకర్ అయితే మాకు రూపాయి ఇచ్చే వాళ్లు. అప్పుడప్పుడు రేలంగి గారు, ఎస్. వి. రంగా రావుగారు, ప్రభాకరరెడ్డిగారు, కోదండ పాణిగారు ఇలా చాలామంది ప్రముఖులంతా వచ్చేవాళ్లు. వాళ్లందర్నీ చూస్తుంటే దేవుళ్లని చూసినంత సంబరం!

రికార్డింగ్‌కి వెళ్తుండే వాళ్లం. మా బాబాయ్‌లు మమ్మల్ని అప్పుడప్పుడు తిట్టేవాళ్లు, 'కాళ్లకి అడ్డంపడకండి' అని. ఎందుకంటే కంపెనీ కారు రాగానే ముందు మేము ఎక్కికూర్చొనేవాళ్లం. ఎలా మరచిపోగలను ఆ తీపి జ్ఞాపకాలని? సత్యం

నచ్చిన గొప్పగుణం ఒకటుంది. ఆయన ఏనాడూ ఎవ్వరికీ అప్పు ఇవ్వలేదు. అప్పు తీసుకోలేదు. తెగ జోక్స్ వేసేవాడు. మా నాన్నగారు, గోఖలేగారు, సత్యంబాబాయి ఎప్పుడూ తెల్లటి పైజమా, లాల్చీ వేసుకొనేవారు. వాళ్లకోసమే ఆ డ్రస్ పుట్టినట్లుండేది. పైగా ఆజానుబాహులు.

బాబాయ్ అల్పసంతోషి. అందరితోనూ చనువుగా ఆప్యాయంగా మాట్లాడేవాడు. అందరికీ ఆయన 'బాబాయే'. ఘంటసాల గారంటే ఎంతో అభిమానం. అలాగే బాలూగారన్నా కూడా ఎంతో అనురాగం. ఒక కడుపున పుట్టకపోయినా పిఠాపురం బాబాయ్ సొంత అన్నదమ్ముల కన్నా ఎక్కువగా మెలిగేవారు. మాకు కూడా బాబాయ్ ఎంతో పిఠాపురం బాబాయి కూడా అంతే.

అంతకు ముందు సుమారు 17 నెలల క్రితం ఆయన భార్య చనిపోయింది. ఆవిడమీద లోలోపల దిగులు పెట్టుకున్నాడు. చనిపోవటానికి నెల ముందు సెమీ కోమాలోకి వెళ్లిపోయాడు. ఆఖరున మాట్లాడిన గాయని శ్రీమతి ఎస్. జానకి. అప్పటికప్పుడు వచ్చి ఒక గంట బాబాయ్‌తో ఎంతో ప్రేమగా మాట్లాడింది ఆవిడ. తమాషా ఏమిటంటే బాబాయ్ చనిపోయిన 11రోజుల వరకూ నేనే మద్రాసు రాలేక పోయాను- ముందు ఒప్పుకొన్న ప్రోగ్రామ్స్ వల్ల! 10వ రోజు విశాఖపట్నంలో ఎస్.పి.బి.గారు, రావికొండలరావు గారి ఆధ్వర్యంలో సంతాపసభ పెట్టాము. అలాగే 12వ రోజున మద్రాసులో ఆంధ్రా సోషల్ అండ్

# సత్యం బాబాయ్ చెప్పిన కొన్ని పేకాట జోక్స్




**బాబాయ్ చనిపోయిన తరువాత మా ఫ్యామిలీలో పేకాట ఆడటంలేదు.**

కల్చరల్ క్లబ్‌లో సంతాపసభ పెట్టాము. బాబాయ్‌కి కావలసిన ఆప్తులందరూ తరలివచ్చారు. అంతే కాకుండా బాబాయ్ వరమ వదించిన సంవత్సరానికి మద్రాసులో ఎంతో వైభవంగా సభ జరిగింది. అందరు గాయనీ గాయకులు వచ్చి పాడటం ఆయనకి సినీ పరిశ్రమ చేసిన నిజమైన నివాళి! బాబాయ్ హాస్పిటల్‌లో ఉన్నప్పుడు పి.సుశీలగారు, లీలగారు, జిక్కిగారు ఇలా ఎంతో మంది ప్రముఖులు వచ్చి బాబాయ్‌ని చూసి ఎంతో చలించి పోయారు! భౌతికంగా బాబాయ్ లేకపోయినా, ఎస్.వి. రంగారావు గారికి ఆయన పాడిన పద్యాలు, పాటలు, హాస్యగీతాలు ఎవ్వరూ మరచిపోలేరు. రంగారావుగారి కోసం బాబాయ్ పుట్టాడో లేక బాబాయ్‌కోసం రంగారావుగారు పుట్టారో చెప్పలేం కానీ ఎంతో గొప్ప కాంబినేషన్ వాళ్లది! ముఖ్యంగా సంపూర్ణ రామాయణంలో 'పేరుతెచ్చినవాడా! పెద్దకొడుకా! అనే పద్యం, బంగారుపాపలో 'తళాంగు తకధిమి తోల్ బొమ్మ' లాంటి ఉత్తమమైన పద్యాలూ, పాటలూ ఎలా మరచిపోగలం?

నేను మొట్ట మొదటి సారి విమానం ఎక్కింది బాబాయ్‌తోనే. బొంబాయిలో షణ్ముఖానంద హాలులో 1976లో బాబాయ్, పిఠాపురంల కచేరీ ఏర్పాటు చేశారు. ట్రెయిన్స్ బంద్ వలన మిగతా ఆర్కెస్ట్రాని కాన్సిల్ చేసి నన్నూ, వాసురావుని, తబ్లా ప్రకాష్‌ని మాత్రం ఫ్లయిట్‌లో తీసుకెళ్లారు. టిక్కెట్టు సుమారు 450/- కారవెల్లీ విమానం. ఆ ప్రోగ్రాంకి నౌషాద్ గారు చీఫ్ గెస్ట్. నన్ను చాలా మెచ్చుకొని దీవించారు. ఆతర్వాత చాలా ఏళ్ల తరువాత నౌషాద్ గారి సంగీత దర్శకత్వంలో 2మలయాళం సినిమాలకి ప్రసాద్ డీలక్స్ థియేటర్‌లో 2పాటలకి నేను కీబోర్డ్ వాయించాను. అది నా అదృష్టం.

సత్యం బాబాయ్‌కి ఇద్దరు పిల్లలు. అమ్మాయి నాగలక్ష్మి. అల్లుడు రవి జి.ఎస్.ఐ.లో పనిచేస్తున్నారు. ప్రస్తుతం హైదరాబాద్‌లోనే ఉంటున్నారు. వాళ్లకి ఒక కూతురు, పద్మిని. త్వరలో వివాహం చేయనున్నారు. కొడుకు ఎమ్.వి.ఎన్. మూర్తి ప్రఖ్యాత కూచిపూడి డాన్సర్. సంగీత దర్శకుడు ఎమ్.ఎస్. శ్రీరాం గారి పెద్దమ్మాయి శుభని వివాహం చేసుకున్నాడు. వీళ్లకి ఒక పాప, నాగ ప్రతిభ. మా చిన్నమ్మ పేరు ప్రభావతి. చిన్నమ్మ పోయి సుమారు 4 ఏళ్లు అవుతున్నాయి. బాబాయ్ చనిపోయి 2 ఏళ్లు అవుతున్నాయి. మాధవపెద్ది వంశానికి ఎంతో కీర్తి ప్రతిష్ఠలు సంపాదించి పెట్టాడాయన. బాబాయి,పిఠాపురంల రజతోత్సవసభ హైదరాబాద్‌లోనే చేశారు. అప్పుడు అందరు గాయనీ గాయకులు పాడారు. నేను ఎకార్డియన్ వాయించాను. బాబాయ్, పి.లీల గార్ల 50 ఏళ్లు సెలబ్రెషన్ మళ్లీ హైదరాబాద్‌లోనే చేశారు. నా ప్రోగ్రామ్ జరిగింది. బాలు గారి 30 ఏళ్లు సెలబ్రేషన్ కూడా అప్పుడే జరిగింది. ఈ రెండు ప్రోగ్రామ్‌లు టి.సుబ్బరామిరెడ్డిగారే చేయటం ముదావహం. ఆ రెండు ప్రోగ్రా మ్స్‌లో పాల్గొనటం నా అదృష్టం.

పద్యం, పాట ఉన్నంతకాలం బాబాయి అందరి హృదయాల్లో ఎప్పుడూ ఉంటాడు. బాబాయితో ఎన్నో అనుభూతులు పంచుకోవటం నా పూర్వజన్మసుకృత ఫలం.

